# చెప్పులు కుడుతూ...కుడుతూ...




ఆంగ్లమూలం : ఎమ్మా రోషాంబు క్లా

తెలుగు : వి.వి.న. మూర్తి

# ముందుమాట

నేను మాదిగలతో చాలా కాలం గడిపాను. వారి గాథలను విన్నాను. సంప్రదాయాలను తెలుసుకున్నాను. భారతీయ గ్రామీణ సమాజపు జీవితాన్ని రవ్వంత తీసుకున్నాను. భారతదేశపు సామాన్య ప్రజల ధార్మిక జీవితపు గుండెచప్పుడు విన్నాను.

దక్షిణ భారత ప్రాంతంలో నిరాడంబరులూ, బాగా నిర్లక్ష్యం చేయబడినవారూ మాదిగలు. తెలుగు నాట తోలుపని చేసేవారు. శతాబ్దాలుగా వారు చర్మాలను పదును చేశారు. చెప్పులు కుట్టారు. శూద్రుల నూతుల కోసం తోలు బాల్చీలను తయారు చేశారు. వారి ఎద్దులకు పట్టీలు తయారుచేశారు. చేతులతో చెప్పులు కుదుతూనే వారి సత్యాన్వేషణ జరిగింది. వారు చెప్పినదానినే నేను వివరిస్తున్నాను. ఇది నాకు ఒక విధముగా అపరిచిత విషయము. మాతంగి సంప్రదాయం గురించి, చర్మ నిష్టలుశాఖ గురించి, పేరంటాలు అనే సంప్రదాయం గురించి నా దృష్టికి వచ్చిన అనేక సంస్కరణ మత శాఖల గురించి, అంతా ప్రజలనించి నేను తెలుసుకున్నదే. నేను ప్రజలనుంచి తెలుసుకున్నదానికి తిరుగులేని సాక్ష్యంగా ఇతరుల పరిశోధనలను నేను ఉటికించలేను.

క్రిస్టియానిటీ ప్రస్థానపు కథలో–

నా మాదిగ స్నేహితుల నుండి ఇదంతా విన్నప్పుడు నేను పొందిన అద్భుతానుభవాన్నీ విశిష్ట మౌలికతనూ ఇంగ్లీషులో చెప్పేటప్పుడు కొంతయినా మిగల్చగలిగానని నమ్ముతున్నాను. పదిహేడేళ్ళుగా వారిలో చాలామందిని నేను ఎరుగుదును. వాస్తవికంగా అచ్చంగా వారి జ్ఞాపకాలను చిత్రించటానికి నాకు తగినంత లోతైన గుర్తులు ఉన్నాయి.

ఒంగోలులో ఆయన తొలిదినాలను నా భర్త రెవరండ్ జె.ఇ.క్లౌ.డి.డి. చెపుతూండగా విన్న సమాచారం మీదనే ఆధారపడటం నా ఉద్దేశం కాదు. మాదిగల స్థానంలో నిలబడి వారి నేత్రాలతో పరిస్థితిని చూడాలన్నది నా కోరిక. కనుక నా భర్త చెప్పవలసిన కథ వేరే ఉండవచ్చు.

మాదిగలను కలుసుకుని దగ్గరగా చూసి, వారి జ్ఞాపకాలలో భద్రం చేయబడిన గాథలను తెలుసుకునే అవకాశం యిచ్చిన నా భర్తకూ, భారతదేశంలోని అనేకమంది మిత్రులకు నేను కృతజ్ఞరాలిని. ఒంగోలులోని ఒక యూరోపియన్ పెద్ద మనిషి ప్రజల నుంచి నేరుగా ఈ గాథలను సేకరించటానికి సహాయం చేశాడు. లండన్‌లోనూ, ఇండియాలోనూ గ్రంథాలయాలలో అన్వేషణకు ఎందరో ఉదారంగా సహాయపడ్డారు. రాయల్ ఏసియాటిక్ సొసైటీ సభ్యులనేకమంది నుంచి నాకు విలువైన సలహాలు అందాయి. వారందరికీ నా కృతజ్ఞతలు.

లండన్, 1899 ఇ.ఆర్.సి

# విషయసూచిక

# 1. ఒక పురాతన తెగ

ఇరవై ఏళ్ళ క్రితం దక్షిణ భారతదేశంలోని ఒంగోలు పట్టణంలో ఒకే ఏడాది పదివేల మంది మాదిగలు క్రిస్టియన్లుగా మారారు. దానికి కారణాలేమిటా అన్న ప్రశ్న వచ్చింది. ఒకేరోజు రెండు వేల రెండు వందల యిరవై రెండు మంది బాప్టిజం తీసుకున్నపుడు శ్రద్ధాళువులు పండగ చేసుకున్నారు. ఆశ్చర్యముతో కృతజ్ఞతతో నిండిపోయారు.

అయితే దానికి దారితీసిన పరిస్థితులను గురించి శ్రద్ధగా చర్చించినవారు, ఈ క్రిస్టియానిటీ మార్పిడి ఉద్యమానికి ముందుగా వచ్చిన కరువు గురించి తెలుసుకొని, అదే అసలు కారణమని సరిపుచ్చుకున్నారు. మలమల మాడ్చే ఆకలికి క్రైస్తవ మతానుభవం మీద కాంక్షకూ అనులోమానుపాతమని భావించారు. కరువు గడచిపోయిన చాలాకాలం తరువాత కూడా క్రిస్టియానిటీ ప్రజా ఉద్యమం కొనసాగింది. అరవైవేల మంది మాదిగలు క్రైస్తవులుగా పరిగణించబడుతున్నారు. తెలుగుదేశంలో ఒక ప్రాంతంలోని మాదిగ వారందరూ క్రైస్తవులయ్యారు.

ఈ తెలుగు మాదిగల గాథలను క్రైస్తవులూ, క్రైస్తవేతరులూ చెపుతూంటే వింటూ గడిపిన కాలంలో ఈ పెంటకోస్ట్ సంఘటనను మరోవిధంగా చూసేవారి ప్రశ్నలను నేను పట్టించుకోలేదు. మానవ హృదయంమీద భగవంతుని ప్రత్యక్షమహిమ కోసం వెదికాను. అది నాకు కనిపించింది. అదే సమయంలో క్రైస్తవం వైపు మూకుమ్మడి మార్పిడిని సాధ్యం చేసిన ప్రత్యేక పరిస్థితులను పరిశోధించడం పట్ల కూడా శ్రద్ధ వహించాను. నాకు అవీ దొరికాయి.

జనబాహుళ్యం మనసుమీదా, మేధ మీదా దేవుని ఆత్మపనిచేసే పద్ధతిని తెలుసుకోటానికి కేవలమూ చారిత్రక విమర్శనా పద్ధతులు సరిపోవు. విశ్వాసాల పరిధికి చెందిన వాటిని వివరించటానికి, విశ్లేషించటానికి హేతువు మాత్రం సరిపోదు. 'దైవశక్తి' అన్నది ఒకటి ఉంది. అలా అనుకోవటంలో భగవంతుని నిగూఢ లీలల మీద విశ్వాసం గలవాడు తృప్తిపడతాడు. అయితే సామాజిక దృష్టి కోణం నుంచి మాదిగల ఈ మతాంతరాన్ని చూసేవాడు. ఆ విధంగా తృప్తి పడడు. అధి భౌతిక శక్తులను పక్కన పెట్టినా, విశ్లేషణకూ విమర్శకూ అందని ఏదో ఒక అంశం, పరిసరాలకు సంబంధించిన ప్రతి ఒక అంశాన్ని తీసుకొన్నప్పటికి మిగిలిపోతుంది. ఆ అంశం క్రీస్తు సువార్తలో నిబిడీకృతమైన దైవశక్తి.

మాదిగ పల్లెల్లో ఉన్న సంప్రదాయాలతో విసుగెత్తిన వారు హిందూ గురువుల బోధనలతో ధార్మిక సత్యాన్వేషణ కొనసాగించారు. మిషనరి ఒంగోలుకు రాకముందే అలాంటి వారు ఒంగోలుమిషన్‌కు కేంద్రబిందువులయ్యారు. ఈ అంశం గమనించాక నాకు విషయం అర్ధమైనట్లు అనిపించింది. వారి యోగి గురువుల నుంచి తెలుసుకున్నదానితో బహుదైవత్వాల నుంచి ఏకైక దైవత్వం వయిపు తొలి అడుగులు వేశారు. ఇది వారి ఉన్నతమైన ఆధ్యాత్మిక కాంక్షకు సూచనే కాని, అంతకన్న ముఖ్యమైనదేంటంటే, అంతటితో వారి ఆసక్తి, దాహం చల్లారలేదు. క్రీస్తు సువార్త వారికి చేరినప్పుడు వారి హృదయాలలోని కృతజ్ఞత క్రైస్తవ ఉద్యమానికి గొప్ప ఊపునిచ్చింది.

మాదిగలను క్రైస్తవం వైపు ఆకర్షించటంలో బాగా ప్రభావితం చేసిన మరో పరిస్థితి వారి బలమైన కౌటుంబిక బంధం. వారి పునాదులను శతాబ్దాలుగా కరువులు, కాటకాలు, యుద్ధాలు తుడిచివేసినా మాదిగలు ఒక తెగగా తమ ప్రత్యేకత నిలబెట్టుకున్నారు. అస్పృశ్యులు (పరియాలు)గా నెట్టివేయబడినా భారతీయ సామాజిక జీవితంలోని అనేకానేక బృందాలలో వారు ఒక బృందంగా ఉండటం ఈనాటికీ మనం గమనించవచ్చు. మాదిగ సంప్రదాయం అనే విశిష్ట సంప్రదాయం వారికి ఉంది. వారి వాడలలో స్వయం విచారణాధికారం తెగపద్ధతులకు సంబంధించినది.

ఒంగోలు మిషన్ తొలి దినాలలోకి వెళ్తే ఈ ప్రభావం వ్యాపించిన అనేక కేంద్రాలను నేను కనుగొన్నాను. అవన్నీ కుటుంబ కేంద్రాలే. ఈ విచిత్రమైన కొత్త మతం సంగతిని మొదటిసారి తీసుకువచ్చిన మనిషి ఫలానీ ఫలానీ మాదిగ కుటుంబానికి చెందినవాడుగా అతనిని గౌరవించి ఆలకించేవారు. ఆ తరువాత కుటుంబమంతా కలిసి ఈ మతం సత్యమైనదా, సరయినదా అని చర్చించేవారు. ఆ తర్వాత వచ్చే చిన్ని చిన్ని మత ద్వేషాలను కలిసికట్టుగా ఎదుర్కొనేవారు.

జీసస్ క్రీస్తును తెలుసుకొని, ఇంటికి వెళ్ళి, కుటుంబం చేత వెలియేయబడి, కొత్త మతానికి ప్రచారకులయిన వారు కూడా ఉన్నారు. వీరు తమ కుటుంబం తమతో రావాలని నిశ్చయించుకున్నవారు. కౌటింబికబంధం వారిమీద ఎంత బలమైనదంటే విడిగా జీవించటమనేది అస్వాభావికంగా భావించబడేది, అరుదుగా జరిగేది.

ఇటువంటి కుటుంబ సంబంధాల ద్వారానే క్రైస్తవం తొందరగా వ్యాపించింది. సాంఘిక జీవితంలో అభివృద్ధి చెందుతామన్న భావన కూడా ఇలాగే వ్యాపించింది. క్రైస్తవం వారి సామాన్య సామాజిక జీవితాలను మార్చివేయటంలో ఎంత శక్తిమంతమైనదో శూద్రులు గమనించారు. అది తెగ మొత్తానికి సామాజిక విముక్తి అని వారు అనుకున్నారు.

" ఈ మతం వల్ల వాళ్ళు బాగుపడ్డారు. మనమూ పిల్లలను చదివించి గౌరవం సంపాదించుకోవాలంటే మనకూ ఆ మతం

సాయంజేస్తుంది". అనుకున్నారు శూద్రులు. ఇలా తెగల మధ్య ఉండే పోటీ స్వభావం క్రైస్తవానికి బలమైన జోడిగా పనిచేసింది.

మాదిగలు నిస్సందేహంగా చాలా పురాతన జాతి. ద్రవిడుల కన్న ముందుగానే భారతదేశాన్ని నివాసం చేసుకొన్న కోలారియన్ తెగ సంతతివారు అయుండవచ్చు. దక్షిణభారతదేశంలో ఆదిమ జాతులలో మాదిగలు ఒకరు. ద్రవిడ జాతులు దపదపాలుగా వచ్చి కూడా ఉండవచ్చు. బహుశ మాదిగలు ఈ ప్రాంతాన్ని ఆక్రమించుకున్న తొలి ద్రవిడ దండయాత్రికులయి ఉండవచ్చు. ఈవాదానికి ఆధారంగా కొన్ని వాస్తవాలను చూపిస్తా. మాదిగల గాథలు, సంప్రదాయాలలో ద్రవిడ జాతుల కుటుంబం పోలికలు కనిపిస్తాయి. వారి వాడలలో అదేవిధమయిన స్వయం నిర్ణయాధికారాలున్న ప్రభుత్వం చిన్న రూపంలోనైనా కనిపిస్తుంది. ద్రవిడ గ్రామీణ సమూహాలలో ఈ స్వయంపరిపాలనాపద్ధతి ముఖ్యమైన లక్షణం. వారు ద్రవిడ జాతులకు ముందువారని చెప్పే వాదానికి ఆధారంగా నాకు ఇంతకన్న బలమైన రుజువులు లభించలేదు.

ద్రవిడులు జాతి మూలాలకు సంబంధించి మేధావులు ఒక అంగీకారానికి వచ్చి వుంటే మానవజాతి కుటుంబంలో మాదిగల స్థానాన్ని నిర్ణయించటంలో ముందుకు వెళ్ళగలిగేవారం. కాని మనకు అనేక విరుద్ధ వాదాలు ఎదురవుతున్నాయి. పుర్రె లక్షణాలను బట్టి బ్లూమెన్ బాచ్, హెకెల్ యిద్దరూ ద్రవిడులు కకేషియన్‌లు కారు, మంగోలియనులూ కారు. ఆ రెండు జాతుల మధ్యలోని వారు అని కనుగొన్నారు. హెకెల్‌వాదం ప్రకారం ద్రవిడులు దక్షిణంవైపునుంచి భారత్‌లోకి వచ్చారు. ప్రస్తుతం హిందుమహాసముద్రంలో మునిగిపోయిన మానవుని తొలి భూమిగా ఆయన భావించే లెమూరియా ఖండం నుంచి వచ్చారు. డాక్టర్ లోగన్ శరీరధర్మశాస్త్రం ప్రకారం ద్రవిడులలో ఇండో-ఆఫ్రికన్ మూలాలు కనుగొన్నారు. స్కితియన్స్ రాకముందే భారతదేశంలో ఓ నీగ్రో జాతి వ్యాపించి ఉండేదని ఆయన అభిప్రాయపడ్డారు. డాక్టర్ కాడ్‌వెల్ శాస్త్ర పరీక్షను ఉపయోగించారు. ఆయన ద్రవిడులు ఉత్తరం వేపు నించి వచ్చారని అంటాడు. ద్రవిడ భాషా చిహ్నాలు వారి మార్గాన్ని తెలుపుతాయని అంటారు. ఆర్యులకు ముందే స్కితియన్‌లు వచ్చారు. ద్రవిడభాషలకు స్కితియన్ భాషా సమూహాలకు దూరపు సంబంధం ఉంది. అందువల్ల ద్రవిడులు స్కితియన్ జాతివారని ఆయన వాదిస్తారు. ఏమైనా ద్రవిడుల జాతి మూలాలు పూర్తిగా నిర్ధారించబడలేదు.

ఇండో ఆర్యులు శుద్ధంగా కాకేషియన్ జాతివారని పండితులు అంగీకరించారు. బహుశా క్రీ॥పూ॥3000 ప్రాంతంలో ఇండో జర్మన్ జాతిలో సంస్కృతం మాట్లాడే ఒక శాఖ ఉత్తరం నుండి భారతదేశంలో ప్రవేశించారు. ఉత్తర భారతంలో యుద్ధాలు, దండయాత్రలు వారిని ముందుకు నడిపాయి. పురాతన ఋషులు ఋగ్వేద శ్లోకాలలో వేదాలలోని యుద్ధదేవుడిని ఇలా ప్రార్థిస్తారు – ' ఓ ఇంద్రా! నీ ఆయుధం మాటలేని దస్యులను ఛేదించుగాక! సరిగ్గా మాట్లాడలేని ప్రజలను యుద్ధంలో వధించుగాక."

ఆ తరువాత కాలంలో ఇండో ఆర్యులు దక్షిణంగా వెళ్ళడం మొదలయినపుడు వారి చేతుల్లో ఆయుధాలు లేవు, పెదాలపై ఇంద్రునికి ప్రార్ధనలు లేవు. వాళ్ళు శాంతి జిత్తులను ఉపయోగించారు. ఆర్య ఋషులు దక్షిణపు అరణ్యాలలో నివాసం ఏర్పరచుకున్నారు. ద్రవిడులకి శిక్షకులుగా, స్నేహితులుగా అయారు. పురాతన ద్రవిడుల గురించి తెలుసుకోటానికి ఈ ఆర్య ద్రవిడ సంబంధాలకు ముందు ఎలాంటి ఆధారాలు లేవు.

ద్రవిడులకు గల అనేక వనరుల కారణంగా గర్విష్టులయిన ఆర్యులు వారిని నిర్లక్ష్యం చేయలేకపోవటమన్నది సందేహాతీతమైనది. అపారమైన సంపద ఉంది. భద్రమైన నగరాలలో నివశిస్తున్నారు. ఆయుధాలతో యుద్ధం చేస్తున్నారు. రాజులు పరిపాలిస్తున్నారు. అంతస్సంబంధాలు గల నాలుగు భాషలను ద్రవిడులు మాట్లాడేవారు. అవి తమిళం, తెలుగు, కన్నడం, మళయాళం. ఆర్యుల ప్రభావం పడకముందు వారికి సాహిత్యం ఉందా అన్నది సందేహాస్పదం. శుద్ధమైన భావాలలో వారు వెనకబడి ఉండవచ్చుగాని, మిగిలిన అన్ని రకాల భావాలను వ్యక్తీకరించటానికి తగినన్ని సాధనాలు వారి భాషలకు ఉన్నాయి. వారు అనుభవంమీద ఆధారపడ్డ ప్రజలు. వలస వచ్చిన ఆర్యులు ద్రవిడ భాషలను నేర్చుకోవలసి వచ్చింది. స్థానిక భాషలలో సంస్కృతపదాలను ప్రవేశపెట్టడంతో తృప్తిపడవలసి వచ్చింది.

ఈ రెండు జాతుల సామాజిక వ్యవస్థలలో చాలా అంతరం ఉంది. ఉత్తరాదికి చెందిన ఆర్యులు దక్షిణాది వలసలు ఆరంభించకముందే కుల వ్యవస్థ ఆర్యులలో పాదుకొంది. హెచ్చుతగ్గులకు సంబంధించి ద్రవిడులకు తెలిసిన భేధం ఒక్కటే. పాలకులు, ప్రజలు. ఈ భేదం అన్ని ఆదిమ సమాజాలలోనూ ఉన్నదే. బలమై బ్రాహ్మణ వారసత్యం ఆర్యులదైతే ద్రవిడుల పూజారులు స్వతస్సిద్ధంగా తమ మంత్ర తంత్రాలతో అందరి మన్ననలనూ పొందినవారు. ఆర్యులు చనిపోయిన వారిని దహనం చేసేవారు. విధవలలో పునర్వివాహం నిషేధించారు. మాంసాహారాన్ని రక్తం చిందటాన్ని అసహ్యించుకునేవారు. అందుకు బదులుగా ద్రవిడులు చనిపోయినవారిని ఖననం చేసేవారు, విధవలు పునర్వివాహం చేసుకొనేవారు. అన్ని రకాల మాంసాలు తినేవారు. రక్తం చిందకుండా, మద్యం విరివిరిగా వాడకుండా వారి పండగలు జరిగేవికావు.

ఈ రెండు జాతులూ కలుసుకున్న కొత్తలో వారి ధార్మిక విధానాలలో శతృత్వం ఉండి ఉండవచ్చు. కొత్తగా నివాసాలు ఏర్పరచుకొన్న బ్రాహ్మణీయులు అతిశయోక్తులు నిండిన ప్రాచీనభాషలో ఈనేక నిందలు వేశారు. " ఆస్తికులు సర్వసంగ పరిత్యాగులు అయిన ఋషుల చెవులలో భయంకరమైన శబ్దాలు చేసిన అవిశ్వాసులైన ప్రాణులు అన్నారు. ఆశ్రమ ప్రాంతాలలోని

దట్టమైన అడవులలో దాక్కుని ఈ భయానకమైన ప్రాణులు భక్తులను భయపెట్టడంలో ఆనందించేవారు యజ్ఞాలు చేసేటప్పుడు వచ్చేవారు, భాండాలని, పుష్పాలని, సమిధలని ఎత్తుకుపోయేవారు. యజ్ఞ సామాగ్రిని మైలపరిచేవారు. రక్తంతో ఆహారాలను ప్రసాదాలను కలుషితం చేసేవారు– అన్నారు.

తెగలు, జాతుల కలయిక, సంప్రదాయాలు మత పద్ధతుల సమ్మిశ్రణంతో కూడిన ఆధునిక హిందూత్వానికి అది శైశవదశ. అప్పుడు మాదిగలు వారి వంతు వారు అనుభవించారు. వారి మాతంగి సంప్రదాయంతో వారు బాగా వెనుకబడిపోయారు. వృత్తి ద్వారా చర్మకారులైన మాదిగలు అస్పృశ్య (పరియా) తెగలలో చిట్టచివరివారయిపోయారు. అయినప్పటికీ ఈనాటి వారి ధార్మిక సామాజిక ఆచార వ్యవహారాలలో వేలాది సంవత్సరాల భారతదేశపు వేళ్ళు కనిపిస్తాయి. కనక క్రైస్తవానికీ, ఈ ప్రాచీన తెగకీ తొలికలయిక చాలా ప్రత్యేకమైనది.

# 2. తెగ నాయకుని ఆచారాలు

ఆదిజాంబవుడిని తమ మూలపురుషునిగా మాదిగలు గర్వంగా చెప్పుకుంటారు. ఆయన 'మాదిగల పితామహుడు' ప్రపంచం ఆరంభానికి ఆరునెలల ముందే వెలసినవాడు. ఆర్యుల దండయాత్రలతో భారతదేశంలో 'ప్రపంచం మొదలయింది. అప్పుడున్న ఆదివాసులలో ఈ మానవుడు 'అది మాదిగ' ఒకరు.

అప్పటికి ఆది జాంబవుడు చాలా గొప్పవాడు. ఏది ఏమైనప్పటికీ యుద్ధం చేయాలనుకున్నప్పుడు శ్రీరాముడు మొట్టమొదటిసారి అతని దగ్గరికి వెళ్ళి పెద్దవానిగా సలహా అడిగి ఆతర్వాత అతను చెప్పింది చేశాడు. ఆర్యులు మొట్టమొదటిసారి ఈ భూమి పుత్రులతో సంబంధం పెట్టుకున్నారు. ఆనాటికి ఆయన ఎంత గొప్పగా ఉన్నప్పటికీ, ఆదిజాంబవుడికి ఆతర్వాత అపమానాల దశ ఆరంభమైంది. ఆయన ఉన్నత స్థానం నుండి పడిపోయాడు.

ఆ రోజులలో కామధేనువు అనే సమస్త సంపదలు యిచ్చే ఆవు ఉండేది. వెల్లమను అనే బాలుడు ఈ గోవును మేపుతుండేవాడు. ఆవు పాలు యిచ్చేది. ఈ నేలమీద ఆదివాసీలు పూజించే శక్తిస్వరూపమైన ఆదిశక్తి స్వయంగా దేవతలకి కామధేనువు పాలు తాగటానికి అనుమతించింది. వెల్లమనుకి ఆ పాలని రుచిచూడాలని కోరిక పుట్టింది. కాని దేవుళ్ళు " ఏ విధంగానూ నువ్వు అందులో వాటా అడగటానికి వీల్లేదు" అన్నారు. అతనికి కోరిక తగ్గలేదు. ఒక రోజు జబ్బు చేసినట్టుగా పడుకున్నాడు. దేవతలు పాలు తాగి వదలిన పాత్రను దొంగతనంగా తీసుకుని అందులో నీళ్ళు పోసి దాన్ని తాగాడు. 'పాలే ఇంత రుచిగా ఉంటే మాంసం యింకెంత రుచిగా ఉంటుందో' అనుకున్నాడు. కామధేనువుకి అతని చెడ్డ ఆలోచనలు తెలిసిపోయాయి. తన మాంసం తినాలన్న ఆలోచన ఎవరికైనా కలిగేసరికే కామధేనువు తన శక్తులన్నీ కోల్పోయి మరణించింది.

దేవుళ్ళు జరిగిందంతా విన్నారు. వాళ్ళు అక్కడికి వచ్చి కామధేనువు చనిపోవటం చూశారు. వాళ్ళు ఆదిజాంబవుడి దగ్గరకు వెళ్ళారు. "నువ్వు మనందరిలోనూ గొప్పవాడివి. కనక నువ్వు దీన్ని నాలుగు భాగాలు చెయ్యాలి అన్నారు. ఆయన ఆ విధంగా చేశాడు. తనకొక భాగం ఉంచుకుని బ్రహ్మ, విష్ణువు, శివుడికి తలో భాగం యిచ్చాడు. వాళ్ళు తమ భాగాలు తీసుకుని వెళ్ళిపోయారు.

ఇంతలో వాళ్ళు తిరిగి వచ్చి "మాకు ఆవు తిరిగి కావాలి అన్నారు. వాళ్ళు మూడు భాగాలు తెచ్చి, ఆది జాంబవుడి భాగాన్ని అడిగారు. ఈలోగా ఆ బాలుడు, వెల్లమను, ఒక ముక్కను తీసి ఉడకబెడుతున్నాడు. అది కుండలో ఉడుకుతుండగా, ఆ మాంసంలోని ఒక చిన్న ముక్క పైకి లేచి నిప్పులో పడింది. అతను దాన్ని ఎత్తి, ఊదుతూండగా అతని నోటి తడి మాంసానికి తగిలింది. దాన్ని తిరిగి కుండలో వేశాడు.

ఆదిజాంబవుడు తన భాగాన్ని తీసుకుని తతిమా మూడు భాగాలలో కలిపి ఒక కొత్త ఆవును సృష్టించటం మొదలుపెట్టాడు. కాని పాపం! ఉడికి, ఊదబడిన ముక్కను దాని స్థానంలో పెట్టలేకపోయాడు. కామధేనువు అంతకు పూర్వంలా లేదు. దాని మెడ దగ్గర అంతకు ముందున్న మాంసం పోవడంతో చర్మం వేళ్ళాడుతోంది. అన్ని విధాల అది తగ్గిపోయింది. ఎంతో గొప్పగా రెండు తలలతో ఉండే కామధేనువు ఈనాటి ఆవు పరిమాణానికి దిగజారిపోయింది.

' ఆదిజాంబవుడు తన ఉన్నత స్థానం నుంచి కిందకి వచ్చి మన కింద ఉండాలి' అన్నారు దేవుళ్ళు. ఆ విధంగా అతని అవమాన దశ ఆరంభమైంది. తనకోసం ఆదిజాంబవుడు ఒక బావిని తవ్వుకుంటే వెల్లమాను మరొబావిని తవ్వుకొన్నాడు. వారమధ్య కులభేదం పుట్టింది.

మాదిగల పితామహుని గాథ అది. అయితే ఎవరి ప్రమేయం వల్ల ఇంత తీవ్రమైన మార్పు వచ్చిందో ఆ బాలుడు వెల్లమను ఎవరు? అస్పృశ్యులలో వల్లువలు అనే పూజారి కులం ఉంది. బ్రాహ్మణ ఋషులకు మాత్రమే తెలిసిన పూజా శాస్త్రాలను పోలిన విద్యను ఈనాటికీవారు ఎంతో శ్రద్ధగా రక్షించుకున్నారు. సంస్కృతశాస్త్రాల చిహ్నాలు అందులో కనబడుతుంటాయి. ఆదివాసీ తెగలతో ఆర్యులు స్నేహపూర్వకంగా ఉండి వారి ఆశ్రమాలలో విద్యాభోదన చేస్తున్న రోజులకు అవి తార్కాణాలు. కుల భావాలు విభేధాలు ఏర్పడుతున్నప్పుడు కొత్త పాతల మధ్య 'వల్లువలు' ఒక గొలుసులా ఉండి ఉంటారు.

ఆ బాలుడు వెల్లమాను దేవుళ్ళకి పాలు సమర్పించాలి. దేవుళ్ళను అభిమానించి, ఆ పాలు తాగేందుకు ఆదిశక్తి అనుమతించింది. అంటే ఆర్యులు ఆదివాసుల భావన స్వంతం చేసుకొని, వారి ఆచారవ్యవహారాలలో కలిపేసుకొనిపోతున్నప్పుడు ఆ అనుమతి లభించింది. కాని ఆ బాలుడు వెల్లమాను దేవుళ్ళ పానీయంలో వాటా తీసుకోవటంతోటే అయోగ్యుడు అయిపోయాడు. మాంసం మీద కోరిక అతని మనసులో నిండిపోయింది. ఇది ఆర్యులకీ, ద్రవిడులకీ మధ్య ఉన్న తీవ్రమైన వివాదం. ఎందుకంటే ద్రవిడులు మాంసం తింటారు. అది వారి మధ్య తొలి స్నేహ సంబంధాలను అల్లకల్లోలం చేసింది. ఈ మార్పుకి కారణం సామాజికంగా వారి మధ్య పొసగకపోవటం.

ఆది జాంబవుడి గుర్తులకోసం అనేక గ్రంధాలను వెదికాను. నాకు అనేకం లభించాయి. పురాణ కాలం నుంచి ఆయన వారసులు మన రోజుల వరకూ ఆయన్ను తీసుకువచ్చారు.

కర్ణాటకకు చెందిన మాదిగలలో 'జంబు' అనే పూజారి జాతి ఉంది. వారికి లౌకికులతో వివాహసంబంధాలు లేవు. అందరూ ఇచ్చిన దానిమీదనే ఆధారపడి జీవిస్తారు. వారసత్వంగా వచ్చే పూజారిత్వంతో పెద్ద పూజారి తరచుగా పల్లెలు తిరుగుతాడు. తన అనుయాయులకు బోధలు చేస్తుంటాడు. తెగ పెద్ద కాలక్రమంగా పూజారి పెద్ద అయాడని గ్రహించటం కష్టంకాదు. తెగ చెల్లాచెదురవుతూండగా దూరప్రాంతాలకు వలస పోయినవారి మీద పూజారుల వారసత్వం పట్టు కోల్పోయింది. జనాభా లెక్కలలో మాదిగల ఉపకులాలుగా చెప్పబడే జాంబవులు, జాంబవంతులు ఆది జాంబవుడికి దగ్గరి వారసులయుంటారు.

'మాదిగల పితామహుడు" రామునికి యుద్ద విషయాలలో గౌరవనీయుడైన సలహాదారుడని పురాణగాథ చెపుతుంది. గొప్ప సంస్కృతిక ఇతిహసమైన రామాయణాన్ని ఆది జాంబవుడి చిహ్నాలకోసం తిరగేశాను. కవి ఎలుగుబంట్ల నాయకుడు జాంబవంతుని గురించి చెపుతాడు. బహుశా ఆయన ఆదిమాదిగ అయిన ఆదిజాంబవుడయుండాలి. కవిత్వపు ముసుగులో ఇతర వీరులతో సమానం చేయటానికి జాంబవంతుడు గౌరవప్రదంగా చెప్పబడ్డాడు. అతని భావాలు సుదీర్ఘంగా వివరించబడ్డాయి.

రామునికి యుద్ధంలో సహాయపడిన వీరులను చెప్పటపుడు రామాయణ కవి వారిని దృశ్యమానం చేసేందుకు వారి రాజ చిహ్నాలతో వారిని సంభోదించాడు. వానరులు, ఎలుగుబంట్లుగా చెప్పబడినవారు బహుశా ఆ జంతువులను పూజించి ఉండేవారయుండాలి. ద్రవిడ రాజవంశాలకు వారి ధ్వజాలుగా జంతువులు ఉండటం వల్ల చేరులకు ఏనుగులు, పల్లవులకు పులులు, జాంబవంతుని తెగకు ఎలుగుబంటి ధ్వజం కావడం వల్ల చేరులకు ఏనుగులు, పల్లవులకు పులులు, జాంబవంతుని తెగకు ఎలుగుబంటి ధ్వజం కావటం వల్ల కవి ఆ విధంగా వారిని సంభోదించి ఉండవచ్చు. దండకారణ్యం బుందేల్‌ఖండ్‌కి దక్షిణంగా కృష్ణానది వరకూ విస్తరించి ఉండవచ్చు. ఈ రోజున మాదిగలు చెల్లాచెదరుగా వ్యాపించి ఉన్న ప్రాంతంలోనే ఆనాడు రాముడి సైన్యం పోగయింది.

రామాయణం కథా నాయకుడు రాముడు ఓథ్‌కి చెందిన రాజకుమారుడు. ఆయన్ని వనవాసానికి పంపాక, తన సారధిని నగర సరిహద్దులలో వదిలేశాక దండకారణ్యంలో ప్రవేశించాడు. రాముని మీద భక్తిశ్రద్ధలు గల భార్య సీత, ఆర్య స్త్రీలలో అందగత్తె ఆయనని అనుసరించింది. భర్త మీద అనురాగంతో అరణ్యవాసంలోని కష్టాలను భరించింది. ఈనాటి సిలోనును ఆనాడు పాలించే రాక్షసుల ప్రభువు రావణుడు వచ్చి ఆమెను తీసుకుపోయాడు. రాముడు పత్నీ వియోగంతో కృంగిపోయి ఆ ప్రాంతంలోని బలమైన తెగల నాయకులని కలిసి సీతని రక్షించటంలో సహాయం కోరాడు. వానరుల పెద్ద అయిని సుగ్రీవుడు అందరిలోకి శక్తిమంతుడైన మిత్రుడు. కాని, ఇతరులు కూడా ఉన్నారు. వారిలో ఎలుగుబంట్ల నాయకుడు జాంబవంతుడు సుప్రసిద్ధుడు.

సీత రక్షణకోసం అందరితోనూ కూడిన గొప్ప సైన్యం బయలుదేరింది. వారు దక్షిణం వైపు సాగి సముద్రాన్ని చేరుకుని ఆగిపోయారు. రాముని మనోహరమైన భార్య సీతను రావణుడు చెరపట్టి ఉంచిన లంక అవతలి ఒడ్డున ఉంది. సముద్రం ఒడ్డున బలవంతులైన వానరులు నిలబడి ఈ అగాధాన్ని దాటాలని గ్రహించారు. వాళ్ళు కలవరపడ్డారు "వానర వీరులారా! మీమీ శక్తులను ప్రదర్శించండి. లంఘించండి!'' అంటూ మహా సేనాధిపతి సుగ్రీవుడు అజ్ఞాపించాడు. అనేకమంది గట్టిగా చెప్పారు. కాని ఎవరూ ఆ ఘనకార్యాన్ని చేయటానికి ముందుకు రాలేదు.

చివరకు జాంబవంతుడు అన్నాడు '' ఒకప్పుడు నాకు లంఘించే శక్తి గొప్పగా ఉండేది. నేను వృద్ధుడినయిపోయాను. నా శక్తులు ఉడిగిపోయాయి. నేనిప్పుడు లంఘించలేను.'' మహాజ్ఞాని అయిన జాంబవంతుడు అన్నాడు. "కాని సేనాధిపతి ఆజ్ఞాపించినపుడు ఆయన గౌరవాన్ని కాపాడటం సేవకుల విధి." జాంబవంతుని సలహా ఫలించింది. చిట్టచివరికి వానర శ్రేష్ఠుడైన హనుమంతుడు అతని ధైర్యమూ ప్రతిష్టా గుర్తుచేయగా సముద్రాన్ని లంఘించటానికి సిద్ధమయాడు.

బలవంతుడైన రావణుని భవనం నుంచి ఎంతో శక్తియుక్తులతో పరాక్రమంతో సీత రక్షించబడింది. రాక్షస వీరులతో బాటు రావణుడు నేలకొరిగాడు.

మాదిగలకు సంబంధించిన ఇతర గాథలన్నింటిలోనూ అవమానాలు, అణచివేతలూ ఉంటాయి. "ఎలుగుబంట్ల నాయకుడు జాంబవంతుడు" ఆది జాంబవంతుడితో సహా ఉన్నత స్థానంలోనే ఉంటారు. వారిని ఎవరూ తక్కువ చేయరు. వారి ఆదిమకీర్తిలో వారికి సముచిత స్థానం ఎప్పుడూ ఉంటుంది. వారి వారసులు మాత్రం పూర్తిగా వెలివేయబడ్డారు!

# 3. మాతంగుల రాజు

మాదిగలు ఒకప్పుడు ఒక తెగ అయుంటే, వారిని పాలిస్తున్న తెగనాయకుడు కావ్యాలలోనూ, ఇతిహాసాలలోనూ ప్రముఖుడైనప్పుడు చారిత్రక శాసనాలలో ఎక్కడో ఒకచోట ఏదోవిధంగా ప్రస్తావించబడాలి. కాని చారిత్రాత్మకంగా నిస్సందేహమనిపించే ఆధారం ఏదీ ఎక్కడా లభించలేదు. ఏమైనా ఇదేమంత ఆశ్చర్యకరమైన విషయం కాదు. ఆర్యులు వచ్చి ఆశ్రమాలు ఏర్పరుచుకొని ద్రవిడుల భాషలను కేవలం గ్రంథాలకే కుదించే నాటికి ద్రవిడులలో సాహిత్యం లేదు. జ్ఞానులైన రుషులు కాలపట్టికలు రాయడంలో ఆసక్తి కనబరచి ఉంటే, వారు నివాసాలు ఏర్పరచుకుంటున్న ప్రాంతంలోని తెగలతో ఎలా వ్యవహరించినదీ గ్రంథస్తం చేసివుంటే ప్రాచీన భారతదేశ చరిత్ర ఇన్ని ఊహలకు కల్పనలకు నెలవుఅయివుండేదికాదు. మత విషయాలమీద, అభౌతిక విషయాలమీద, స్మృతులమీద, రెండు గొప్ప సంస్కృత ఇతిహాసాల మీద ఆర్యుల జ్ఞానం విద్య వెచ్చింపబడ్డాయి. చారిత్రక సమాచారం చాలావరకు వీటినుంచే సేకరించాలి. నిష్పాక్షికంగా కొన్ని సంఘటనలను పరిశీలించటానికి, అవి జరిగాయని నిశ్చయించటానికి కవిత్వపు అతిశయోక్తులతోనూ మత అవసరాలకోసమూ రాసిన ఈ గ్రంథాలు సరిపోవని మనం గుర్తించుకోవాలి.

అయినా భారతదేశపు పురాతన వాసులు వారి తరువాత తరాలవారు తమని గుర్తుంచుకోవాలి అనే మానవ సహజమైన ఆకాంక్షకు అతీతులు కారు. వారు చేసిన కార్యాలను తమ వారసులకు అందించటానికి చాలా శాశ్వతమనుకున్న ఒక పద్ధతి అనుసరించారు. శిలాఫలకాలమీద, తామ్రఫలకాలమీద జ్ఞాపకార్థంగా నిలబెట్టిన రాళ్ళమీదా, విగ్రహాల పీఠాల మీదా, దేవాలయాల గోడల మీదా స్తంభాలమీదా వాళ్ళు తమ పేర్లను, విజయాలను, శత్రువుల పరాజయాలను చెక్కారు. రాజవంశాల చరిత్ర, చరిత్రలోని నగ్నసత్యాలు తెలుసుకోదలిచిన విద్యార్థికి యివి చాలావరకు విశ్వసనీయమైన ఆధారాలు.

ఇతర తెగలతో బాటు ఒక తెగగా మాదిగలను గుర్తించాలంటే ఏదైనా శాసనాల మీద ఒక ఆధారం లభించితే ఊహాపోహలతో నిండిన చరిత్ర నుండి బయటపడి కొంతవరకూ గట్టి పునాది లభించి ఉండేది. ఈ రకమైన ఆధారం ఒకటి నాకు లభించిందనకుంటున్నాను. అది క్రీ॥శ॥ 634వ సంవత్సరం నాటిది. చాళుక్య వంశానికి చెందిన మంగలీసుడు అనే రాజు తొలి ద్రవిడ రాజవంశాలకు చెందిన కచ్చురులను జయించినప్పటిది.

కర్ణాటకలో అయిహోలవద్ద దేవాలయం బయట గోడమీద శిలాఫలకం మీద చెక్కబడిన శాసనంలో ఈ వాక్యాలు ఉన్నాయి.

"అతని తమ్ముడు మంగలీసుని గుర్రాలు తూర్పు పడమర సముద్రాల కట్టలమీద దడికట్టాయి. అతడి సైన్యాలు రేపిన ధూళితో భూమ్యాకాశాలూ సమస్త దిక్కులూ నిండిపోయాయి. అటువంటి మంగలీసుడు రాజు అయాడు. మాతంగ జాతి అనే అంధకారాన్ని తళతళలాడే కత్తులు అనే దివిటీలతో చెల్లాచెదురు చేశాడు. యుద్ధరంగమనే పెళ్ళిపందిరిలో కచ్చురుల అదృష్టదేవత అయిన అందాల భామను భార్యగా చేసుకున్నాడు."

మాదిగల పూర్వీకుల ప్రస్తావన ఆ వాక్యంలో ఉంది అనాలంటే మాతంగ అన్న పదానికి వివరణ మీద ఆధారపడాలి. ఈ పదానికి అనేక అర్థాలున్నాయి. ఇది "తక్కువ కులానికి చెందిన ఒక తెగ"గా కనిపిస్తుంది. మాదిగ అన్న పదం ప్రాచీనమైన మాతంగ అన్న పదం నుంచి వచ్చినదేనని పండితులు అంగీకరిస్తారు. అంతేగాక, మాదిగలలో ఒక పెద్ద ఉపకులము మాతంగి అని పిలవబడుతోంది. కర్ణాటకకు చెందిన మాదిగలు తమని తాము 'మాతంగి మక్కళు' అంటారు. అంటే అర్థం 'మాతంగి బిడ్డలు'.

అయితే ఈ పదం "ఒక ఏనుగు"ని కూడా సూచిస్తుంది. పద్దెనిమిదేళ్ళ క్రితం ఈ శాసనాన్ని కనుగొని వివరించిన ఫ్లీట్ దాన్ని "అంతగా బలంలేని ఒక ఆదివాసీ కుటుంబం" అని అర్థం చెప్పాడు. ఆ తర్వాత కొన్ని ఏళ్ళు గడిచాక తన కృషిని తిరిగి వివరిస్తూ ఆయన అన్నాడు. " ఈ శ్లోకాన్ని తిరిగి పరిశీలిస్తే 'మాతంగ' అన్న పదం సందర్భాన్నిబట్టి తీసుకుంటే "కచ్చువుల ఏనుగులు'' అని చెప్పటానికి వాడబడిందని నేను అనుకుంటున్నాను." ఆ విధంగా ఆ శాసనంలో మాదిగల ప్రస్తావన ఉందని ఊహించటం సందేహాస్పదంగా మారిపోయింది.

సంప్రదాయాల వేపు పురాణగాథల వేపు మరలక చేయగలిగిందేమీలేదు. అవి సామాజిక రాజకీయమార్పులను అర్థం చేసుకోటానికి కొన్ని ఆధారాలు యిస్తాయి. భారతదేశంలో జ్ఞాపకాలను భద్రపరిచే అసాధారణమైన శిక్షణ ఉంది. తమ తండ్రుల నుంచి విన్నవాటిని తమ బిడ్డలకు అందజేస్తారు. మరెక్కడా లేనంతగా పురాణ గాథలు విశ్వసనీయంగా ఉంటాయి. వృత్తి గాయకులు కూడా ప్రజల మధ్యకు వెళ్ళి గడచిన రోజుల్లో జరిగిన వాటిని కవితామయంగా పాడి వినోదపరుస్తారు. ఆ విధంగా గతం పూర్తిగా మరుగున పడిపోకుండా వర్తమానానికి చేరింది.

సంస్కృత గాథలలో మాతంగరాజుకి సంబంధించి కొన్ని గొప్ప కావ్య ప్రసక్తులు కనిపిస్తాయి. అవి ఆదివాసుల పట్ల ఆర్యుల వైఖరికి కొన్ని సూచనలు ఇస్తాయి. ఆ వర్ణనలు ప్రాగ్భాషలో అతిశయోక్తులు నిండి ఉన్నప్పటికీ ఒక అనాగరిక ఆదివాసీ తెగ విశిష్టలక్షణాలు వివరిస్తాయి. క్రీ॥శ॥ 606 ప్రాంతాలలో జీవించిన బాణభట్టుడు

అనే సంస్కృత గ్రంథకర్త కాదంబరి కథలో చబరుల నాయకుడైన మాతంగుడనే పేరుగల వాని గురించి ఇలా చెపుతాడు. "అతను ఇంకా వయసులో ఉన్నాడు. అతని దేహధారుఢ్యాన్ని చూస్తే ఇనుముతో చేయబడినట్లు కనిపిస్తుంది. అతనికి భుజాల వరకూ వేలాడే దట్టమైన ముడివేయబడిన జుత్తు ఉంది. అతని కనుబొమలు విశాలమైనవి. అతని ముక్కు గద్దముక్కులా సూటిగా ఉంది. అతనికి మయూర ఛత్రం పట్టినట్టు తేనెటీగలు గూమిగూడి ఎండ తగలకుండా చేస్తున్నాయి."

వేలాదిమంది అనుచరులతో ప్రవేశించిన యువనాయకుడు మాతంగుడి గురించి కవి ఇలా వర్ణిస్తాడు. "సూర్యకిరణాలతో చెదిరిన చీకటి మూకలా, మృత్యు సైనికులు తిరుగుతున్నట్లు, నరకాన్ని బద్దలుగొట్టుకుని పైకి లేచిన భూతాల ప్రపంచంలా, దండకారణ్యంలో నివసిస్తున్న మహర్షుల శాపాలతో కట్టిన తండాలా" ఉన్నారు.

ఈనాటి గర్విష్టి బ్రాహ్మణుడు అంటరాని మాదిగల గూర్చి అవలీలగా వెలిబుచ్చే అభిప్రాయాలతోనే ఆ కవి వారిని విపులంగా చిత్రిస్తాడు. "మద్య మాంసాలతో నిండిన వారి భోజనాన్ని ఉత్తములు అసహ్యించుకుంటారు. వారి వృత్తి వేట - వారి శాస్త్రం నక్కల అరుపు. వారి ప్రాణస్నేహితులు కుక్కలు" మాతంగుని అనుచరులు ఒక ఆటవిక ఆదివాసీ తెగవారు. ఇంతకు మించి ఈ కవి యింకేమీ చెప్పడు.

సంస్కృత గాథాసంగ్రహాలలో మనకు మరో మాతంగ ప్రభువు కనిపిస్తాడు. క్రీ॥శ॥ 1125 ప్రాంతాలలో జీవించిన సోమదేవ భట్టుడు వీటిని సేకరించాడు. కథా సరిత్సాగరంలో తను చెప్పిన కథలన్నీ చాలాకాలంగా జనం చెప్పుకుంటున్న కథలే అంటాడు. ఈ కథల జరిగిన కాలం ఈ కథలు సేకరించిన కాలానికి శతాబ్దాల వెకటిదని అర్థం.

కోటలకు భూతమైన దుర్గ పిశాచం తాలూకు అద్భుతమైన కథ చెపుతాడు. ఒక పని కోసం ఒక రాజు అతని మంత్రులూ దుర్గ పిశాచాన్ని ఆశ్రయిస్తారు. ఈ మాతంగ నాయకుడు గొప్ప పరాక్రమవంతుడు. రాజులు అతన్ని జయించలేరు. అతని తెగకి చెందిన బక్కుదుంది విలుకాళ్ళు అతని అజ్ఞానువర్తులు. అందులో ప్రతి ఒక్కడి కింద అయిదు వందల మంది యోధులు ఉంటారు. మాతంగుల దేశాన్ని చూస్తున్న రాజు మృగాంకదత్తుడు తమ మంత్రులతో "చూడండి! వీళ్ళు జంతువులులా అరణ్యవాసం చేస్తున్నారు. అయినా చిత్రంగా దుర్గపిశాచాన్ని తమ రాజు అనుకుంటారు. ప్రపంచంలో రాజులేని జాతిలేదు. మనుషుల్లో రాజరికం అనే ఆకర్షణీయమైన పద్ధతిని వారి భద్రత కోసం దేవుళ్ళు ప్రవేశపెట్టారు. అదిలేకపోతే పెద్ద వాటిని తిన్నట్టుగా బలవంతులు బలహీనులను మింగేస్తారని వారి భయం."

మాతంగరాజు మృగాంకదత్త రాజు కోరిక విని, ఈ చిన్న పనిని చేసిపెడతానిని మాటయిచ్చి, వినయంగా అంటాడు. "మా జీవితాలు మొట్టమొదట మీ కోసమే సృష్టించబడ్డాయి. వచ్చిన దూత అగ్రకులంవాడు. అయినా తనకి భోజనం పెట్టాలనుకుంటున్న మాతంగరాజుని సంతోషపరచాలనుకుంటాడు. అందుకోసం మాతంగరాజు తన సమక్షంలో భోజనం చేయటానికి అయితే కొంచెం దూరంలో కూడా సిద్ధపడతాడు. ఆ విధంగా, ఎంతో బలవంతులైనప్పటికీ, వారికి ఎంతో అమూల్యమైన సహాయం చేయగలిగినప్పటికీ ఆర్య ప్రభువుకీ ఈ ఆదివాసీ తెగనాయకుడికి స్పష్టమైన విభజన రేఖ ఉంది.

ఇంకొన్ని చదివాక చండాల కన్య కథ కనిపిస్తుంది. "ఆమె అందమైన ముఖం తన శత్రువు చంద్రుడిని ఓడించింది" ఎందరినో చంపి రెచ్చిపోయి తిరుగుతున్న ఏనుగుని మచ్చిక చేసి తన అదుపులోకి తెచ్చిన ఆ కన్యని ఒక రాజకుమారుడు ప్రేమిస్తాడు. "అతని మనసుని దొంగిలించటం వలన శూన్యమైన హృదయంతో రాజకుమారుడు ఇంటికి వెళతాడు. అతని తల్లిదండ్రులు ఆ కన్య గురించి విచారించి ఆమె చండాల రాజు అయిన మాతంగుని కుమార్తె అని తెలుసుకుంటారు. అతని తల్లి, రాణి అడుగుతుంది. "సుక్షత్రియ వంశంలో పుట్టిన' నా కొడుకు అధమ కుల కన్యను ఎలా ప్రేమించాడు. ఆ కన్య అగ్రకులంలో పుట్టినా ఏదో కారణం వల్ల మాతంగుల మధ్య పడిందని చెపుతారు. ఈ సిద్ధాంతాన్ని రుజువుచేస్తూ అనేక కథలు వస్తాయి.

మాతంగరాజు దగ్గరకు దూతను పంపుతారు. అతను అంగీకరిస్తాడు. అయితే పద్దెనిమిది వేలమంది బ్రాహ్మణులు తమ ఇంటిలో తినాలని షరతు పెడతాడు. శివుడు అతనికి శాపం విధించాట్ట. పద్దెనిమిదివేల బ్రాహ్మణులు అతని యింట్లో తినేవరకూ అతని వాళ్ళంతా మాతంగులుగా జీవించాలిట. ఆ తరువాత అతను తన అగ్రకులంలోని వెనుకటి స్థితిని పొందుతాడుట. వాళ్ళు అందుకు ఒప్పుకున్నారు గాని, వంట మాత్రం చండాలుల గృహానికి దూరంగా జరగాలన్నారు. శివుడి శాపం తొలగిపోయింది. రాజకుమారుడు ఉత్తమ కులాన్ని పొందిన ఆ కన్యను పరిణయమాడాడు.

బ్రాహ్మణీయ కల్పనలతో అతిశయోక్తులతో నిండిపోయిన ఈ కథలలో నిజజీవితం అనిపించే సూచనలు లేకుండా పోలేదు. ఆర్యులకుండే రాజు అనే భావనకీ ఆదివాసుల తెగ నాయకునికీ మధ్య తేడాను మృగాంకదత్తరాజు అర్థం చేసుకున్నట్లు లేదు. అందుకే అడవిలో జంతువుల్లా బ్రతుకుతున్నా మానవులలో ఎవరినో ఒకరిని రాజుగా గుర్తించే కోరిక ఉంటుందంటాడు. దుర్గ పిశాచ రాజుకి ఆర్య రాజుల్లా పన్నులు వేయటానికి జీవస్మరణ విషయాలను నిర్ణయించటానికి, ఏకాంత వైభోగంలో జీవించటానికి అధికారంలేదు. మాతంగ తెగకి నాయకునిగా బహుశా బోల్డంత భూమి, నౌకర్లు తగినంత ఆదాయం ఉండి ఉంటుంది. యుద్ధరంగంలో అతడు తన తెగని నడిపిస్తాడు. పరిపాలనా విషయాలలో కుటుంబ పెద్దలని సంప్రదిస్తాడు.

దుర్గ పిశాచరాజు బ్రాహ్మణీయ విశ్వాసంతో కొంతవరకూ అనవాజంగా బూటకంగా చూపించబడినా, మాదిగల పితామహుడు ఆదిజాంబవుని పోలికలు కనిపిస్తాయి.

# 4. చెల్లాచెదరవటం - దాస్యం

మాతంగ తెగ చెల్లాచెదరయిపోవటానికి, దాని వారసులు తెలుగుదేశమంతటా గ్రామాల బయట నివాసాలు ఉండటానికి అనేక కారణాలు కలిసి పనిచేసి ఉండవచ్చు. పురాతన కాలంలో తెగల మధ్య యుద్ధాలు బహుశా జరిగి ఉండొచ్చు. ఒక బలమైన తెగ చేతిలో ఓడిపోయి యుద్ధ పద్ధతుల ప్రకారం మాదిగలు దాస్యంలోకి నెట్టబడి ఉండొచ్చు. లేకపోతే, వృత్తికోసం అన్వేషిస్తూ, వారి పురాతన తెగ నివాసాలను మరిచిపోయేంతగా వలసలు వెళ్ళిపోయుండవచ్చు.

ఇండో ఆర్యులు క్రమంగా ప్రవేశపెట్టిన ఒక కొత్త సామాజిక క్రమానికి ముందు భారతదేశపు పురాతన చరిత్రను చిత్రించాలంటే కొన్ని అస్పష్ట ఆకారాలలో మాత్రమే సాధ్యమవుతుంది. పురాతన ద్రావిడ గ్రామీణ సమాజపు ఆచారాల ఆనవాళ్ళు ఇంకా మిగలాయి. కులభేధాలు తెలియని, అందరూ కలిసి పనిచేసి సమాజం అవసరాలు తీర్చుకుని, ఎవ్వరూ వెలివేయబడని ఆదిమ సమాజదశకు అవి గుర్తులు అవుతాయి.

దక్షిణ భారత ప్రాంతం బహుశా ద్రవిడ తెగలు లేదా వంశాల మధ్య విభజింపబడి ఉంటుంది. వారికి వారి నాయకులు, తెగలు రాజ్యాంగాలు ఉండి ఉంటాయి. ఈ వంశస్థులు సమూహాలుగా స్థిరపడి, గ్రామాలు ఏర్పరచుకొని అరణ్యాలు ఎక్కువవటం వల్ల పులులు, ఇతర భయంకరమై జంతువులనుంచి రక్షణకోసం కలిసికట్టుగా ఒకరికొకరు సహాయపడుతూ ఉండేవారు. వంశాలమధ్య యుద్ధాలు కూడా ఐకమత్యంతో ఎదుర్కోవలసి వచ్చేది. ప్రతీ గ్రామమూ తన కనీసావసరాలను తీర్చుకుంటూ ఉండేది. శ్రమ విభజన ఉండేది. అందుకు బదులుగా ప్రతి కుటుంబానికి కొంతభూమి కేటాయించబడేది లేదా వస్తు రూపంలో యివ్వబడేది. అది అందరికి సరిపోయేటంత ఉండేది.

వారసత్వంగా గ్రామపెద్దకి గ్రామంలో మంచి విశాలమైన భూమి లభించేది. ద్రవిడ గ్రామీణ విధానంలో గ్రామపెద్దరికం ఒక విశిష్టమైన మౌలిక లక్షణం. అదే ఈ రోజున మునసబులకి మూలం. దేవతల పూజాదికాలలో అదేవిధమైన ఏర్పాటు ఉండేది. గ్రామంలో వివిధ వృత్తుల వారికి, చాకలి మంగళ్ళకి చేసిన పనికి ఖరీదు చెల్లించకుండా కొద్దిపాటి భూమిని పన్నులు లేకుండా ఇచ్చేవారు. లేకపోతే అన్ని పరిపానలనో, ఇంత ధ్యానమునో వారు అందుకునేవారు. సరళమైన గ్రామీణ జీవితంలో తోలు పనివాడు బహుశా గౌరవనీయుడైన పనిమంతుడు. అతనికి అతని హక్కులుండేవి. వాటిని అందరూ గౌరవించేవారు. ఒకరినొకరు సేవలందించటమనే సూత్రం మీద సమాజంలో ఏర్పాట్లు జరిగేవి.

అయితే పీఠభూమికి బాగా దక్షిణ ప్రాంతాలలో ద్రవిడ రాజ్యాలు వెలసే దశ వచ్చింది. దండయాత్రలు జరిగాయి. మొట్టమొదట చిన్న చిన్న రాజులు ఉండేవారు. బలమైన రాజవంశాలకు వారు సామాంతులయ్యారు. గ్రామాలు ఓ కేంద్ర ప్రభుత్వంలో భాగాలయినాయి. ఆ ప్రభుత్వాలు పన్నులు విధించి కప్పాలు వసూలు చేసేవి. ద్రవిడ గ్రామాలలో కొత్త పద్ధతులు ప్రవేశించాయి. తన మౌలిక తెగ అధికారంతో కొద్దిపాటి న్యాయ విచారణాధికారాలతో ఉండే గ్రామ పెద్ద వెనుకబడ్డాడు. మరో గ్రామపెద్ద ఇంచుమించు ఈనాటి కరణం తప్పనిసరిగా చదువుకున్నవాడై గ్రామం లెక్కలు కడుతూ అంకెల రూపంలో లాభనష్టాలను చూపెట్టేందుకు ముందుకు వచ్చాడు. సరళమైన అవసరాలను తీర్చే సరళమైన విధానాలు గల రోజులు గతించాయి.

క్రమంగా ఆర్య వలసదారుల ప్రభావం ప్రస్ఫుటం కాసాగింది. తమ అరణ్యాలలో స్థిరపడుతున్న బ్రాహ్మణ రుషుల మేధో ఆధిక్యతను చూసి ఆదిమ ద్రవిడులు గౌరవంతో నిండిపోయారు. వాళ్ళకి శిష్యులయ్యారు. వారిని యజమానులుగా చూడసాగారు. ఉత్తర ప్రాంతాలనుంచి వచ్చే బాటసారులు ఆ ప్రాంతం గూర్చి చెప్పే కథలను సహజ కుతూహలంతో శ్రద్ధతో తప్పకుండా వినేవారు. ఉత్తర ప్రాంత పరిపాలకులైన క్షత్రియుల పరాక్రమ గాథలను విన్నారు. వైశ్యవర్తకులు వారిలో ఉండేవారు. ద్విజులు (రెండుసార్లు పుట్టినవారు) అయిన ఆర్యుల మూడవ కులానికి వారు ప్రతినిధులు.

ఉత్తర భారతదేశంలో నాలుగవ కులం ఉండేది. వారు శూద్రకులస్థులు. ఆర్యుల దండయాత్రలలో ఓడింపబడిన ఆర్యుల సేవకులు శూద్రులుగా ఉండేవారు. స్వతంత్రులు, ఓడిపోని వారు అయిన దక్షిణ భారతపు ద్రవిడులు ఉత్తర భారత ప్రాంతపు శూద్రులకన్నా బాగా ఆధిక్యంలో ఉండేవారు. ఎక్కువ తక్కువల వర్ణవ్యవస్థలో తమకు కేటాయించిన శూద్రస్థానాన్ని అగౌరవంగా భావించినందువల్ల ద్రవిడులు దానిని లక్ష్యపెట్టలేదు.

మాదిగలకు భారతీయ కుల వ్యవస్థలో స్థానం లేకపోయింది. ఆదిమ ద్రవిడ గ్రామంలో చర్మకారులు అందరూ ఊరిబయట ఇళ్ళు కట్టుకుని కలిసి జీవించటం బహుశా పరస్పర ఒప్పందంతో కుదిరిన రాజీ అయి ఉండవచ్చు. ఆర్యుల కుల వ్యవస్థ క్రూరమైన విభజన రేఖలు గీసేవరకూ ఇళ్ళ సముదాయాలు వెలివేయబడిన వాడలుగా మార్పుచెందలేదు. అక్కడి పాలకులు మాదిగల సేవలను దాస్యంతో పోల్చదగిన పద్ధతులతో శాసించసాగారు.

మాదిగల పరిస్థితి పశ్చిమదేశాల నాగరికత ప్రభావం పడకముందు అనేక శతాబ్దాల కన్నా గత ముప్పై సంవత్సరాల ఆంగ్లపాలనలో బహుశా మారింది. అనాదిగా నిస్సందేహంగా అమలులో ఉన్న పరిస్థితుల గురించి తమ బిడ్డలకు అనుభవ పూర్వకంగా ఏమీ తెలియదని వృద్ధులు నాతో చెప్పారు. కనక

ముప్పై సంవత్సరాల క్రితం భారతీయ గ్రామీణ సమాజంలోని మాదిగల జీవితంలో చిన్న శకలం గతానికి ఒక గొలుసులాంటిది. వెనుకటి విభజన తొందరగా మాయమైపోతున్నపుడు అది మరింత విలువైనది.

పూర్వం రోజులలో, చిన్న రాజులు, పెద్ద రాజవంశాలకి సామంతులుగా ఉన్నపుడు రాజుగాని అతని మంత్రిగాని (దివాన్) తన రాజ్యాన్ని చూడటానికి వచ్చేవారు. వాళ్ళు బసచేసిన చోటల్లా అక్కడే వసతులూ సమకూర్చటం ఆ రోజుల్లో వారికి సౌలభ్యంగా ఉండేది. కుమ్మరిపాత్రలు అమర్చాలి. చాకళ్ళు బట్టలు ఉతకాలి. మునసబు పాలు, గుడ్లు తెచ్చేవాడు. మొత్తం గ్రామమంతా తన ఉత్పత్తులను సమకూర్చాలి. ఈ సేవలకు బదులుగా రాజా భూమిని ఈనాములుగా యిచ్చేవాడు. ఆ సందర్భాలలో ఆయన అవసరాలకు అనుగుణంగా యిచ్చేవాడు. మాదిగలు బరువులు మోసేవాళ్ళు గనక రోడ్లు కొద్దిగా ఉండి నడకదారులే కావటం వల్ల డేరాల సామాను అంతా వెట్టివాళ్ళమీదపడి ఒకచోటనుంచి మరోచోటికి వెళ్ళాల్సి వచ్చేది. వాళ్ళకి కూడా ఈనాములు అందేవి. సాధారణంగా నాలుగు ఎకరాలకి మించి ఉండేది కాదు. మాదిగలకి దున్నటానికి ఎద్దులుగాని, పంటలని చూసుకోటానికి సమయంగాని లేకపోవటం వల్ల అవి చాలా తక్కువ పండేవి.

అంతేగాక వెట్టిచాకిరీ రాజులు వచ్చినపుడో మంత్రులను పంపినప్పటికో పరిమితం కాదు. అధికారం గలవారు ఏ వేళలోనైనా వెట్టిచాకిరి చేయించుకోగలిగేవారు. అది ఎప్పుడూ కూలిలేకుండానే చేసే చాకిరి. కరణం గ్రామానికి పన్నులు వసూలు కోసం వస్తే వెట్టివాళ్ళు గ్రామంలోని అన్నిదోవలలోనూ నిలబడి మనుషులుగాని, పశువులుగాని బయటిక వెళ్ళకుండా కాపలా కాసేవారు. పన్ను వసూలయాక డబ్బు వెట్టివారి చినుగుల బట్టల మధ్య కట్టి ఇద్దరేసి కలిసి అనేకమైళ్ళు నడిచి జిల్లా కేంద్రాలలో కట్టేవారు. వాళ్ళు పేదలుగా మొరటువాళ్ళుగా కనిపించడం వల్ల వాళ్ళ వద్ద ధనం దాచేరన్న అనుమానం ఎవరికీ వచ్చేది కాదు. గమ్యం చేరాక బ్రాహ్మణ గుమాస్తాల దరిదాపులకి కూడా వెళ్ళేవారు కాదు. దూరంగా తాము తెచ్చిన మూటను ఎత్తిపట్టుకుని ఎవరో శూద్రసేవకుడు వచ్చి దాన్ని తీసుకునే వరకూ నిలబడేవారు. మాదిగల చేతులనుంచి నేరుగా తీసుకుంటే మైలపడతామనుకునే బ్రాహ్మణులకు శూద్రసేవకులు అందించేవారు.

వెట్టివాళ్ళకి నిత్యం చేయాల్సిన పనులు ఉండేవి. కరణం ఇంటికి వాళ్ళు వంట చెరుకుగా పుల్లలు పోగుచేయాలి. ఒక గ్రామంనుంచి మరో గ్రామానికి ఉత్తరాలు తీసుకువెళ్ళటానికి వెట్టివారిని నియమించేవారు. జనసంచారం లేని బాటలలో దారి చూపించవలసివస్తే వెట్టివారిని వారికి వనయేవరకూ అప్పగించేవారు. బరువు మోసేవాళ్ళు కావలసివస్తే బాటసారులు కరణాన్ని ఆశ్రయించేవారు. అతను వెట్టివారిని సమకూర్చేవాడు. కూలిని తనకి ఉంచుకుని వాళ్ళ సంపాదనలో చిన్న భాగాన్ని వాళ్ళు కాళ్ళా వేళ్ళా పడితే యిచ్చేవాడు. ఎప్పుడైనా ఎవరైనా చేయమని మొరాయిస్తే వాళ్ళని అవమానించేవారు. వాళ్ళకున్న కొద్దిపాటి పశువులని బందెల దొడ్డిలోకి తరిమేవారు. వాళ్ళు ఎదిరించడం వల్ల వారి పరిస్థితి మరింత దిగజారేది.

కొందరు చిన్ని చిన్ని రాజులు, మంచి బలిష్ఠమైన మాదిగలను పొలాలల్లోనూ, గుడిసెల్లోను చూసి తమ ఇళ్ళలో దాస్యానికి ఒప్పగించమని కరణాలనూ, దివాన్‌లనూ ఆజ్ఞాపించేవారు. ఆ ప్రకారమే వాళ్ళు మాదిగలను ఇళ్ళ నుంచి వేరుచేసేవాళ్ళు. వినకపోతే క్రూరంగా దండించేవారు. భూములకు నీరు అందించేందుకు చెరువు తవ్వాలన్న కోరిక రాజుకి కలిగినప్పుడు ముఖ్యంగా ఈ రకమైన పద్ధతిని ఉపయోగించేవారు. రాజసేవకులు తన తండ్రిని యింటి నుంచి పట్టుకుపోయి పొదిలి వద్ద చెరువు తవ్వకంలో బలవంతంగా పనిచేయించారని ఒక మాదిగ నాతో చెప్పాడు. అతను సరిగ్గా పనిచేయక నకరాలు పోతే కొడతామని, సంకెళ్ళు వేస్తామని బెదిరించేవాడు. ఆ తవ్వకంలో అతనికి దొరికేది తిండికి సరిపోయేది. కుటుంబానికి వంపటానికి ఏమీ ఉండేదికాదు. వాళ్ళకి చేతనయినట్లు బ్రతకవలసి వచ్చేది.

రాజులు వేసే పన్నులు అదనపు భారం. పంట పండాక, మాదిగల వంతు ధాన్యాన్ని పరస్పర సేవాపద్ధతిలో శూద్రులు కొలిచేవారు. రాజభటులు వచ్చి దానికి ముద్రలు వేసేవారు. పన్ను చెల్లించకుండా దాన్ని ఆడవాళ్ళు వంటకు ఉపయోగించరాదు. ఒక బట్టకొంటే, దాని ధరలో ఎనిమిదోవంతు పన్నుగా చెల్లించాలి. రాజభటులు చాకళ్ళ దగ్గరకి వెళ్ళి బట్టలు తనిఖీ చేసేవారు. దేనిమీదైనా ముద్రలేకపోతే తీసుకుపోయేవారు.

మాదిగలకు బ్రాహ్మణులకు మధ్య సంబంధం అలనాపాలనా చూడనవసరం లేని బానిసత్వంగా ఉండేది. మరోవైపు శూద్రులు అణచివేతకు అన్ని అవకాశాలు ఉన్నప్పటికీ స్నేహితులుగా, రక్షకులుగా ఉండేవారు. శూద్రభూస్వాముల కింద దాస్యం చేయని మాదిగ కుటుంబాలు దురదృష్టంగా అనుకునేవారు. ఆకలి తీర్చుకోవటానికి తగినంత ఆహారం దొరికేది కాదు. మాదిగలు తరతరాలు ఒకే శూద్ర కుటుంబానికి సేవచేసేవారు. శూద్రుల కుటుంబంలో వివాహం జరిగితే తమ వాడలో పెళ్ళి అయినట్లు పండగ చేసుకునేవారు. తన శూద్రయజమాని అనుమతిలేకుండా మాదిగ ప్రయాణం చేయకూడదు. మరేరకమైన ముఖ్యమైన పనినీ ఒప్పుకోరాదు. రేయింబవళ్ళు అతడు శూద్రుడి అదుపాజ్ఞలలో ఉండాలి. చేలు ఎదుగుతున్నప్పుడు పగలు పిట్టలని కొట్టటానికి, రాత్రిళ్ళు దొంగలని తరమటానికి కాపలా ఉండాలి. అతని శ్రమకి నగదు రూపేణా కాకుండా సరుకు రూపంలో చెల్లించేవారు. పంట దిగుబడిని బట్టి ధాన్యాన్ని కొలిచేవారు.

పరస్పర సేవల సూత్రంపై శూద్రులకు తోలుపని కూడా చేసేవారు. శూద్ర భూస్వాముల ఆవులూ, మేకలలో ఏదైనా చనిపోతే మాదిగలని పిలిచేవారు. వాళ్ళు ఆ చర్మాన్ని తీసుకుని

పదునుపెట్టి శూద్రులకి చెప్పులు, ఎడ్లకి తోలుపటకాలు యింకేమైనా అవసరమైన చర్మపు వస్తువులు చేసి ఇచ్చేవారు. మెట్ట భూములలో శూద్రులు లోతైన నూతులు తవ్వి ఎద్దులతో తోడించి చిన్న కాలవలద్వారా పొలాలలో నీళ్ళు పెట్టేవారు. ఆ పనికి పెద్దపెద్ద తోలుబాల్చీలు అవసరమయేవి. మాదిగకులానికి వాటిని చెయ్యటానికి మరమ్మతులు చేయటానికి పనులు దొరికేవి.

మాదిగలకు పశువుల చర్మంపైనేకాక దాని మాంసం మీద కూడా హక్కులుండేవి. పశువులు ఎప్పుడూ రోగాలతో చనిపోతాయి. గనక, చంపరు గనుక తొందరగా శరీరం పాడయిపోయే దేశంలో మాంసం అనహ్యంగానూ, విషతుల్యంగానూ ఉండేది. వారి వృత్తిలోని ఈ పరిస్థితిలోనే మాదిగల అవమానాలకు తుదీ మొదలూ ఉంది. సంవత్సరంలో చాలాభాగం ఆకలికి మాడుతూ, కొన్ని నెలలు ఒంటిపూట తిండితో గడుపుతూ, తినదగిన మాంసాన్ని కొనే తాహతు లేక మాదిగలలో వృత్తి హక్కుగా లభించిన గొడ్డు మాంసం ఎంత పాడయిపోయినా తినకుండా ఉండలేరు. వారి పురాణగాథలు చెప్పే వాళ్ళ తెగని అట్టడుగుకు నెట్టేసిన శాపాన్ని సూచించేది ఈ తిండే! మాదిగల పితామహుడు 'జాంబవంతుడు బ్రతికిన పూర్వపురోజులలో ఆకలి తీర్చుకోటానికి ఆహార సంపాదన బహుశా కష్టమయి ఉండేదికాదు. పురాతన గాథలలో చెప్పబడే కరువు మొత్తం దేశాన్ని చుట్టుముట్టి దాదాపు జనాన్ని తుడిచేసిన రోజులలో మాదిగలు పాడయిపోయిన మాంసాన్ని తినడం గురించి ఆలోచించి ఉంటారు. దేన్నయినా చంపటం, తినడం నిషేధించబడిన హిందువులకు మాదిగల ఈ పనే వారిని నీచులుగా, అసహ్యకరమైన వారిగా భావించటానికి దారితీసింది. ఆ తర్వాత భయానకమైన దారిద్ర్యం వల్ల అతను ఈ తిండి నుంచి బయటపడలేకపోయాడు.

మాదిగలు దారుణమైన పేదలు. వారి స్థితిని గురించి నేను అనేక జిల్లాలలో విచారించాను. మాదిగ జనాభాలో మూడోవంతుకి మాత్రమే కనీసావసరాలు తీరేవి. కాస్త మెరుగ్గా ఉండే వీళ్ళ ఆస్తులు సైతం వేళ్ళమీద లెక్కించదగినవే. పది అడుగుల చదరంలో మట్టీ, రాళ్ళతో కట్టి తాటాకులతో కప్పు నేసిన గుడిసెలో ఒక్కో కుటుంబం నివశిస్తుంది. వాళ్ళ సామాన్లు కర్రతో చేసిన చట్రానికి నులక అల్లి తయారుచేసిన కొన్ని మంచాలు, ముక్కాలి పీటలు, పండుకోటానికి చిన్నా పెద్దా మట్టికుండలు, ఒకటి రెండు ఇత్తడి పాత్రలు, బాల్చీలు ధాన్యం దంచుకోవటానికి రాతిరోలు, కూరల్లో పొడులు నూరుకోటానికి సన్నికల్లు, ఇవీ మొత్తం ఇల్లు గడిపే సామాన్లు. ఉంటే ఓ ఆవు, గేదె, దూడలు, కోళ్ళు ఉండొచ్చు. కుటుంబంలో ఒక్కొక్కరికీ రెండు జతల బట్టలు, రాత్రిళ్ళు కప్పుకోవటానికి గుడ్డ ఉంటాయి. ఆడవాళ్ళకి పూసలగొలుసులు, కొద్దిపాటి చవకబారు నగలు ఉంటాయి. ఇంటిని నిలబెట్టే దూలానికి వేలాడే ఓ వెదురుబుట్టలో పండగలకి పిలిచినపుడు కట్టుకోటానికి ఎర్రరంగు బట్టలు ఉండొచ్చు. పైన చెప్పిన వాటిని కలిగున్న కుటుంబాలని ఆస్తిపరులైన మాదిగ కుటుంబాలుగా పరిగణించేవారు.

మూడింట రెండొంతులమంది మాదిగలలో పైన చెప్పిన ఆస్తులలో కొద్దిపాటి ఉంటాయి. పశువులు లేవు. మంచాలు లేవు. ఇత్తడి పాత్రలు లేవు. పండగ దుస్తులుగా ఎర్రరంగు గుడ్డలు లేవు. కాస్తంత దాబుగా ఎవరైనా కనిపించాలనుకుంటే వాళ్ళ యింట్లో ఉన్న బట్టలలో మెరుగైన వాటిని ధరిస్తారు. చాలారోజులు ఆకలితో పస్తులుంటారు. అన్నం కన్న చవకయిన గంజి దొరికితే రుచికోసం కొంచెం కారం కలుపుకొని అదే సంతోషంగా తింటారు.

బానిసత్వంలో అణగదొక్కబడినా, దారిద్ర్యంలో మగ్గిపోయినా, తమ మూల నివాసాలను కోల్పోయినా మాదిగలు వారిలో వారు గ్రామీణన్యాయవ్యవస్థను కొద్దిపాటిస్థాయిలో ఇంకా నిలబెట్టుకొన్నారు. శూద్రగ్రామానికి గ్రామపెద్ద ఉన్నట్లే మాదిగవారికి మాదిగపెద్ద ఉంటాడు. అతను ప్రత్యేక సందర్భాలలో మాదిగలకు ప్రాతినిధ్యం వహిస్తాడు. ఎవరికైనా ఆతిధ్యం యివ్వాల్సివస్తే అతిధికి అతని యిల్లే ఆశ్రయమివ్వాలి. తగువులు, గొడవలూ తీర్చడానికి అతని దగ్గరికే తీసుకువస్తారు. మాదిగవాడలో ఉండేవాళ్ళెవరైనా తప్పుడు పనులు చేశారని అందరూ అనుకుంటే అనేకమంది వృద్ధుల సహకారంతో మాదిగ పెద్ద తీర్పు యిస్తాడు. తప్పు కట్టమంటాడు. లేదా గ్రామ హద్దుల నుంచి ఆ చెడ్డవాడిని తరిమేస్తాడు. ఆ అపరాధం రుసుం మాదిగ పెద్దకి చెందుతుంది. పరిపాలనా విధుల నిర్వహణలో సమయం వెచ్చించటానికి ఆతిధ్యం ఖర్చుకీ ఈ రుసుం ఆయనకు వినియోగపడుతుంది. ఆ విధంగా చెల్లాచెదరైపోయినా, దాస్యంలో ఉన్నా వారి పురాతన తెగ వ్యవస్థకి మాదిగలు ఇంకా వేలాడుతున్నారు. మునసుబు, కరణాలకు లొంగి ఉంటారు. అధికారంగల వారికి వంగి ఉంటారు. అయినా వాళ్ళ వాడలో వారి సభ్యులలో ఒకరికి అందరి అవసరాలూ తీర్చే గౌరవం ఇస్తారు. ఆవిధంగా వారు బలమైన ద్రవిడ తెగలతో సాన్నిహిత్యానికి తార్కాణంగా ఉంటారు. వారి తెగ స్వభావవు ఈ సాగే లక్షణమే వర్తమానంలో వారు నాగరికులవటానికి విద్యావంతులవటానికి వాహిక కాబోతోంది.

# 5. గేదెరూపం ధరించటం

కోమటి షావుకారు సంతలో తన సామాన్ల వెనుక కూర్చుంటాడు. అతని ముందు సంచీలలో పప్పులూ, ఉప్పులూ ఉంటాయి. చింతపండు ఒక బుట్టలో, మిరపకాయలు మరోదాన్లో ఉంటాయి. అడిగే కొనుగోలు దార్ల కళ్ళకి కనబడేలా అన్నీ ప్రదర్శించబడవు. అతని వెనక ఒక తలుపు ఉంటుంది. అది తెరిచినవుడు దాచిన సరుకులు నిండిన సంచీలు, తట్టలు కనబడతాయి.

అతను బట్టలు, సూదులు, కత్తెర్లు, పూసలు మెరిసే తీగలు మొదలయినవి అమ్ముతుండొచ్చు. కొన్ని గజాల నాడా అడిగితే వరండా నుంచి తెరవబడే సరుకులు నిండిన "గౌడాన్"లోకి వెళ్ళి ఒక మూటను బయటకి లాగి నీముందు విప్పి రకరకాల వెడల్పు నాడాలు చూపిస్తాడుడ. పూల అల్లిక గల సుకుమారమైన సన్నబట్ట చూపించి 'తీసుకోండామ్మా' చాలా 'చవక' అంటాడు. నీకు చూపించటానికి అతని దగ్గర చైనా కుక్కబొమ్మలు ఉంటాయి. 'మేడ్ ఇన్ జర్మనీ' అని రాస్తున్న చవకబారు ఆటవస్తువులు ఉంటాయి. సరైన ధర చెప్పమంటే న్యాయంగా యివ్వాల్సిన ధరకన్నా మూడురెట్లు ఎక్కువ చెపుతాడు. నువ్వు బేరం ఆడి అతని సరుకులు అక్కర్లేదంటే సరయిన ధరకి యిస్తాడు.

కోమటి తరచుగా ధనవంతుడు. ఎక్కువ వడ్డీకి యిచ్చే డబ్బు ఉంటుంది. రాత్రి భోజనానికి బియ్యం కొనుక్కోడానికి కూరలో పోపు సామానుకి ఆడవాళ్ళు అతని దగ్గరికి వెళ్ళాలి. అస్పృశ్య స్త్రీలు కూడా కొనుక్కోటానికి అతని దగ్గరికే వెళ్ళాలి. ఒక్కోసారి కుటుంబం తెచ్చుకునే కొద్దిపాటి కూలి అందరి తిండికీ చాలదు. అయినప్పటికీ వారు చవరకం ధాన్యం కొంటారు. కోమటికి అప్పుపడతారు. అప్పుతీరేవరకూ అతను వాళ్ళను భయాందోళనల్లో ఉంచుతాడు.

ఏదో రకమైన సంబంధాన్ని సూచించే విచిత్రమైన ఆచారాలు ఉండకపోతే ధనవంతుడయిన కోమటికీ నిరుపేదలయిన మాదిగలకీ సంబంధం ఉండొచ్చని ఎవ్వరికీ అనిపించదు. ఈ ఆచారాలను గుర్తుచేస్తే కోమట్లు సంతోషపడరు. ఇతర కులాల కుళ్ళుబుద్ధులు ఇలాంటి కథలు పుట్టించాయని వారు కోపంగా అంటారు.

కోమట్ల పెళ్ళి సంబరాలు సాధారణంగా వాళ్ళ తాహతు మేరకు ఆడంబరంగా జరుగుతాయి. బంధువులనీ, స్నేహితులనీ బ్రహ్మాండమైన విందులకు పిలుస్తారు. మాదిగ ఏవిధంగానూ కోరదగని అతిథి అయినప్పటికీ అతన్ని తప్పక పిలవాలి. లేకపోతే కొత్త దంపతులకు చెడు జరుగుతుంది. ఇలాంటి ఆహ్వానాన్ని మాదిగలు ఆశించకపోయినా, దాన్ని దురదృష్టంగానూ, అవమానంగానూ భావిస్తారు. కోమటి సాహసించి బహిరంగంగా ఆహ్వానం పంపితే దాన్ని తీసుకువచ్చినవాడు కోపగించిన మాదిగల చేతుల్లో తన్నులు తింటాడు.

మాదిగలు తనని చూసే అవకాశంలేని సమయం కోసం కోమటి నిరీక్షిస్తాడు. ధాన్యం కొలిచే ఇనుప పాత్రను తీసుకుని మాదిగవాడకు వెళతాడు. ఏదో ఓ యింటి వెనుక దాక్కుని పాత్రలో (కుంచంలో) నెమ్మదిగా గొణుగుతాడు. చిన్నవాళ్ళ ఇంట్లో (కోమట్లు) పెళ్ళవుతోంది. పెద్దింటి వాళ్ళు (మాదిగలు) రావాలి"

కాని ఇది సరిపోదు. వివాహ సంబరానికి ముందు చేసే నిప్పు మాదిగ యింటి నుంచి వచ్చి తీరాలి. అడిగితే ఖచ్చితంగా తిరస్కరిస్తారు. మాదిగవాడలో ఈ కోరిక విన్నప్పుడు వారికి కోపం రావచ్చు. ఏదో విధంగా పథకం వేసి, మాదిగలు నిరాకరించినా దొంగతనమైనా చేసి ఆచారం ప్రకారం వాళ్ళింటి నుంచే నిప్పు తేవాలి.

ఈ ఆచారాల వెనుక ఏదో కారణం ఉండాలి. మాదిగలు వలసపోయిన ఎంతో దూరంగా దక్షిణంగా ఉన్న మైసూరు రాష్ట్రంలో కూడా మేజర్ మెకంజీ ఈ ఆచారాన్ని గమనించాడు. ఈ రెండు విభిన్న కులాలమధ్య సంబంధానికి పునాది మాదిగలు కోమట్లు ఒకే దేవతను పూజించటంలో ఉందని ఆయన అంటాడు. కోమట్లు కులదేవతగా కన్యిక అమ్మవారిని పూజిస్తారు. మరో కులానికి చెందినవాడవటం వల్ల ఒక రాజకుమారిడిని పెళ్లాడ్డం కన్న తన్ను తాను ఆత్మాహుతి చేసుకోవాలని కన్యక నిశ్చయించుకుంటుంది. వివాహాలప్పుడు ఆమె దేవాలయం నుంచి ఒక పాత్రలో నీరు నింపి తీసుకువచ్చి ఇంట్లో మూలాస్థానంలో ఉంచి కన్యకగా పూజిస్తారు. మాదిగలు కన్యకను తమ దేవత అంటారు. మాతంగిగా కొలుస్తారు. కోమట్లు తీసుకువెళ్ళిపోవటాన్ని నిరాకరిస్తారు.

ఇది నిస్సందేహంగా ఆ రెండు కులాలమధ్య సంబంధానికి కేవలం సామాజిక ఆచారాలే కాదు. ఒకేవిధమైన మత సంబంధాలకు కూడా నిదర్శనం. ఈ విషయాన్ని కొంచెం వివరించే కొంచెం వివరించే ఒక పురాణగాథ విన్నాను. అది ఒక కోమటి నాతో చెప్పాడు. అనేక భారతీయ గాథల్లాగే ఇందులోనూ అసంభవమైన అంశాలు ఉన్నాయి.

పూర్వం ఒకప్పుడు కుల కట్టుబాట్లకు విరుద్ధంగా ఒక బ్రాహ్మణుడు ఒక మాదిగ స్త్రీతో ఉండేవాడు. అతనికి మంత్రాలు మాయలూ వచ్చు. అతను తన మాయ ద్వారా పగలు ఒక గేదెరూపంలోనూ, రాత్రిస్త్రీగానూ మార్చేవాడు. వాళ్ళకి పదకొండు మంది పిల్లలు కలిగారు.

ఒకరోజు బ్రాహ్మణుడు పనిమీద బయటకు వెళ్ళారు. పిల్లలని పిలిచి గేదెని వాళ్ళకి అప్పగించి దాని కట్టుతాడు. విప్పి పొలాల్లోకి మేతకి తీసుకువెళ్ళమన్నాడు.

ప్రతిరోజు జరిగే ఈ మార్పిడి గురించి పిల్లలకు తెలియదు. దాన్ని మేతకి తీసుకువెళ్ళారు. అది వాళ్ళు ఇష్టప్రకారం నడవకపోతే కర్రతో కొట్టారు. కాని గేదె ముసిలిది నీరసంగా ఉంది. అది కిందపడి చనిపోయింది.

తండ్రి ఇంటికి వచ్చాడు. గేదె చనిపోయిందని పిల్లలు చెప్పారు. ఎలా చనిపోయిందని అడిగాడు. ఆ తర్వాత– "అయ్యయ్యో– ఆ గేదే మీ తల్లిరా. మీ పాపానికి ప్రాయశ్చిత్తంగా వెళ్ళి ఆ గేదెను కోసి తినండి" అన్నాడు. ఈ పిల్లలకి కోమల్లు వారసులుట.

సంవత్సరానికి ఓసారి కోమట్లు వరిపిండితో నాలుగు కాళ్ళ జంతువు రూపాన్ని గేదెకి చిహ్నంగా చేస్తారు. కుటుంబంలోని ప్రతీవారూ కొంచెం కొంచెం దాన్ని తింటారు. ఈ పండగని 'నబశనిముద్ద' అంటారు.

ఆ గాథకీ ఈ ఇంటి పండగకీ ఏదో సాధారణాంశం ఉంది. కోమట్లు రెండు వంశాల కలయిక వాళ్ళు కావటం అసాధ్యం కాదు. వాళ్ళ సమాచారం కోసం 'మాన్యూల్ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ ది మద్రాస్ ప్రెసిడెన్సీ"లో వెదికాను. వాళ్ళు ఉత్తరంగా ఏదో స్థలం నుంచి వలస వచ్చినట్లు చెప్పటం కనిపిస్తుంది. కొందరు అధికారులు పెనుకొండ అంటారు. అది విజయనగర సామ్రాజ్యంలో ఒక ముఖ్య ప్రదేశం. వాళ్ళు వచ్చిన ప్రాంతం గుఇరంచి ఎన్నో సందేహాలున్నా వాళ్ళ పూర్వ ప్రాంతం ఖచ్చితంగా తెలియదు. వాళ్ళు వర్తక కులాలన్నింటిలోనూ స్వచ్ఛమైన వైశ్యులమని చెప్పుకుంటారు. అనేక వంశాలుగా విడిపోయి ఉన్నారు.

కోమట్లు గాని, మాదిగలు గాని తమ మధ్య సంబంధానికి సంతోషించరు. అయినా ఇది ఇంతకాలం నిలబడటం విచిత్రం.

పురాతన మాతృపూజ (శక్తి ఆరాధన)

1. అరుంధతి శాపం
2. మాతంగి ఉపదేశం
3. గాథలలో కథలలో మాతంగి
4. మహాలక్ష్మి అమ్మవారు (మాలచ్చమ్మ)
5. రహస్య సమావేశాలు అర్ధరాత్రి తాండవాలు

# 1. అరుంధతి శాపం

ఒకానొకప్పుడు అనేక పాపాలు చేసిన ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఇసుకని అన్నంగా మార్చగల భక్తిగల స్త్రీ దొరికితే తన పాపాలకు పరిహారం దొరుకుతుందని అనుకున్నాడు. అన్ని కులాలలోనూ వెదికాడు. అలాంటి అద్భుత శక్తిగల స్త్రీ ఎక్కడా కనపడలేదు.

చివరకు అతను మాదిగల దగ్గరకు వచ్చాడు. కన్యగా ఉన్న ఆరంజోతి అతని అన్వేషణ తెలుసుకుంది. అతని దగ్గరకు వచ్చి అంది, "నేను చేయగలను గాని నాది నీచ జన్మ. నా తండ్రి ఆవులను చంపి తింటాడు. మేం వెలివేయబడ్డవాళ్ళం."

ఆ బ్రాహ్మణుడు ఎంతో సంతోషించాడు. ఆమెది తక్కువ కులమైనా తన కోరిక తీర్చమని వేడుకున్నాడు. ఆరంజోతి లొంగింది. అతను ఇసక తెచ్చాడు. ఆమె పాత్రలో వేసింది. ఇనుముని చిన్ని చిన్ని ముక్కలు చేశాడు. అది కూడా ఒక పాత్రలో వేసింది. రెండు పాత్రలలో ఉన్న వాటిని చూపింది. అయినా ఆమె భక్తితో దానిని ఉడకబెటట్టింది.

బ్రాహ్మణుడు ఆమె పక్కనే నిలబడి ఆతృతగా చూస్తున్నాడు. ఆరంజోతి వంట పూర్తయింది. ఆశ్చర్యం! ఓ పాత్రలో ఉడికిన అన్నం, మరో దానిలో కూరా తయారయాయి. తనని పాపం నుంచి బయటపడేసే రక్షకి దొరికిందని నిశ్చయించుకుని, తనని పెళ్ళాడమని ఆరంజోతిని కోరాడు.

కాని అంతలోనే వాళ్ళ అన్నయ్య వచ్చాడు. జరిగింది తెలుసుకొని కోపంతో మండిపోయాడు. బ్రాహ్మణుడిని, చెల్లెలు ఆరంజోతిని కూడా చంపుతానని బెదిరించాడు. మాదిగలలో ఏ ఒక్కరూ వారిని చేరదీయలేదు. అందరిదీ ఒకటేమాట. "మన కులంలోకీ, కుటుంబాలలోకీ పరాయివాడిని తీసుకువస్తోంది. వాళ్ళని బయటకు తరిమెయ్యండి. వాళ్ళతో విడిపోండి.

ఆ తర్వాత ఆ ఆరంజోతి అందరి కళ్ళ ముందూ ఆకాశంలోకి వెళ్ళిపోయింది. వాళ్ళని ఇలా శపించింది. "మీరు అందరికీ బానిసలవుగాక! మీరు ఎంత శ్రమపడినా మీ స్థితి నుండి పైకి రాకుండుగాక! ఇప్పటినుండి బట్టలు లేకుండా, విద్య లేకుండా అజ్ఞానంతో దీనులుగా బ్రతుకుదురుగాక!" ఆ విధంగా ఆరంజోతి తన వాళ్ళని శపించి ఆకాశంలోకి వెళ్ళిపోయాక వాళ్ళూ ఆ బ్రాహ్మడూ నిలబడిపోయి తలలెత్తి చూస్తూ ఉండిపోయారు.

మాదిగలు ఆరంజోతిని మరచిపోలేదు. దాసులు తరచుగా ఆమె భర్త గురించి, ఆమె తన జనానికి యిచ్చిన శాపం గురించి కథ చెబుతుంటారు. పాపం! ఆమె శాపం ఫలించింది. దాసులు పాడుతున్నప్పుడు వాయిద్యాలు తోడుచేసుకుంటారు.

ఆరంజోతి అన్న తెలుగుపదానికి సంస్కృతరూపం అరుంధతి. దాని అర్థం ' ఆరిపోని ప్రకాశం! అరుంధతి గురించి అనేక యితర గాథలు ఉన్నాయి. అందులో ఒకదాని ప్రకారం అరుంధతి తిరిగి మాదిగ స్త్రీగా పుట్టింది. అగస్త్యమహర్షి సోదరుడైన వశిష్టుని పెండ్లాడింది. వంద మంది బిడ్డలను కంది. తండ్రిమాట పాలించకపోవటం వల్ల వారిలో తొంభై ఆరుమంది పరియాలుగా దిగజారిపోయారు. మిగిలిన నలుగురూ బ్రాహ్మణులుగా ఉండిపోయారు. ఋగ్వేద శ్లోకాలలో ఒక శ్లోకం ఉంది. "అత్రికి అనసూయలాగ వసిష్టునికి అరుంధతిలాగ, కౌశికుడికి సతిలాగ నీవు నీ భర్తతో చరింతువుగాక!" అంటూ ముగుస్తుంది. సంస్కృత నిఘంటువులో అరుంధతి మాతంగీ "వసిష్టుని భార్య"గా ఇద్దరూ ఒకరే అన్నట్టు పేర్కొంటారు.

పెళ్ళిళ్ళప్పుడు మాదిగలు ముఖ్యంగా ఆరంజోతిని గుర్తుచేసుకుంటారు. మాదిగ దాసులలో ఒకరు పెళ్ళితంతు జరిపించాక పురాతన ఆచారం ప్రకారం వధూవరుల మంచి కోసం స్నేహితులతో కలిసి చుక్కలు నిండిన ఆకాశం కిందకి ఆరంజోతికి నమస్కరించటానికి వెళతారు. ఆమె కనిపించకపోయినా ఆమె మంచం అక్కడే వుండి అందరికీ కనిపిస్తుంటుంది. (సప్తర్షి మండలం) నాలుగు ప్రకాశవంతమైన నక్షత్రాలు ఆ మంచానికి మంచంకోళ్ళు. అవి చాలా విలువైనవి. ఆ నాలుగింటికి ఒక పక్కగా ఉండే మూడు నక్షత్రాలు దొంగలు. మూడు మంచం కోళ్ళను దొంగిలించారు. మంచం కోళ్ళని అప్పుడే తలో పక్కకీ లాగేసి మంచాన్ని అసమ చతురస్రాన్ని చేశారు. నవ దంపతులు ఆ మంచాన్ని చూసి ' ఆరంజోతి మాకు దూరమవకుండుగాక!" అంటారు. వాళ్ళు తలలు వంచి ప్రార్థిస్తారు. ఆమెకు ఆశీర్వదించే శక్తి ఉందని నమ్ముతారు.

గాథాచరిత్రల్లో భక్తి కారణంగా మహిమలు చూపించే పరియా స్త్రీ ఆరంజోతి ఒక్కరే కాదు. సాధ్వి వాసుగి కథ చాలా తేడాగా ఉంటుంది. ఆమె కూడా ఇసుకను ఉడకబెట్టి అన్నం చేసింది.

వాసుగి తమిళ రుషి కవి తిరువళ్ళువార్ భార్య. తిరువళ్ళువార్ పరియా సాలెవాడు. మద్రాసుకి దగ్గరగా క్రీ॥శ॥ 1000–1200 ప్రాంతంలో జీవించాడు. ఆయన కాలంలో మధురలో ఒక ప్రఖ్యాత సంస్కృత విద్యాలయం ఉండేది. ఆనాటి తమిళ పండితులంతా దానికి చెందినవారే. తన పదమూడు వందల పదాలతో ఆ పరియా కవీశ్వరుడు వాళ్ళ ముందుకు వెళితే ఆయన కులం కారణంగా బహిష్కరించబడ్డాడు. ఆయన ముఖ్యకృతి కురళ్‌ని ఈనాటివరకూ అన్ని తరగతుల హిందువులూ గొప్ప నీతి గ్రంథంగా, ధార్మిక గ్రంథంగా పరిగణిస్తారు.

తిరువళ్ళువార్ కవికి కన్య వాసుగిని ఇచ్చి ఆమె తండ్రి వివాహం చేస్తానన్నాడు. అన్ని ధర్మాలలోనూ గృహధర్మము

గొప్పదిగా పరిగణించటం వలన ఆయన ఆమెను భార్యగా అంగీకరించాలనుకున్నాడు. కాని ఆమెకి ఒక పరీక్ష పెట్టాడు. " ఈ ఇసుకని తీసుకుని అన్నం వండి నాకు పెడితే ఆమె నాకు భార్య అవుతుంది" అన్నాడు. వాసుగి ఆయన చేతుల నుండి ఇసుక మూటను తీసుకుంది. ఆ పరమ పవిత్రుని ఆజ్ఞ సాధ్యమేనని ధర్మమేనని ఆమె విశ్వసించింది. ఆమె విశ్వాసం గొప్పది. ఆమె ఇసుకని వండింది. సాధ్వీమణి కనక దైవశక్తి ఉంది. ఒక మహిమ చేసింది. అడిగిన ప్రకారం అన్నం వండి ఋషి దగ్గరకు తెచ్చింది. ఆ తర్వాత ఆమె అతనికి విధేయత, పాతివ్రత్యమూ గల భార్య అయింది.

కొన్ని ఏళ్ళు గడిచాయి. కవీశ్వరుని కీర్తి వ్యాపించింది. ఒక బాటసారి ఆయన్ని గురించి విని ఆశ్రమానికి వచ్చి ఆ కాలంలో భారతదేశంలో ఎంతో తరచు చర్చించబడిన ప్రశ్ననే అడిగాడు "గృహజీవితమా సన్యాసి జీవితమా ఏది గొప్పది" అని ప్రశ్నించాడు. రుషి అతన్ని ఆదరించాడు. కాని ఆ ప్రశ్నకు ఎలాంటి సమాధానమూ యివ్వలేదు. ఒకరోజు నూతినించి నీళ్ళు తోడుతుంటే భార్య వాసుగిని పిలిచాడు. బాల్చీని మధ్యలో వేలాడుతుండగా వదిలేసి ఆమె ఒక్కసారిగా వచ్చేసింది. మరోసారి ఆమె చద్దన్నం తీసుకుని వస్తే అది వేడిగా వుందని నోరు కాలిందని తిట్టాడు. ఎలాంటి ప్రశ్నలు వేయకుండా, నిస్సంకోచంగా ఆమె ఆ అన్నాన్ని విసరసాగింది. అతను మగ్గం నేస్తూ పట్టపగటివేళ మగ్గం లాడిని పడేసి దాన్ని చూడటానికి దీపం పట్టుకురమ్మన్నాడు. ఆమె దీపం వెలిగించి తెచ్చింది.

బాటసారి ఆశ్చర్యంతో అన్నాడు. "అలాంటి భార్య దొరికితే గృహజీవితమే గొప్పది. అలాంటి భార్య కాకపోతే సన్యాసమే మంచిది." మహాసాధ్వి వాసుగి కళ్ళు మూసినపుడు ఆమె ఏనాడూ తన స్వామి మాట జవదాటలేదని జనం చెప్పుకొన్నారు. వాసుగి స్వభావం సాధ్వీత్వం, వినయం, విధేయత పరియా కవి ముఖ్య కృతి కురల్ భోధనలననుసరించి వుంటుంది.

వాసుగి సంప్రదాయంలో ఆర్యుల ఆదర్శ స్త్రీ లక్షణాల ప్రభావం ఎంతమేరకు ఉందన్నది ప్రశ్న. సన్యాసజీవితం విలువకు సంబంధించిన చర్చ ద్రవిడ ప్రభావం కన్నా ఆర్యుల ప్రభావమే సూచిస్తుంది. ఆరంజోతిలాగే వాసుగి కథ కూడా బ్రాహ్మణ నియమాల నుంచి తప్పించుకోలేదు. తమ ఆధిక్యతను నిలబెట్టుకోటానికి బ్రాహ్మణులు సత్యాలని దాచేసే ప్రయత్నాలూ చాలా చేశారు. అందువల్ల ఆ ద్విజన్ముల ముద్రలేని గాథలు భారతదేశంలో చాలా తక్కువ. వాటినిండా అతిశయోక్తులు ఉంటాయి. స్వచ్ఛమైన ద్రవిడ మూలాలను చూడాలంటే సరళమైన, కళాత్మకత లేని గాథలు తీసుకోవాలి. ఒక చిన్న ద్రవిడ తెగ అయిన కూర్గుల మౌఖిక సంప్రదాయంలో ఈ కింద చెప్పబడిన గాథ ఉంది.

పూర్వం రోజుల్లో మలబారు దేశంలో ఆరుగురు సోదరులు ఒక సోదరి ఉండేవారు. వారంతా కలిసి కూర్గు వెళ్ళారు. సోదరి తమతో రావటం వారికి నచ్చలేదు. దాంతో ఆమె కులాన్ని చెరపాలనని నిశ్చయించుకున్నారు. దోవలో వారికి ఆకలేసింది. 'నువ్వు మాకు అన్నం వండాల'ని చెప్పారు. ''నిప్పులేదు. బియ్యంలేవు" అని జవాబిచ్చింది. "మేం నీకు బియ్యం ఇస్తాం. నువ్వు నిప్పు లేకుండా ఉడకబెట్టిలి" అన్నారు. "నేను నిప్పులేకుండా ఉడకబెడతాను. మీరు ఉప్పులేకుండా తినాలి" అంది వాళ్ళు ఒప్పుకున్నారు.

ఆమె ఒక ఆవును చూసి పాలు పితికింది. బియ్యం పాత్రలో పాలు నింపింది. ఆ తర్వాత నది ఒడ్డుకి వెళ్ళి, ఇసకలో కుండని కప్పెట్టింది. అది ఉడకటం మొదలుపెట్టింది. సోదరులు నిద్రనుంచి లేచి తిన్నారు.

ఆ తర్వాత అందరూ కలిసి కూర్చుని వక్క నమిలారు. ఆ తర్వాత ' ఎవరి వక్క బాగా ఎరుపెక్కిందో చూద్దాం' అన్నారు. వాళ్ళంతా వాళ్ళచేతులలోకి ఉమ్మి, దాన్ని చూసి వాళ్ళ వెనుకవేపుకి విసిరేసారు. దాంతో మోసపోయి, ఆమె తన పక్కను తిరిగి తన నోట్లోనే వేసుకుని నమలసాగింది. అప్పుడు వాళ్ళు నువ్వు నీ కులాన్ని పోగొట్టుకున్నావన్నారు. ఆమె విచారంతో తలమునకలై బిగ్గరగా ఏడిచింది.

ఒక సోదరుడు బాణం వేసి, దాంతోబాటే వెళ్ళి అది పడినచోట ఉండమని ఆజ్ఞాపించాడు. ఆమె కొంగ రూపం ధరించి పొల్లాల్లో పని చేస్తున్న పరియా వాని మీద వాలింది. అతనికి దయ్యం ఆవహించి బాణంగుచ్చుకున్న మామిడి చెట్టుదగ్గరకి పరిగెత్తాడు. ఆ చెట్టు చుట్టూ ఒక గుడి కట్టారు. ఆరుగురు సోదరుల సోదరిని ముఖ్యంగా ఏడాది పండగరోజున కూర్గులు కొలుస్తారు.

తమిళులు, తెలుగువారు లాగే కూర్గులు ద్రవిడ సంతతివారు. ఈ మూడు గాథలలోనూ ఒక కుటుంబపరమైన పోలిక ఉంది. మూడింటిలోనూ ముఖ్యపాత్ర ఒక స్త్రీ. అన్నం వండటమనే సామాన్యమైన పనిలోవారికి మహిమలు ఉన్నాయి. ముగ్గురు పరియా స్త్రీల గాథలూ మాతృపూజా సంప్రదాయానికి అనుగుణంగా ఉంటాయి. అదృశ్యశక్తులు స్త్రీలను ఆవహించవచ్చని, వారికి తగినంత భక్తి ఉంటే వారా శక్తులను లోబరుచుకోగలరని ద్రవిడులు విశ్వసిస్తారు.

# 2. మాతంగి ఉపదేశం

ఓ రోజు పొద్దుటే నేను వరండాలోకి వచ్చేసరికి నా పాత స్నేహితుడు కొనికలూరి ఎల్లయ్య వచ్చి పలకరించాడు. ధగధగలాడుతున్న అతని తెల్లని తలపాగ కింద అతని నల్లటి మొహం చెప్పబోయే విషయాలతో ప్రకాశవంతంగా ఉంది.

" ఈ అరవై మైళ్ళూ నడిచే వచ్చావా"

"నేనెలా నడవగలను? ముసిలాడినిగదా నీ దయవల్ల ఎడ్లబండి మీద వచ్చాను" నువ్వు ఏం చెపుతావు.

"నువ్వేం సెలవిస్తే అదే చెపుతాను."

ఈ రకమైన వినయపూర్వకమైన జవాబు నేను అనేకసార్లు విన్నాను. అనేకసార్లు నా ప్రశ్నలు విలువైన విషయాలను బయటపెట్టటానికి బదులు దాన్నించి తెలుసుకోదగినదేమీ లేదన్న వాస్తవాన్ని బయటపెట్టాయి. నా ఎదురుగా కూర్చున్న ఎల్లయ్యను కూడా నేనొక ప్రయత్నంగా భావించాను.

"పాత రోజుల గురించి చెప్పు" అన్నాను

"మా అమ్మ ఒక మాతంగి"

"అంటే"

"మాదిగ స్త్రీని ఎల్లమ్మ ఆవహిస్తే మాతంగి అవుతుంది."

"ఎల్లమ్మ ఎవరు?"

" ఆమె ఆది మాత. సృష్టి మొదలైన దగ్గరనుంచి ఉన్న తల్లి" దాంతో నేను ఉలిక్కిపడ్డాను. నా కలాన్ని సిరాలో ముంచి పనికి సిద్ధమయాను. నా నోటు పుస్తకం తీసుకున్నాను. "యల్లయ్యా! మొదటినుంచి మొదలెట్టు అన్నాను.

అతను తన ముత్తమ్మ నుంచి (అమ్మమ్మ తల్లి) మొదలెట్టాడు. ఆమె ఒక మాతంగి. అతని అమ్మమ్మకు అలాంటి శక్తులు లేవు. అతను తన తల్లికి తొలి సంతానం. అతనికి మూడేళ్ళప్పుడు ఆమెకు ఒక వింత జరిగింది. ఆమె ఆరోగ్యంగా ఉంది. రోజూ మామూలుగానే పనికి వెళుతుంది. ఓ ఆదివారం నాడు ఎల్లమ్మ విగ్రహానికి ఉపారం పెట్టాక ఆమె విచిత్రంగా ప్రవర్తించసాగింది.

ఆమె భోజనం వేళ విడిగా కూర్చుంది. తిననంది. అది పంటల కాలం. రెండు వారాలపాటు చేలోకి మామూలుగానే వెళ్ళింది. పనిచేస్తున్నపుడు తిన్న గింజలు తప్పించి మరే ఆహారమూ తీసుకోలేదు. ఆ కుటుంబం పనిచేసే శూద్రులు ఇది గమనించారు. ।గ్రామం మొత్తం ఆమెని పరిశీలించటం మొదలెట్టారు. తనలో తను తను నవ్వుకోవటం ఇటూ అటూ చూడటం చూశారు. " ఇదంతా ఏమిటి" అనుకున్నారు.

ఎల్లమ్మను కొలిచేవాళ్ళు ఎందరో ఉండటం వల్ల సమాజంలో ఇది చర్చనీయాంశమయిపోయింది. శైవులయినా వైష్ణవులయినా సరే ఎల్లమ్మను కొలవటం మంచిదిగా పరిగణించేవారు. ఈ మనిషికి నిజంగా ఎల్లమ్మ ఆవహించిందా అన్నది తేల్చుకోటానికి ఓ పంచాయితీ ఏర్పాటు చేశారు. శూద్రులూ, బ్రాహ్మణులూ వచ్చారు. ఆ పంచాయితీకి పెద్ద మాదిగల పెద్ద. ఆయన వారానికి ఒకసారి ఎల్లమ్మ గుడిలోకి ప్రవేశించి పాలు, వెన్న, పళ్ళు అర్పిస్తూంటాడు.

పరీక్ష ఏమిటంటే, ఎల్లమ్మ సంప్రదాయం నడిపే పూజారి బైనరుడు ఆ స్త్రీ ముందు ఎల్లమ్మ కథ చెప్పాలి. ఆమె మీద ఎల్లమ్మ శక్తి ఉండి ఉంటే దేవత ప్రభావంతో ఆమె నాట్యం చేస్తుంది. అది ఏ దయ్యమయినా అయితే ఆ కథ ఆమె మీద ప్రభావం చూపించదు. వెంటనే పరీక్ష జరిగింది. పూజ ఆరంభం కాగానే, ఆ యువతి నాట్యం చేసింది. అంతేకాదు ఆమె భర్త తతిమ్మా కుటుంబసభ్యులు కూడా నాట్యం చేశారు. దాంతో ఆ కుటుంబానికి ఎల్లమ్మ శక్తి లభించిందని రుజువయింది.

అందరూ మరో కొత్త మాతంగి లభించిందని ఒప్పుకున్నారు. మాతంగులు తాలూకాకు ఒకరో యిద్దరో వుంటారు కనక అది ఒక ముఖ్య సందర్భం అయింది. సమీప తాలూకాలోని వృద్ధ మాతంగిని పిలిపించి కొత్త మాతంగికి ఉపదేశం యిప్పించి తంతులలో ప్రవేశం కల్పించాలని నిశ్చయించుకున్నారు. ఉపదేశానికి దాదాపు పదహారు రూపాయల ఖర్చు ఆ కుటుంబం భరించాలి. అందుకు అప్పు చేయాలి. వాళ్ళు వెనకాడలేదు. ఆ తర్వాత చాలా లాభం ఉంటుందని వాళ్ళకి తెలుసు. గ్రామం మొత్తం ఏదో జరుగబోతోందని ఎదురు చూస్తోంది.

శూద్ర కులాల్లో ఒకటయిన రెడ్లలో ఒక పెదరెడ్డి ఆ ఊళ్లోనే ఉన్నాడు. కొన్నేళ్ళ క్రితం ఆయన వెండి, బంగారం, రాగి, ఇతర లోహాలతో నిలువెత్తు సర్పాన్ని చేయించి అనేక మంది గ్రామస్తులు చూస్తుండగా సులవేశనమ్మ కోనకి, గుండ్లకమ్మ నది ఒక గుహ ద్వారా ప్రవహించే చోట, ఒక ప్రముఖ పూజా స్థలానికి వెళ్ళాడు. అక్కడ రెడ్డి కొన్ని నియమాలు పాటించి ఉపదేశం పొంది అక్కడి పూజారులచేత అర్హత పొందాడు. ఆయన భార్య కూడా వెళ్ళి అన్ని నియమాలూ పాటించి నాగదేవత పూజలో పాల్గోటానికి అర్హత సంపాదించింది. వాళ్ళు యింటికి తిరిగి వచ్చాక ఇక్కడా అక్కడా వారిని పాము గురించి అడిగేవారు.

వృద్ధ మాతంగి వచ్చే రోజు సమీపించింది. మాదిగ పెద్ద ఎల్లమ్మ ఉండే తాటాకు పాకలోకి వెళ్ళాడు. కప్పుకి వేలాడుతున్న కుండని దింపాడు. ఎల్లమ్మకు ఆమె సంతానానికి చిహ్నాలయిన నాణాలు ఇతర వస్తువులూ ఆ కుండలో ఉంటాయి. ఆ కుండని ఊరి చెరువులోకి పొద్దుటే తీసుకువెళ్ళి రోజంతా నీటిలో వదిలి ఒక మనిషిని కాపలా పెట్టారు. సాయంకాలం అందరూ వెళ్ళి నీటిలోంచి బయటకు తీసిపూజలు చేసి గ్రామంలోకి తీసుకువచ్చారు. చెరువు వద్ద ఒక మేకనీ, దారి మధ్యలో మరో దాన్ని ఇంటికి చేరాక

యింకోదాన్ని బలిచ్చారు. ద్వారబంధానికి ఈ రక్తం పూసారు. రెడ్డి తన సర్పాన్ని తీసుకుని వచ్చి ఉంచాడు. దాని పడగ కింద ధాన్యం రాసులు పోసి అర్పించారు.

ఆ రాత్రి, సర్పాన్ని పూజించాక, వృద్ధ మాతంగి, రెడ్డి భార్య కలిసి ఒక మేకమీద కూర్చున్నారు. వాళ్ళ బరువుకి అది పడిపోయింది. అయినా పాము చుట్టూరా ఉన్న ధాన్యం రాసులు చుట్టూ దాన్ని మూడుసార్లు నడిపించారు. వాయిద్యాలు మోగాయి. చూసేవాళ్ళు మైమరిచిపోయి నర్తించారు. జనం కష్టాలూ రోగాలూ ఏమయినా ఉంటే అవన్నీ ఆ మేక మీద వాలి అది చనిపోతుందని వారి విశ్వాసం. మూడుసార్లు దాన్ని ప్రదిక్షణ చేయించేసరికి సగం చనిపోయిన ఆ మేకను ఆ తరువాత ఓ పక్కకి తీసుకువెళ్ళి చంపేస్తారు. మరుసటి రోజు సర్పం చుట్టూ పోగుబడ్డ ఆ ధాన్యాన్ని ఇతర సంబారాలని శూద్రులు వండారు. వారు వండితే బ్రాహ్మణులు కూడా తినటానికి వస్తారు. కనక కుల కట్టుబాట్లన్నీ పాటింపబడ్డాయి. సంతర్పణ అయాక అందరూ ఇంటికి వెళ్ళిపోయారు. వృద్ధమాతంగి కూడా తన ఇంటికి వెళిపోయింది. కొత్త మాతంగి ఇదంతా జరుగుతున్నపుడు శాంతంగా అంతా చూస్తూ ఉంది. ఆమె ఆమె కుటుంబ సభ్యులూ ఓవారం పాటు ఎల్లమ్మను పూజించి ఆ తర్వాత ఎవరిపనుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. ఆవహించిన సూచనలేవీ ఆ తర్వాత కనిపించలేదు. ఎల్లమ్మ కథలు పాడినపుడు మాత్రం ఆవిడ, ఆవిడ యింటివాళ్లు నాట్యం మొదలెట్టేవారు.

ఆ తరువాత ఏడాది ఆ కుటుంబమూ తదితర మాదిగలూ శ్రమపడి కూడబెట్టారు. ధాన్యం పోగేశారు. ఆ తర్వాత జరగబోయే ఉపదేశం తంతుకి అప్పులు తెచ్చారు. వారు శూద్రులుగాని మరి ఎవరు గాని సహాయం తీసుకోరు. ఎందుకంటే మాతంగి కావటమనేది మాదిగల వ్యవహారం. అందులో ఇతర కులాలు పాలు పంచుకోవచ్చు. కాని వాళ్ళు ఉపదేశం తీసుకోలేరు. ఎల్లమ్మకి ఓ కొత్త కుండ చేశారు. శంఖాలు నత్తగుల్లలు సముద్రం నుంచి తీసుకువచ్చారు. కృష్ణానది నీరు తీసుకువచ్చి వాటిని కడిగారు.

ఉపదేశం జరిగే ముందు, ఏమైనా ఒక చివరి పరీక్ష జరగాలి. ఆమె ఆ స్థానానికి తగినదేనని రుజువవాలి. ఒక యింటి నేలమీద ఒక బొమ్మను తెలుపు, ఎరుపు, పసుపు రంగు పొడులతో మూడు భాగాలుగా గీసారు. ఒక భాగంలో సర్పం ఉంచారు. రెండవ భాగంలో ఎల్లమ్మ కుండని ఉంచారు. మూడో దానిలో కొత్త మాతంగిని కూర్చోబెట్టారు. ప్రతీ మూలలోనూ ఒక చిన్ని కుండను ఉంచారు. దానిమీద కాషాయం, ఎరుపు చుక్కలు పెట్టారు. వాటిని మజ్జిగతో నింపారు. వాటికి తాళ్ళు కట్టి పైకీ కిందకీ పక్కలకీ నాలుగుసార్లు తిప్పారు.

ఈ ప్రారంభపు పనులు ముగిశాక, బైనూరుడు ఎల్లమ్మ కథను తన వాయిద్యంతో అందుకున్నాడు. ఆ స్త్రీ మీదకి అవాహన జరిగింది. కాని ఆమె లేవలేదు. ఆడలేదు. ఆమె అలాగే కూర్చుని అంతా తనలోనే ఉంచుకోవాలి. ఆమె అలా చేయలేకపోతే ఆమెకు అర్హత ఉండదు. ఆమె కదిలితే పైనుంచి వేలాడుతున్న చల్లకుండలు పగిలి చల్లకారిపోతుంది. ఈ లోగా బైనూరుడు శాంత వచనాలు చెపుతూంటే ఆవాహన నెమ్మదిగా దిగిపోతుంది.

జనం గుంపులుగా చేరి చూశారు. కొత్త మాతంగి పరీక్షకి నిలబడి తన స్థానాన్ని హుందాగా నడపగలనని రుజువు చేశాక అందరూ ఊపిరి పీల్చుకున్నారు. తిరిగి వృద్ధ మాతంగిలా ఆమెని అలంకరించారు. కొత్త బట్టలు కట్టారు. మెడలో వేపాకుల దండ వేశారు. ఆమె స్థానానికి గుర్తింపుగా ఆమె ఎడం చేత ఒక తట్ట ఉంచారు. కుడిచేతిలో ఒక కర్ర ఉంచారు. రెండు మూకుళ్ళలో ఒకదాన్లో పసుపు ఇంకోదాన్లో కుంకుమ వేశారు. ఆ రెండూ ఆమెకు సహాయకురాలైన ఒక ఆడమనిషి పట్టుకుంది. అందరి మధ్య నిలబడింది. మజ్జిగను నోట్లో తీసుకుంది. వేప మండలమీద దాన్ని వేసింది. అది అక్కడ నించున్న వారందరి మీద జల్లింది. మాతంగి స్పర్శకి కూడా శక్తి ఉందనుకోవటం వల్ల అలా జల్లబడిన వారందరూ ప్రక్షాళితులవుతారని శుద్ధి చెందుతారని నమ్మకం. ఆ రాత్రి రెడ్డి భార్య, కొత్త మాతంగి మేక మీద కలిసి కూర్చున్నాడు. తిరిగి పాముని పూజించారు. ఆ తర్వాత రోజు పెద్ద సంతర్పణ జరిగింది.

ఆ తర్వాత కొత్త మాతంగి భర్తతో కలిసి చుట్టుపక్కల ఊళ్ళలో మాతంగి గుడి సంబరాలు జరిపించింది. ఆమె భర్తచాలా గౌరవంగా ప్రవర్తిస్తాడు. ఎందుకంటే పురుషులు ఎవ్వరూ మాతంగి స్థానాన్ని సంపాదించుకోలేరు.

నాతో చెప్పిన మాతంగి ఉపదేశం కథ అది. మాతంగి సంప్రదాయం గాథలు గురించి నేను ఆరా తీశాను. ఒక గాధలో కొంత కొత్త సమాచారం లభించింది.

ఒకానొకప్పుడు ఓ రాజు ఉండేవాడు. అతని పేర దుందగేరి రాజు. ఆయన భార్య జమీలాదేవి. ఓ రోజు ఆయన కొలువుతీరి ఉన్నప్పుడు ఒక అందమైన కన్య ప్రత్యక్షమయింది. ఆమె శివుని భార్య పార్వతీదేవి అవతారం. రాజు తన కుడిచేతిని చాచి అందుకోబోతే ఆమె దూరమయిపోయింది. ఆయనా ఆ ప్రజలూ ఆమెని వెతుక్కుంటూ వెళితే ఆమె సూక్ష్మరూపం ధరించి ఒక చీమల పుట్టలో దూరి మాయమయిపోయింది. రాజు తవ్వే వాళ్లను పిలిపించాడు. అనేక బహుమానాలిస్తానన్నాడు. వాళ్ళు తవ్వటం ఆరంభించారు. చీమలపుట్ట రాయిలా ఉందని తెలుసుకున్నారు. రాజు రాళ్ళు కొట్టేవాళ్ళని పిలిపించాడు. రాణి వాళ్ళకు యింకా పెద్ద బహుమానాలు ప్రకటించింది. వాళ్ళ వల్ల కూడా పని జరగలేదు. రాజుకి కోపం వచ్చింది. తన ఈటెను తీసాడు. దానితో చీమలపుట్టలో పొడిచాడు. ఆ ఈటె ఆ కన్య తలని చేల్చేసింది. రాజు ఈటెను బయటకు లాగాడు. ఆ పిల్ల మెదడు బయటకు వచ్చింది.. రక్తం ప్రవహించింది. రాజు అతని అనుచరులూ దాన్ని చూసి మూర్ఛపోయారు.

ఆపిల్ల చీమల పుట్ట నుంచి విశ్వరూపంతో బయటకు వచ్చింది. ఆమె ఎడమచేతితో ఆకాశాన్ని పట్టుకుంది ( ఈనాడు తట్ట దానికి గుర్తు) కుడి చేత్తో ఆదిశేషుడిని పట్టుకుంది. (కర్ర ఈ రోజు పాముకి బదులయింది) సూర్యచంద్రులను పళ్ళాలుగా పట్టుకుంది. ఒకదాన్లో చిందిన రక్తాన్ని యింకో దాన్లో ముక్కలయిన మెదడుని ఉంచింది. మూర్ఛలో ఉన్న జనం నుదురులమీద మెదడుతో ఒక బొట్టు, రక్తంతో మరో బొట్టు పెట్టింది. కాబట్టి ఈ రోజు మాతంగికి రెండు పళ్ళాలున్నాయి. ఒకదాన్లో పసుపు ఒకదానిలో కుంకుమ వాటితో ఆమె జనం నుదుట బొట్లు పెడుతుంది. ఆమె బొట్లు పెట్టాక మూర్ఛలో ఉన్న వాళ్ళంతా తేరుకున్నారు. కన్య రూపంలోని దేవతను చూసారు. రాజూ రాణి ఆమెని తమ యింట్లోకి తీసుకువెళ్ళారు. ఆ తర్వాత ఆమె జమదగ్ని మహర్షిని వివాహమాడి అయిదుగురు బిడ్డలను కంది.

మాతంగి సంప్రదాయాన్ని శక్తి పూజలో ఒక భాగమనుకోవటం సబబే కాని దాని ప్రాధాన్యతను అది పూర్తిగా వివరించదు. శక్తిత్వం (శాక్తేయం) ప్రకృతిలోని స్త్రీ శక్తిని ఆరాధించడం. దానికి వివిధ రూపాలు ఉన్నాయి. అయినా అన్నీ శివుని అర్ధాంగి పార్వతి నుంచే ఆరంభమవుతాయి. దీన్ని కేవలం ఆర్యుల నుంచే ఆరంభమయిందనలేం. రుగ్వేద శ్లోకాలలో భూమ్యాకాశాల సంగమంతో ముడిపెట్టలేం. స్త్రీ ఆరాధన సూత్రం లక్షణాలు ప్రత్యేకించి స్కితియన్ మూలాలవే అని చెప్పలేం. ప్రకృతి ఆరాధనలో ఒక అంతర్గత భాగంగా ఉండే ఇటువంటి పూజారూపం కనుమరుగవుతున్న అనేక జాతులలో కనిపిస్తుంది. మాతృస్వామ్య వ్యవస్థ నాటి పురాతన మాతృపూజలోనే ఈ మాతంగి సంప్రదాయానికి వేళ్ళు ఉన్నాయి. ఈనాటి శాక్తేయంలో ఆనాటి మతకాండలు కొన్ని కనబడుతుంటాయి.

మాతంగి సంప్రదాయంలో మానవజాతి అత్యంత పురాతన ఆరాధనా పద్ధతులు కొన్ని కలిసి ఉన్నాయి.

తెలియని శక్తులను వశపరచుకోవటానికి మనిషి తెలివి సర్ప ఆరాధనను ఒక సాధనంగా భావించటం మానవజాతి చరిత్రలో ఎంత వెనక్కి వెళ్ళగలిగినా అక్కడ కనిపిస్తుంది. నేను విన్న కథ ప్రకారం సర్పం ఒక ముఖ్యాంశం కావటం తప్పనిసరయిందా అన్నది సందేహాస్పదం. అయినా రెండు సంప్రదాయలూ చక్కగా కలగలిసిపోవటం వాస్తవం. మాతంగి గాథలో ఆ కన్య చీమలపుట్టలోకి వెళ్ళి దాక్కుంటుంది. సాధారణంగా చీమల పుట్ట పాముల నివాసం, దాన్లో పాములు చుట్టలు చుట్టుకు పడుకుంటాయి. అంతేకాదు. మాతంగి చేతి కర్రా ఆదిశేషువుకి గుర్తు. ఈ రెండు సంప్రదాయాలూ కలిశాయని చూపిస్తుంది.

సర్పాలను కొలవటంతోబాటే చెట్లను కొలవటం పురాతన కాలంలో కనిపిస్తుంది. మాతంగి సంప్రదాయంలో దీని గుర్తులూ కనిపిస్తాయి. ఎల్లమ్మ దేవత ఒక మాదిగ కన్య మీద వాలితే ఆమెను చెట్లకు యిచ్చి పెళ్ళి చేయటం కొన్నిసార్లు చేస్తారు. ఆ తర్వాత ఆమె ఏంచెయ్యటానికయినా సర్వ స్వతంత్రాలూ లభిస్తాయి. మాతంగి మెడలో వేపాకుల దండ ఉంటుంది. చేతిలో వేపాకుల గుత్తి ఉంటుంది. దానితో ఆమె జనం మీద జల్లుతూ ఉంటుంది. ట్యూటన్స్ తాలూకా పవిత్ర వృక్షాలూ, బాల్ (Ball) తాలూకు మొక్కలు ఉన్న పురాతన సంప్రదాయం మూలాలే ఈ సంప్రదాయం చిహ్నాలలోనూ బహుశా ఉన్నాయి.

పడగవిప్పిన పాము చుట్టూ మేకను మూడుసార్లు ఈడ్చటం, దానిమీద ఇద్దరు స్త్రీలు కూర్చోటంతో అది నలిగిపోవటం, తర్వాత దాన్ని బలివ్వటం జరుగుతాయి. ఆ స్త్రీలలో ఒకరు మాతంగి సంప్రదాయానికి యింకొకరు సర్ప సంప్రదాయానికి ప్రతినిధులు కావటం చాలా ముఖ్యమైన విషయం. మాతంగి తన భక్తుల నుదుట పసుపూ ఎరుపూ పూయటం, దాన్ని మాతంగి మెదడూ రక్తంగా వివరించటం కూడా అంతే ముఖ్యమైనది. అది నరబలిని సూచిస్తుంది. నరబలికి సర్ప ఆరాధనతో దగ్గర సంబంధం ఉంది. ఆర్యుల ఉన్నత సంస్కృతి నరబలిని వ్యతిరేకించినా, బుద్ధుని బోధలు కూడా దీన్ని నిషేధించినా ఈనాటి బ్రిటిష్ ప్రభుత్వం ఇంకా ఆదివాసి జాతులలో ఇలాంటి పురాతన తంతులుండటం వల్ల చట్టబద్ధంగా నిషేధించటానికి పూనుకోవలసి వచ్చింది. ఆధునిక హిందూత్వం యొక్క చాలా సంక్లిష్ట స్వభావానికి మాతంగి సంప్రదాయం ఉదాహరణ. ఏదైనా ఒక సంప్రదాయం ప్రాచీనతను వివరించేది అందులో అనేక విభిన్న సంప్రదాయాలూ కలగలసిపోవటమే. తనని తను నిలబెట్టుకొనే మార్గం చేసుకోవాలన్న ఆకాంక్ష ఇతర సంప్రదాయాలను కలుపుకుని రావటానికి, యిముడ్చుకునేందుకు సిద్ధం చేస్తుంది.

స్వభావరీత్యా మాతంగి సంప్రదాయం అనార్యమైనప్పటికీ బ్రాహ్మణునికి దానిపట్ల శ్రద్ధ ఉంది. వేప మండల చేత విసిరించుకోటానికి, దుష్టశక్తుల నుండి శుద్ధి పొందటానికి అతను కూడా నిలబడతాడు. ఆత్మ రక్షింపబడాలన్న ఆశ మనిషి అన్ని యత్నాలలోనూ కనిపిస్తుంది.

# 3. గాథలలో కథలలో మాతంగి

మాతంగి సంప్రదాయం గురించి మాదిగలు చెప్పగలిగినదంతా సేకరించాను. తంతులు, ఆచారాలు అర్థం చేసుకోటానికి, ఈ సంప్రదాయం ప్రాచీనతకు తిరుగులేని సాక్ష్యం కోసం గ్రంథాలు తిరగేసాను. ప్రొఫెసర్ విల్సన్, సర్ మోనియర్ విలియమ్స్ ఇద్దరూ శక్తిరూపాల జాబితా యిచ్చారు. వారి ప్రకారం ఆ పేర్లు "కాళి, తార, షోదశి, భువనేశ్వరి, భైరవి, చిన్న మస్తక, ధనపతి, వగల, మాతంగి (అంటే భంగీ కులానికి చెందిన స్త్రీ) కమలత్మిక వీటిలో ఎల్లమ్మ పేరు వదిలేశారు. మాతంగికి పది గొప్ప శక్తులలో స్థానం లభించింది. నేను సేకరించిన సమాచారంతో ఇది సరిపోదు. ఎందుకంటే ఇవన్నీ దక్షిణ భారతానికి కాకుండా ఉత్తర భారతానికి సంబంధించిన పేర్లయి ఉండొచ్చు.

దక్షిణ భారతదేవతలకి సంబంధించిన మరో పుస్తకంలో శక్తులకు సంబంధించి మరో జాబితా కనిపిస్తుంది. 'మారియమ్మ, ఎల్లమ్మ, అంకాళమ్మ, భద్రకాళి, పిడరి, చాముండి దుర్గ, పురణై, పుదకలై, గొప్ప శక్తులలో స్థానం ఎల్లమ్మకి యిక్కడ లభించింది. ఇందులో మాతంగికి స్థానం లేకపోవటానికి కారణం ఆమె ఇందులో ఉన్న ఒకే ఒక పరియా కావటమూ అప్పుడప్పుడూ ఆమెను ఎల్లమ్మ ఆవహించటమూనూ.

కొంతవరకూ తిరుగులేని సాక్ష్యాన్ని నాకు యిచ్చిన రచయిత డెన్మార్క్ మిషనరీ జీగెన్‌బగ్. 1713లో ఆయన 'ది గాడ్స్ ఆఫ్ మలబార్' రాసి జర్మనికి ప్రచురణకు పంపాడు. ఆయన పుస్తకాన్ని వారు ప్రచురించమని చెప్పారు. ఆయనని భారతదేశానికి పంపినది 'విగ్రహారాధనను పెకిలించివేయటానికేగాని, ఆ చెత్తను తీసుకెవెళ్ళి యూరప్‌లో వ్యాపింపచేయటానికి కాదు' అన్నారు. ఆ గొప్ప మిషనరీ మహాపండితుడు. 1867 వరకూ ఆయన పుస్తకం ప్రచురణ కాలేదు. తెలుసుకోదలచిన వాడికి మరెక్కడా దొరకని సమాచారం ఆ పుస్తకంలో లభిస్తుంది.

మాతంగి సంప్రదాయానికి వివరణ నాకు ఎక్కడా దొరకలేదు. కాని అనేక గ్రంథాలలో ఈ పేరు కనిపిస్తుంది. ఒక విధంగా ఇదే ఒక కొండ గుర్తులా పనికొస్తుంది. చుట్టుప్రక్కల పరిస్థితులన్నీ ఒకే విధంగా ఉండటం వల్ల ఈ పేరు తిరిగి తిరిగి ప్రస్తావించబడటం చాలావరకూ తృప్తినిస్తుంది. మాతంగ అన్న పురుష నామమూ మాతంగి అన్న స్త్రీ నామమూ కనిపించినప్పుడల్లా ఒక మత అభిలాష దాంతోబాటు చండాల అంశం కనబడతాయి.

మహాభారతంలో మొట్టమొదటిసారి మాతంగి అన్నపేరు కనబడుతుంది. ఈ సంస్కృత ఇతిహాసానికి స్పష్టమైన కాలనిర్ణయం చేయటం సాధ్యం కాదు. ఇందులో కొన్ని భాగాలు అత్యంత పురాతనమైనవి. మాతంగ మహర్షి సంప్రదాయం బహుశా ఆ పురాతన భాగాలకి చెందినదయింటుంది. తక్కువ పుట్టుకకు చెందిన భారతదేశపు పురాతన ప్రసిద్ధ ఋషులు కొంతమందిలో ఆయన ఒకడు.

మాతంగుడు తనను తాను బ్రాహ్మణ తల్లిదండ్రులకు పుట్టాననుకుంటాడు. ఓ రోజు ఏదోలా అతని జన్మరహస్యం తెలుస్తుంది. గాడిదల బండిలో ప్రయాణం చేస్తున్నాడు. అవి నెమ్మదిగా నడుస్తున్నాయి. అసహనంతో అతను ఓ గాడిదను కొట్టాడు. ఆడ గాడిద "బండిలో ఉన్నది చండాలుడు. అతని క్రూర ప్రవర్తన అతని జన్మని తెలియబరుస్తోంది" అంది.

మాతంగుడు అది విన్నాడు. వెంటనే తన పుట్టుకను తెలియజెప్పమని ఆడగాడిదను అడిగాడు. తల్లి బ్రాహ్మణురాలని, తండ్రి చండాలుడని తెలుస్తుంది. ఏమైనా బ్రాహ్మణత్వాన్ని పొందాలని మాతంగుడు తపస్సు ఆరంభించాడు. ఇంద్రుడు ప్రత్యక్షమయాడు. చండాలునికి పుట్టావు గనుక నీకు అంత ఉన్నతస్థానం లభించదని అతని కోరికను నిరాకరించాడు. వంద ఏళ్ళ తపస్సు ఫలించలేదు. కాలిబొటన వేలిమీద నిలబడి మరో వంద సంవత్సరాలు తపస్సు చేశాడు. కామరూప శక్తిని (కోరిన రూపం ధరించే శక్తి) ఆకాశ గమనాన్ని (పక్షిలా ఆకాశంలో విహరించే) శక్తిని (కోరిన రూపం ధరించే శక్తి) ఆకాశ గమనాన్ని (పక్షిలా ఆకాశంలో విహరించే) శక్తినీ యిచ్చేటంతగా ఇంద్రుడు ప్రసన్నమయాడు. ఈ గాథ స్వచ్ఛమైన బ్రాహ్మణ పుట్టుకలేని వారిని బహిష్కరించే బ్రాహ్మణ వారసత్వపు పట్టుని సూచిస్తుంది.

శతాబ్దాలు గడిచాయి. మనం తిరిగి ఒక మాతంగ రుషిని చూస్తాం. అత్యంత ప్రాచీనమైన భారతీయ ఇతిహాసం రామాయణంలో ప్రస్తావిస్తారు. ఆ ఇతిహాస కథానాయకుడు రాముడు దండకారణ్యంలోకి ప్రవేశించినపుడు మాతంగ మహర్షిగురించి వివరిస్తారు. "చివరకు ఏనుగులైనా, ఎన్నున్నప్పటికి ఆశ్రమ సరిహద్దులను దాటవు". మాతంగుడు అతని శిష్యులూ స్వర్గానికి విమానాలలో వెళ్ళిపోయారు. "శబరి పేరుగల ప్రసిద్ధ సన్యాసిని రాముని రాకకోసం నిరీక్షించమని వెళ్లేముందు ఆదేశించారు. ఆయన రాకతోనే ఆమెకు స్వర్గలోకం ప్రాప్తిస్తుందని చెప్పారు.

రాముడు వస్తాడు. ఆ స్త్రీ సన్యాసినితో మాట్లాడతాడు. జడలు కట్టిన జుత్తుతో, చినిగిన బట్టలతో, తొడుగులా ఉన్న చర్మంతో ఆమె ఆయన ముందు నిలబడుతుంది. "మృదుభాషిణీ! నువ్వు రుషిత్వానికి కావలసిన అన్ని అవరోధాలూ దాటావు. అన్ని నియమాలూ పాటించావు. బ్రహ్మానందం పొందావు" అన్నాడు.

ఆమె రాముడిని ప్రస్తుతించింది. "నీ సాక్షాత్కారంతో నన్ను కరుణించావు. నా తపస్సు ఫలించింది." అంది.

మాతంగారణ్యాన్ని అతనికి చూపించింది. పంపానదీ తీరంలోని అనేక వన్యఫలాలని ఆమె ఆయన కోసం ఏరింది. అవి అతను స్వీకరించాడు. ఆమె కృషి ఫలించింది. తన దేహాన్ని త్యజించి ఆ మహర్షుల సాంగత్యం కోసం నిరీక్షిస్తున్నాని తెలియజేసింది.

ప్రసన్నమయిన రాముడు ఆనందంతో అన్నాడు. " ఓ శబరీ! నీ కోరిక సిద్ధించుగాక!" ఆ విధంగా రామునిచేత అనుజ్ఞ పొంది శబరి అగ్నిప్రవేశం చేసింది. సాయుజ్యం పొందింది.

వెనకటి కథతో పోలిస్తే ఈ కథలో కొంత సహనం కనిపిస్తుంది. దక్షిణభారతంలో ఆర్యరుషులు వలసలు ఏర్పరచుకుంటూ రాజీ మార్గాలను చేపడుతున్న కాలానికి చెందినవాడు మాతంగ రుషి. ఆయన తన శిష్యులతో ఆశ్రమం ఏర్పరచుకున్నాడు. కాని వారు ఎవరినీ అంటకుండా ముట్టకుండా నివశించలేదు. రాముడు వచ్చేవరకూ ఆశ్రమ బాధ్యతను ఒక పరియా స్త్రీకి అప్పజెప్పి గౌరవించారు. బ్రాహ్మణ రుషులు ఆశించే స్వర్గాన్ని కోరుకోవటం నేర్పారు.

తిరిగి కొన్ని వందల ఏళ్ళ అనంతరం మనకి పురాణాలలో ఈ ప్రసక్తి కనిపిస్తుంది. పురాణాలు రామాయణం తర్వాత కాలానివి. ఇందులో మాతంగి ప్రస్తావన నేరుగా లేదు. అయినా కాలం తీసుకువచ్చిన మార్పులు ఇది స్పష్టం చేస్తుంది. ఆర్యదేవతని పూజించటం ఆదివాసి హృదయాలను అంతగా ఆకర్షించలేదని గ్రహించారు. అయినా నరే వారి ధార్మిక భావాలను నియంత్రించాలని ఆశించారు. అన్నింటిలోనూ దేవుళ్ళను చూచే ఆర్యుల విధానంలో తక్కువ రకం దేవుడు శివుడికి ద్రవిడుల దేవుళ్ళలోచూడానుకొనే ముఖ్యగుణాలన్నీ క్రమంగా ఆపాదించారు. ఇది శతాబ్దాల కాలంలో రూపొందింది. శక్తిపూజ శివుని అర్ధాంగి పార్వతి రూపంలో ప్రకటితమయింది. ఆమె అనేక రూపాలలో ఈనాడు పూజించబడుతోంది. అందులో మాతంగి ఒక రూపం.

వలవిసు పురాణంలో ఈ గాథ కనిపిస్తుంది. పార్వతీ, ఆమె కుమారుడు కార్తికేయుడూ ఒక చెప్పగూడని రహస్యాన్ని బయటపెట్టారు. దానికి శిక్షగా వాళ్ళు అనంతమైన జన్మలు ఎత్తాలి. శిక్షను ఒకే ఒక జన్మగా మార్చమని పార్వతి వేడుకొంది. ఆమె కోరిక అంగీకరించబడింది. అదే సమయానికి పరవలరాజు త్రయం బళ అతని రాణి వరుణవల్లి బిడ్డలకోసం వ్రతాలు చేస్తున్నారు. నోములు నోస్తున్నారు. పార్వతి ఆ దంపతులకి బిడ్డగా పుట్టింది. ఆమె పేరు తిరిసేరు మదంతే. పార్వతి కొడుకు బ్రహ్మాండమైన చేపగా పుట్టి సముద్రంలో విహరిస్తున్నాడు. దక్షిణం వైపుగా ఈదుతూ వెళ్ళి పరవల చేపల పడవల మీద దాడి చేశాడు. వాళ్ళ వ్యాపారాన్ని నాశనం చేస్తానని బెదిరించాడు. ఆ చేపని పట్టుకున్న వాళ్ళకి తన కూతురిని ఇచ్చి పెళ్ళి చేస్తానని రాజు ప్రకటించాడు. శివుడు పరవ రూపం ధరించి, ఆ చేపని పట్టుకొని తన భార్యను తిరిగి కలుసుకున్నాడు. ఆదివాసీలకు శివపార్వతులను దగ్గరచేసే ప్రయత్నమే ఈ గాథ. ఈనాటి తమిళ జాలరి తెగలలో పరవలు మొదటి తరగతివారు ఒకప్పుడు బలమైనవారు. రాజ్యాలు ఏలారు.

ఎల్లమ్మ గాథలో ఆర్యదేవతల పక్కనే ఈ ఆదివాసీ సంప్రదాయం ఉండటాన్ని వివరించేందుకు బ్రాహ్మణులు మరింత విపులమైన ప్రయత్నం చేశారు. ఆర్యుల భావనలో ప్రత్యేకంగా సృష్టించబడిన దేవుడు విష్ణువు.పరశురాముని రూపంలో ఎల్లమ్మ కొడుకుగా అవతారం ధరిస్తాడు. శైవ వైష్ణవాల సంగమం ఎల్లమ్మ రూపంలో కనిపిస్తుంది. ఆమె శివుని భార్య పార్వతి అంశ. విష్ణువు అవతారాలలో ఒకరికి తల్లి.

ఎల్లమ్మ ఒక బ్రాహ్మణుని కూతురు. బాల్యం నుంచీ చాలా పవిత్రంగా జీవించడం వల్ల ఒక గొప్ప రుషి ఆమెను వివాహమాడాడు. ఆమెకి పరుశురాముడు మరి ముగ్గురు బిడ్డలు కలిగారు. ఆమె పాతివ్రత్య బలంతో భర్త యజ్ఞం కోసం కావేరీ నదీ జలాలను పెద్ద బంతులు చేసి దొర్లించేది. ఒకరోజు ఆమె దొర్లిస్తున్న నీటి బంతి మీద ఒక నీడ పడింది. పైకి చూసింది. ఆకాశంలో వెళుతున్న ఆమెకు గంధర్వులు కనిపించారు. వారి అందానికి ఆమె చకితురాలయింది. మరునటిరోజు జలం దొర్లటానికి నిరాకరించింది. ''నువ్వెందుకు నీళ్ళు దొర్లించలేకపోతున్నావు?" అని రుషి అడిగాడు. "నిన్న నీటిమీద ఓ నీడను చూసాను. పైకి చూస్తే ఆకాశంలో వెళుతున్న గంధర్వులు కనిపించారు. ఇంతకు మించి నేనేపాపము ఎరుగను" అంది. "నువ్వు నీ పాతివ్రత్యం కోల్పోయావు. పతివ్రతలు పైకి చూడరు. గంధర్వులను చూసి చకితులవరు" అన్నాడు రుషి.

తన కొడుకులను పిలిచి ఆమె తల నరకమన్నాడు. "ఆమె మాతల్లి. మేం ఎలా నరకగలం?" అన్నారు వారు. పరుశురాముడు ఒక్కడే అంగీకరించాడు. తల్లిని వెదికి తెమ్మని పంపించాడు. ఆవిడ పరియాలను శరణు కోరింది. పరుశురాముడికి అప్పగించటానికి వారు తిరస్కరించారు. పరుశురాముడు పరియాలు అందరినీ చంపేశాడు. తల్లి తల నరికి తండ్రి దగ్గరకు తీసుకువచ్చాడు. రుషి ప్రసన్నుడయాడు. ''నాయనా నీకేంకావాలో కోరుకో'' అన్నాడు. నా తల్లిని నాకు తిరిగి యియ్యి" అన్నాడు. రుషి ఆ వరం ఇచ్చాడు. అతని తల్లి తలను తిరిగి యిచ్చాడు. పరశురాముడు తల్లి మొడాన్ని వెదుకుతూ వెళ్ళాడు. తను చంపిన పరియాల మధ్య తల్లి శవం దొరకలేదు. దాంతో ఒక పరియా స్త్రీ మొండానికి తల్లి తల చేర్చి బ్రతికించాడు. ఆమెని చూసి రుషి అన్నాడు. "ఆమె ఇప్పుడు పరియా స్త్రీ" తల్లీ, కొడుకూ ఇద్దరినీ తన సముఖం నుంచి పంపేశాడు రుషి. ఆ తర్వాత పరుశురాముడు ఒక గొప్ప రాజు అయాడు. ఎల్లమ్మ దేవత అయింది.

జీగెన్‌బాగ్ ప్రకారం మలబారు దేశంలో ఎల్లమ్మకి కట్టిన గుళ్ళలో ఆమె కాక ఎనిమిది మూర్తులు ఉంటాయి. వాటిలో మాతంగి ఒకటి. ఎల్లమ్మ తల అతికించిన పరియా స్త్రీ మాతంగి. మరొకటి ఆమెను చంపమని ఆజ్ఞాపించిన భర్త జమదగ్ని. చీమలపుట్ట నుంచి బయటకి వచ్చిన కన్య మాతంగిని

వివాహమాడిన రుషి జమదగ్ని ఇది ఈ రెండు గాథల మధ్య సంబంధాన్ని నిరూపిస్తుంది.

మాతంగికి సంబంధించిన గాథలు ఎల్లమ్మ గాథ నుంచి చాలా వరకూ స్వీకరించబడినాయి. స్థానిక చరిత్రలోనూ జీవిత చరిత్రల్లోనూ ఆమె మళ్ళీ మళ్ళీ ప్రస్తావించబడటం నేను గమనించాను. పౌరాణిక రూపంలో గాథలలో కనిపించే దానికి భిన్నంగా ఆమె చాలా ధైర్యవంతురాలిగా కనిపిస్తుంది. ఆమె తన తెగకు ఒక యోధురాలు. 1338లో మూడవ మహమ్మద్ కర్ణాటకలో కంపుల ఆక్రమణలో ఆమె భాగం వహిస్తుంది. కుమార రామ నాయకత్వంలో యుద్ధం చేసిన తెలుగుదేశపు యోధులలో ఆమె ఒకరు.

మాతంగి దగా చేసినట్టు కనిపిస్తుంది. ఢిల్లీ రాజు దగ్గరకి వెళ్ళింది. తన సేనాసుల పిరికితనంతో అతను మతిపోయి ఉన్నాడు. మాతంగి కింద పెద్ద సైన్యాన్ని ఉంచాడు. తనంతతాను శత్రువుతో చేయి కలపడమే కాకుండా అనేకమంది తెలుగు సైనికులను మహమ్మద్ వేపు యుద్ధం చేసేందుకు ఒప్పించింది. యుద్ధం మొదటిలో కుమార రామ విజయం పొందాడు. శత్రువుని తరిమికొట్టాడు. తన సైన్యంలోనే వెన్నుపోటు పొడుస్తున్నారని అతడికి తెలియదు. తెలియగానే ప్రమాద స్థలానికి వెళ్ళి మాతంగిని ఎదుర్కొన్నాడు. ఆమె ముక్కుపుడకను వశం చేసుకుని విసిరేసాడు. ‘ ఒక స్త్రీ ప్రాణం నేను తియ్యలేను ’ అన్నాడు. అతని ధైర్యవంతులయిన సైనికులు మాతంగి సైన్యబలం ముందు నిలవలేకపోయారు. అందరూ అతని చుట్టూ కూలిపోయారు. అతని ఒంటివాడయిపోయాడు. అనేక మందిని చంపి చిట్టచివరికి కుమారరాముని కూడా వధించారు. మాతంగి అతని తలని కొట్టి ఢిల్లీ తీసుకువెళ్ళింది.

ఇక్కడ మాతంగికి ఒక కొలువు (అధికార స్థానం) ఉంది. తెలుగు యోధుల మీద ఆమెకి ఉన్న పట్టు వల్లనే ఢిల్లీ రాజుకి ఆమె మిత్రపక్షం అయింది. ఆమెను యుద్ధంలో పట్టుకుని కూడా కుమారరామ చంపటానికి సందేహించటానికి ఆమె స్త్రీ అవటం కన్నా ఆమె కొలువు మీద గౌరవమే కారణం కావచ్చు. అందరిచేతా పవిత్రంగా భావించబడిన సంప్రదాయానికి ఆమె చిహ్నం.

శతాబ్దాల అంతరాల మధ్య మాతంగి పేరు అనాది కాలం నుంచి తిరిగి తిరిగి వినబడుతూంటుంది. దాన్ని వెనుదిరిగి చూస్తే ఒక సూత్రం తెగిపోకుండా కనిపిస్తుంది. ఆర్య దండ యాత్రికుడు ఒక విచిత్రమైన శక్తి, కలకాలం సాగే గుణమూ గల ఒక ఆదివాసీ తెగతో తలపడ్డాడు. దానికి ఒక స్థానం కనుగొనడానికి, దాన్ని నియంత్రించడానికి దాన్ని లొంగదీసుకోడానికి చూశాడు. మొట్టమొదటి అడుగు మాతంగ రుషి గాథలో కనిపిస్తుంది. బ్రాహ్మణత్వ వరం తిరస్కరించటం ద్వారా కొంచెం చండాలమూలం ఉన్న వారిని వెలివేయగల బ్రాహ్మణీయ పవిత్రత్వ బలం ప్రదర్శించాడు. ఆ తర్వాత ఆర్య రుషులు దక్షిణభారతంలో స్థావరాలు ఏర్పాటు చేసుకుంటూ అనుసరించిన కొద్దిపాటి సంయమన విధానాల మచ్చు కనిపిస్తుంది. ద్రవిడ భావాల నుంచి కొంతవరకూ తయారయిన శివుడు అతని భార్య పార్వతి కొన్ని దిగువ ఆదివాసి తెగలకు నచ్చే విధంగా రూపొందటం ఆ తర్వాత కనిపిస్తుంది. అంతటితో తృప్తిపడలేదు. మాతంగి సంప్రదాయానికి చాలా దగ్గరగా శైవాన్ని తీసుకురావడమేకాదు వైష్ణవం కూడా ఏదోలా దాని మీద పట్టు సాధించింది. ఈ విచిత్ర ఆదివాసీ సంప్రదాయాన్ని బ్రాహ్మణాధిపత్యం తనలో కలిపేసుకున్నట్లు కనిపించవచ్చు. కాని అది సత్యం కాదు. బ్రాహ్మణ రుషుల శాపనార్థాలతో వారిని వారెంత తృప్తిపరచుకున్నా “ యోధురాలు మాతంగి” చూపించిన భయానక క్రౌర్యం దానితో పూర్తగా విభేదిస్తుంది.

ఆదివాసీ తెగలు ఒక విశిష్టమైన పట్టు వదలనితనంతో తమ సంప్రదాయాలకు వేళ్ళాడేరు బ్రాహ్మణులు మాతంగి సంప్రదాయంలో తమంత తాము ఆసక్తి చూపించారు. ఆదృష్ట్యా చూస్తే వారి ధార్మిక భావనలేవీ అందులోకి జొరబడలేకపోవటం ఆశ్చర్యకరం. వారి ఊహలకి అనుగుణంగా దానికి సంబంధించిన గాథలను మలచటంలో వారు కృతకృత్యులయ్యారు. కాని ఆ సంప్రదాయం లోపలికి మాత్రం చేరలేకపోయారు. అది ఒక ఆదివాసీ సంప్రదాయం.

# 4. మహాలక్ష్మి అమ్మవారు (మాలచ్చుమ్మ)

చిన్ని స్వరూపం, వయస్సుతో వంగిపోయి దాదాపు చూపు ఆనని మా పాత తోటమాలి ఒంగోలులో ప్రతిరోజు బంగ్లాకి వచ్చేవాడు. పగటి ఎండలలో పెద్ద పెద్ద చెట్ల క్రింద కూర్చునేవాడు. అనేక సంవత్సరాలు తను చేసిన పనినే ఇతరులు చేస్తుంటే చూస్తుండేవాడు. అతనికి ఇష్టుడైన మనవడు తరచుగా చెయ్యి పట్టుకుని నడిపించుకు వచ్చేవాడు. ఇతర సమయాల్లో తనంత తానే తోట బాటలలో వచ్చేవాడు. కర్రని తాటించుకుంటూ, సాధారణంగా తనెక్కడున్నదీ మరచిపోకుండా వచ్చేవాడు. అక్కడి ప్రతి అడుగు నేలా ప్రతి మొక్కా గడచిన సంవత్సరాలో అతను తాకినవే గదా!

అతని తండ్రి చెప్పినవీ, అతని రోజులలో జరిగినవీ ప్రతిదీ అతని జ్ఞాపకాలలో ఉండేవి. ఒంగోలులో నివసించిన ముదుసలి వాళ్ళలో అతను ప్రత్యేకమైనవాడు.

"నువ్వు బాలుడిగా ఉన్నప్పటి ఒంగోలు గురించి చెప్పు తోటమాలీ" అన్నాను ఒకరోజు. అది అతని జ్ఞాపకాల వరదకి తలుపులు తెరిచింది. అతనికి ఎంతో ముఖ్యమైనదీ ఆసక్తికరమైనదీ అనిపించిన సంఘటన గురించి మొట్టమొదట చెప్పాడు.

'అమ్మా! నేను చిన్న పిల్లాడుగా ఉన్నప్పుడు బ్రిటిష్ వాళ్ళు గుమనూరు రాజా వారిని ఒంగోలు మీంచి తీసుకువెళ్ళారు".

" ఎందుకలా చేశారు?"

" ఆయన వాళ్ళ ఖైదీ. చుట్టూ బోల్డంత మంది సైనికులు. ఆయన సైనికులే ఆయనను రక్షించలేకపోయారు. అయిదు రోజుల తర్వాత మద్రాసు చేరారు."

గుమనూరు రాజావారికి మహాలక్ష్మి దేవత. ఆయన సంపదంతా దేవతకి సమర్పించాడు. పూజారులు చెప్పిన ప్రకారం బలులు యిచ్చాడు. ప్రతిరోజు ఎంతో ఆహారంతో పాటు రెండు దున్నపోతుల రక్తం ఆమెకి కావాలి. ఒక్కోసారి నరబలితో తప్ప ఆమె శాంతించేది కాదని చెప్పుకునేవారు.

బందీగా తీసుకుపోయాక రాజావారు మహాలక్ష్మికి ఏమీ చెయ్యలేకపోయాడు. ఆమె కోపంతో ఊగిపోయింది. ఒకరోజు అతని దగ్గరకు వెళ్ళి అడిగింది.

"నువ్వు నాకు ఏమీ అర్పించలేదు. నన్నేం చెయ్యమంటావు"

రాజా జవాబిచ్చాడు. " ఇంగ్లీసు ప్రభుత్వం నాకు యీ అపచారం చేసింది. వాళ్ళ దగ్గరకు వెళ్లు. వాళ్ళకున్న ప్రతీది ధ్వంసం చెయ్యి. వాళ్ళ సైన్యాలలోకి కలరా మశూచికం తీసుకురా!" రక్తదాహంతో దేవత అతన్ని వదిలి వెళ్ళింది.

రాజా ఆ దోవన వెళ్ళిన మూడు రోజులకి ఒంగోలుకి ఆపద సంభవించింది. ఒంగోలులో ఎవ్వరికీ అంతకు ముందు కలరా, మశూచికం అంటే తెలియదు. ఇప్పుడు వాళ్ళకి అదేమిటో తెలిసింది. వణికిపోయారు. మహాలక్ష్మి కోపం చాలా భయంకరమైనది. కనిపించినవారందరినీ చంపింది. మొదటిరోజు పన్నెండు మంది చనిపోయారు. ఆ తర్వాత వారాలలో అనేకమంది చనిపోయారు. ఎవ్వరూ లెక్కపెట్టలేకపోయారు. ఆ ప్రాంతంలో ఏ వూరు వదలలేదు. మహాలక్ష్మి రక్తదాహం శక్తి ఎలాంటిదంటే ఓ మనిషి జబ్బు పడితే వెంటనే చనిపోయేవాడు. ఎవ్వరినీ వదలలేదు.

చాలామంది భయంతో మూగవోయారు. కొందరు అన్నారు. "మహాలక్ష్మికి రక్తం కావాలంటే జంతువుల రక్తం ఇద్దాం. అది వీధులలో పారించుదాం. అది తాగుతూ ఆవిడ మనని విడిచిపెట్టొచ్చు."

వందలాది గొర్రెలు, అసంఖ్యాకమైన దున్నపోతులూ బలయ్యాయి. మహాలక్ష్మికి గుడులు వెలిశాయి. ఒకరితర్వాత ఒకరుగా తమ యిళ్ళలో వాళ్ళు చనిపోవటం చూసినవారు రక్తసిక్తమైన చేతులతో పూజలు చేశారు. ఆడామగా పూనకం వచ్చినట్టు నాట్యం చేశారు. రోజంతా వాయిద్యాలు మోగాయి. పూజారులు మంత్రోచ్చారణలో మునిగిపోయారు.

క్రమంగా మహాలక్ష్మి దాహం తీరింది. ఏళ్ళు గడిచినకొద్దీ ఆమె శాంతించింది. ఆమె అనుగ్రహం తప్పినవారు కూడా ఆమె చేతులనించి తప్పించుకుని బతికి బట్టకట్టారు..

ముసలి తోటమాలి అన్నాడు. " ఇవేం జరగలేదని నీకు సందేహామా! ఒంగోలు చుట్టుపక్కల ఊళ్ళను చూడు. నీకు మహాలక్ష్మి గుళ్ళు కనిపిస్తాయి. గుమునూరు రాజావారు వెళ్ళక ముందు నేను చిన్న పిల్లాడిగా ఉన్నప్పుడు ఒక్కటంటే ఒక్క గుడి లేదు."

ఈ విషయం గురించి తెలుసుకున్నాను. ముసలి తోటమాలి కథలో వాస్తవమూ మూఢనమ్మకమూ కుతూహలకరంగా కలిసిపోయాయి. 1835వ సంవత్సరంలో ఒంగోలుకి ఉత్తరంగా మూడు వందల మైళ్ళ దూరంలో గుమునూరు రాజ్యంలో తిరుగుబాటు జరిగింది. రాజును బందీ చేసి బహుశ ఒంగోలు మీంది మద్రాసు తీసుకెళ్ళారు. మద్రాసు ప్రెసిడెన్సీలో కలరా వ్యాధి మొదటిసారిగా, ఆతరం వారికి జ్ఞాపకమున్న మేరకు, కొన్ని సంవత్సరాల తర్వాత వ్యాపించింది. కొన్ని ఏళ్ళకి ఈ రెండూ సంఘటనలూ ఒకదానితో ఒకటి కలిసిపోయాయి.

ఇందులో గమనించవలిసిన సందర్భమేమంటే గుమునూరు ప్రజలు ఖోందులు. ద్రవిడ సంతతివారు. వారి దేవత జుగహ్‌పెన్ను. "మనుష్యులు భూమి మీద విత్తనాలు జల్లినట్లు మనుషులమీద ఆమె మశూచికం జల్లుతుంది." ఈ భయంకర వ్యాధి ఓ గ్రామంలో వ్యాపించినపుడు అందరూ ఊరిని వదిలి వెళతారు. కొందరు

మాత్రం దున్నపోతులు, పందులు, గొర్రెల రక్తం అర్పించటానికి ఊళ్ళో ఉండిపోతారు. ఖోండులకు నరబలి తెలియనిది కాదు. జుగహ్‌పెన్ను స్వభావం నరబలితో సహా అచ్చం మహాలక్ష్మిదే. రాజాతో వచ్చిన వాళ్ళలో కొందరు ఈ వ్యాధి క్రిములను బహుశా ఒంగోలుకి తెచ్చి ఉండొొచ్చు. జనం మనసులలో ఈ వ్యాధి వ్యాపించటమూ రాజా గారి ముకామూ కార్యకారణ సంబంధాలయినాయి. ఒంగోలులోని భూత పూజలలో చాలా భయంకరమైన భూతంగా మహాలక్ష్మి ఒకటయింది.

భారతీయ గ్రామాలలో రాత్రింబవళ్ళు అపాయం కలిగించటానికే నాశనం చేయటానికే కంకణం కట్టుకుని రక్తదాహంతో ఉండే అమ్మవారు కోకొల్లలు. ఎవరైనా జబ్బుపడితే, పంటలు పోతే, పశువులు చనిపోతే లేక ఏ రకమైన నష్టం పల్లెకి జరిగినా అది ఒక క్షుద్రశక్తి పనిగా భావించేవారు. ఆ భూతాలకోపాన్ని, పగని ఉపశమింపచేయటానికి బలులు అర్పించేవారు.

ఓమారు ఓ బ్రాహ్మణుడు చెప్పడు "విష్ణుమూర్తి తన స్థానంలోనే ఉంటాడు. కాని పోలేరమ్మ అంకాలమ్మ వంటి శక్తులూ భూతాలూ ఎప్పుడూ భూమిను చూస్తుంటాయి. దేన్నయినా నాశనం చేయటానికి సంచారం చేస్తుంటాయి" ఆర్య సంతతివాడయినా ఆయన మంచి చెడ్డ శక్తుల గురించి యిచ్చే వివరణ స్కితియన్ భూతతత్వం వేపు మొగ్గి ఉంటుంది. అతను అంటారు "ఏకైక పరమాత్మ ఎవ్వరికీ హాని చేయనంత మంచివాడు. కాని క్షుద్రశక్తులు భూమికి సమీపంగా ఉంటాయి. చెడు చేయటం వాటికి ఆనందం"

నేను విచారించగా తెలిసినదేంటంటే పూజలు ఆరంభించటానికి దారితీసిన కారణాలను మరచిపోయినా మాదిగలు స్థల దేవతలను పూజిస్తూనే ఉంటారు. విచిత్రమైన పరిస్థితులలో మరణించిన మగ గాని ఆడ గాని ఆత్మలు అశాంతితో సంచరిస్తుంటాయిని ఒక వేపచెట్టుని నివాసం చేసుకుంటాయని తరతరాలుగా నమ్ముతున్నారని నేను చెప్పగలను. పురాతన ద్రవిడ కర్మకాండలననుసరించి ఒక రాతిని ఆ చెట్టుకింద ఉంచి దానికి కుంకుమ పూసి ఎర్రటి చుక్కలతో అలంకరించి పూజిస్తారు. ఒక్కోమారు మంచి మనుషుల ఆత్మలు ప్రాంతీయ స్వాములై దయతో లాభాలను యిచ్చే దేవతలు అవుతుంటాయి. కాని వారు కూడా కోపగించి మనుషులను రక్షించకపోవచ్చు. శ్రద్ధ తగ్గినా, వారికి పూజలలో లోపం జరిగినా ఆగ్రహించవచ్చు.

ఓ ప్రాంతీయ స్వామిని అంత విశ్వాసంగా ఎందుకు పూజిస్తారని నేను తరచు అడిగే ప్రశ్నకు ఒకమారు మాౖత్రం తృప్తికరమైన జవాబు దొరికింది. ఆ విధంగా నేను ఊరికి ఉపకారం చేసే దేవత మూలం తెలుసుకున్నాను.

చలకమ్మ అనే శూద్ర స్త్రీ ఉండేది. ఆమె యింకా జ్ఞాపకం ఉండటం వల్ల మరీ వెనకటి తరాలది కాదు. ఆమె మామ ధనవంతుడు. బోల్డంత డబ్బు పోసి చదరపు ఆకారం గల పెద్ద బావిని తవ్వించసాగాడు. అలాంటివి దక్షిణ భారతదేశంలో తరచు కనిపిస్తుంటాయి. నూతి మధ్యలో జల (ఊట) ఉంటుంది. నాలుగు వేపులా గోడలకు రాతి మెట్లు ఉంటాయి. నీళ్ళు కావలసిన వాళ్ళు కుండలలో నింపుకోటానికి కిందకి దిగుతారు. ఎంత లోతు తవ్వినా నీరు పడలేదు. ఏం చెయ్యాలి?

భారతీయ గ్రామీణ సమాజంలో బాగా నీరున్న నుయ్యి చాలా అవసరం గనుక ఊళ్ళో చాలా చర్చ జరిగింది. ఏదో స్వామి, అతీత శక్తి నీటికి అడ్డుపడుతోందని అందరూ అనుకున్నారు. ఆ స్వామిని సంతృప్తి పరచటానికి ఏదో ప్రయత్నం చెయ్యాలి. ఆ నూతి యజమాని, అతని కోడలు చలకమ్మ బలులు యివ్వాలని నిశ్చయమయింది. ఆమె మంచి బలంగా వయసులో ఉన్న యువతి, భర్త యింకా జీవించే ఉన్నాడు. కనుక ఆమెకి స్వాములతో సమానమైన శక్తి ఉంది.

వాళ్ళు బియ్యం, కుండలు, కుంకుమ, ధూపం, పుల్లలు తీసుకుని తవ్విన గొయ్యిలోకి దిగారు. నీరు పడాల్సిన చోట మూడు రాళ్ళు పెట్టి పసువు పూసి మీద ఎర్రబొట్టు పెట్టారు. అన్నం వండారు రాళ్ళ ముందు అన్నం రాశిపోసి అర్పించారు. ధూపం వెలిగించి నీటిని అడ్డుకుంటున్న దేవతగా భావించి ఆ రాళ్ళని పూజించారు.

పూజ చేస్తున్న యిద్దరు పైకి వచ్చారు. వారు సగం ఎక్కేసరికి చలకమ్మ వెనక్కి వెళ్ళింది. ఆమె వంటకు ఉపయోగించిన రాగి పాత్రను మరచిపోయింది. కిందకి దిగి, అడుగున నిలబడి పాత్రను తీయటానికి వంగింది. అంతే! నీరు ఆమెను కలుసుకోటానికి పెల్లుబికింది.

ఆమె మామ మధ్యలో నిలబడి 'తొందరగా పైకిరా' అని అరిచాడు. జవాబుగా స్పష్టాస్పష్టమైన శబ్దం వచ్చింది. తిరిగి పిలిచాడు. తిరిగి అదే శబ్దం వచ్చింది. తిరిగి పిలిచాడు. తిరిగి అదే శబ్దం. నీటి ఊటతో బాటు వచ్చింది. తన చేతులలో ఉన్నవన్నీ వదిలేసి చలకమ్మని రక్షించటానికి వెళ్ళాడు. దిగుతూ దిగుతూ తిరిగి ఆమెను పిలిచాడు. ఇప్పుడు జవాబు స్పష్టంగా వచ్చింది. "నన్నింక పిలవద్దు" ఆవిధంగా చలకమ్మ చనిపోయింది.

చాలామంది నుయ్యి మీద చుట్టూ నిలబడి అంతా చూశారు. విన్నారు. "తలచుకుంటే ఆమె పరిగెత్తుకుని వచ్చి తప్పించుకునేది" అనుకున్నారు.

నీటిమట్టం పెరుగుతోంది. గ్రామానికి కావలసిన నీరు నిండింది. చలకమ్మ గురించి అనుకున్నారు. '' ఆవిడ పుణ్యాత్మురాలు. లేకపోతే ఆమెని కలుసుకోటానికి జలం ఎగసిపడేది కాదు" ఉపకారం చేసే దేవతగా గ్రామానికి నీరు యిచ్చిన తల్లిగా అప్పటి నుంచి ఆమెకు పూజలు మొదలయ్యాయి.

చలకమ్మ వంటిదేవి ఊరందరిది. మాదిగలలో పేరంటాలు పేరుతో అదేవిధమైన పూజా వ్యవస్థ ఇంటింటా ఉంది. పేరంటాలు

అంటే "శుభమూ అదృష్టమూ యిచ్చే స్త్రీ". ఇతర కులాలు కూడా పేరంటాలుని పూజిస్తాయని చెప్పారు. నిజానికి శూద్రుల ఇంటి తలుపుల మీద పసుపు ఎరుపు చుక్కలు నేను చూశాను.

పవిత్రురాలు, స్వాముల పట్ల భక్తి శ్రద్ధలూ గల మాదిగ స్త్రీ భర్త బతికుండగా చనిపోతే ఆమె దేవతల దగ్గరకు సులువుగా వెళ్ళగలుగుతుందని, తన కుటుంబం కోసం వారిని వేడుకుంటుందని మాదిగలు నమ్మేవారు. మాదిగలలో వైధవ్యం అంటే కుల స్త్రీల వైధవ్య జీవితంలా దయనీయమైన హీన జీవితం కాదు. అయినా అదృష్టవంతురాలయిన స్త్రీ భర్త తన కోసం శోకిస్తుండగా ఈ ప్రపంచాన్ని విడిచిపెడుతుందని మాదిగలు భావించేవారు.

చనిపోయిన వారిని ఆహ్వానించేందుకు వీలుగా ఇంటిలో గోడమీద ఒక స్థలంలో పసుపుపూసి బొట్లు పెట్టి పూసల దండని ఆ మధ్యలో తగిలించేవారు. అది ఆ యింటి పూజాస్థలం అవుతుంది. దాని ముందు ప్రతిరోజు తలవంచి ముఖ్యంగా ప్రయాణాలకు బయల్దేరుతున్నా ఏదయినా కొత్త పని ఆరంభస్తున్నా మొక్కేవారు.

బహుశా పేరంటాలు ఒక ప్రాంతీయ నమ్మకం కావచ్చు. ఏ పుస్తకాలలోనూ దీని ప్రస్తావన లేదు. అయినా ఇది శాక్తేయం రూపాలలోనే ఉంటుంది. కుటుంబంలో బాగా గౌరవింపబడ్డ స్త్రీ ఆత్మకి తాంత్రిక స్వభావంతో కూడిన అపూర్వ శక్తులు ఆపాదించబడేవి. ఆమె ప్రకృతిలోని రహస్య శక్తులని నియంత్రించగలదనుకునేవారు. ఇది శిధిలమవుతున్న మాతృ పూజా రూపంగా ఇంటింటా ఉంది.

మాదిగలలో కనిపించే పేరంటాలూ, మరికొన్ని మాతృ పూజా రూపాలలో మరో అంశ ఉందని నేను అనుకుంటున్నాను.

పసుపు దానిమీద ఎర్ర చుక్కలు ప్రతిచోట పదేపదే కనబడుతుంటాయి. శుభదేవతల పూజలో, భూత ప్రేతాలను శాంతింపజేయటంలో, మాతంగి సంప్రదాయంలో ప్రతిచోటా పసుపు ఎరుపు చిహ్నాలు తప్పనిసరిగా కలిసి ఉంటాయి. అనేకసార్లు వేపచెట్టు కింద ఒక రాయి, దానిమీద ఆ చిహ్నాలు తరచుగా ఓ పూసల గొలుసు వేలాడడం నేను చూశాను.

ఇది నరబలికి సూచన కాదా? బ్రాహ్మణం, బౌద్ధం రెండూ నరబలిని వ్యతిరేకించినా దేవతా ప్రీత్యర్థం ఆదివాసీ తెగలలో ఈనాటి మన కాలం వరకూ మానవ రక్తం చిందించే గొప్ప పట్టు నిలబడే వుంది. ఆంగ్ల ప్రభుత్వం ఈ క్రూర మతకాండ అవశేషాలతో వ్యవహరించవలసే ఉంది.

హిందూవుల ఆచార వ్యవహారాలను శ్రద్ధగా పరిశీలించిన వారిలో ఒకరైన అబ్బె (Abbe Dubois) దుబాయిస్ గత శతాబ్దం చివరలో రాశాడు. "తమ చిన్నప్పుడు ఈ క్రూరమైన ఆచారం జరుగుతుండేదని వృద్ధులు చెప్పారు. ఇవి జరుగుతుండే అనేక స్థలాలను నేను దర్శించాను.'' యుద్ధాలలో బందీలయిన దురదృష్టవంతులను తమ రాజులు దేవతలకు బలులు యిచ్చిన స్థలాలను అక్కడి వాళ్ళు యాత్రికులకి చూపించని రాజ్యాలు భారతదేశంలో లేవని ఆయన అంటాడు. ఇది వందేళ్ళ క్రితం సంగతి.

కాళీ పురాణంలో శివుడు ఈ బలులకు నియమాలు విధిస్తాడు. ఒక నరబలితో తన భార్య వెయ్యి సంవత్సరాలు ప్రసన్నమవుతుందని ఆయన చెపుతాడు. ముగ్గురిని బలి ఇస్తే వంద వేల సంవత్సరాలు. పది గొప్ప శక్తులకు చెందిన కాళీ, దుర్గా ఇద్దరూ ఎల్లప్పుడూ రక్తదాహానికి ప్రసిద్ధులుగా చూపించబడతారు. పుర్రెలతో చేసిన దండ వారి మెడల్లో ఉండటం, నాలుక జూపి ఉండటం రక్తదాహాన్ని సూచిస్తాయి. అలాంటి పూజలు ఎంత దారుణం!

క్రీ.శే. 606 ప్రాంతాలలో బాణభట్టుడు మాతంగుల తెగ గురించి రాస్తాడు. "దుర్గకి మానవ మాంసాన్ని అర్పించే మతం వారిది. బలి యిచ్చేవారిని వదిలివేసే కాలం బహుశా ఉండి ఉంటుంది. వారికి బదులుగా ఒక రాయికి మానవ మాంసానికి గుర్తుగా పసుపు పూసేవారు. రక్తానికి బదులుగా ఎర్రటి చుక్కలు పెట్టేవారు. ఈ ప్రత్యామ్నాయంతో దాహార్తులైన దేవతలు మరీ ముఖ్యంగా మేకల రక్తం దానితో బాటు చేర్చితే శాంతిస్తారని ఆశపడేవారు.

# 5. రహస్య సమావేశాలు-అర్ధరాత్రి తాండవాలు

మాతంగి సంప్రదాయంలో గాని, శుభ దేవతల, భూతప్రేతాల పూజలలో గాని శాక్తేయ పూర్తిగా అసహ్యకరమైన రూపం ధరించలేదు. పూనకాల వెర్రి ఆవేశాలు, ఉన్మత్త నాట్యావేశాలు, జంతు బలులు, ప్రేక్షకుల అరుపులు తగినంత ఘోరమైనవే కావచ్చు. కాని మానవ ప్రవృత్తి మీద పూర్తి అసహ్యం కలిగించేవి కావు.

చర్మనిష్ట శాఖలో చీకటి మాటున జరగవలసిన సమావేశాలు ఉండేవి. రహస్యంగా జరిగే వాటి గురించి బయట ప్రపంచానికి చాలా అస్పష్టమైన సమాచారమే చేరుతుంది.

చర్మనిష్టశాఖలో సభ్యులు సంవత్సరానికి ఒకసారి ఒక సభ్యుని ఇంటిలో కలుస్తారు. వారు ఏ మతానికి సంప్రదాయానికైనా చెందవచ్చు గాని ఈ రహస్య సమావేశానికి తప్పనిసరిగా వస్తారు. తాతాత్కాలికంగా కులభేదాలు మతబేధాలూ తొలగిపోతాయి. చెప్పటానికి ఆశ్చర్యంగా ఉంటుంది కాని బ్రాహ్మణుడు, శూద్రుడు, మాదిగ ఆ రాత్రి అందరూ సమానులే. కాని అందరూ పూర్తిగా రహస్యంగా ఉంచి తీరాలి. తెల్లవారేసరికి ఎవరి కులం వారికి తిరిగి మొదలవుతుంది. ఆ అర్ధరాత్రి తాండవాలలో ఎవరెవరు ఉన్నదీ చెప్పటానికి ఎవ్వరూ సాహసించరు.

అర్ధరాత్రి అవుతుండగా సమావేశం జరుగుతున్న యింట్లోకి గురువు ప్రవేశిస్తాడు. ఒకరి తర్వాత ఒకరు అందరూ వస్తారు. అందరూ కూర్చున్నాక, సారాయి పాత్రతో అందరి దగ్గరికీ వెళతాడు ప్రతీ ఒక్కరూ కొంచెం కొంచెం తీసుకుంటారు. రెండో చేతిలో ఒక మాంసం ముక్క ఉంటుంది. దానితో అందరి నాలుకకీ ముట్టిస్తాడు. చివరగా రెంటినీ తాగి తింటాడు. అంతకుముందే వండిన తొమ్మిది రకాల మాంసాలు అందరికీ అందజేస్తారు. పక్షి, పావురం, పంది, మేక, ఆవు, గాడిద, పిల్లి,కుక్క గేదె మాంసాలవి. ఎండు ఆకుల వళ్ళాలలోపెట్టుకుని తింటారు. సారాయి ప్రవహిస్తుంటుంది.

తింటూ వాళ్ళు పాడతారు "మేం యిప్పుడు కులం కుటుంబం బంధాలు తెంచుకున్నాం. పాలక కులాలూ సేవకులూ ఒకరుగా కలిసిపోయాం. వేం మా గురువు చేత రక్షించబడాలని కోరుకుంటున్నాం. ఇదే సమయం."

మాంసపు ముక్క ప్రతి ఒక్కరి నాలుకలనీ తాకటంలో ఉద్దేశ్యం వారి మధ్య అన్ని సామాజిక భేధాలనీ తుడచి వేయటంగా కనిపిస్తుంది. ఆ రాత్రి కొంత గడిచాక ఒక స్త్రీని సాధారణంగా మాదిగ స్త్రీ అయియుంటుంది. తీసుకువస్తారు. ప్రకృతిలోని సృష్టి శక్తికి అసహ్యకరమైన రూపంగా సామూహిక కామ కలాపాలు సాగుతాయి. చిట్టచివరకు తరువాతి సమావేశానికి స్థలాన్ని ప్రకటించి రహస్యంగా తప్పుకుంటాడు గురువు. ఒకరి తర్వాత ఒకరు అందరూ దొంగచాటుగా వెళ్ళిపోతాడు.

కులపతులు దసులతులూ "పాలక కులాలూ, సేవకులూ" కలిసే ఈ కర్మకాండలోకి మాదిగలకి ప్రవేశం ఉన్నదన్న వాస్తవంకి తనదైన ప్రాముఖ్యత ఉంది. బహుశా బ్రాహ్మణులు ఆదివాసీల సంప్రదాయం రహస్యాలను తెలుసుకుని ఉంటారు. ఈ శాఖలోని సభ్యులు ఆ రాత్రి కార్యక్రమాలు కామవాంఛకు, వ్యసనాలకు అతీతమైనవి ఎందుకంటే మనసంతా పూజలో నిమగ్నమయి ఉంటుందని అంటారు. ఇది ప్రకృతి పూజ తాలూకు చీదర రూపం. ఆధునిక హైందవానికి ఇది భ్రష్టాంశం అని కూడా అనవచ్చు.

పుస్తకాలలో ఎక్కడా ఈ చర్మ నిష్టశాఖ ప్రస్తావన నాకు దొరకలేదు. బహుశా ఇది శక్తి పూజకి ప్రాంతీయనామం అయియుండొచ్చని నేను తేల్చుకున్నాను. తెలుగుదేశంలో కొన్ని భాగాలలో ఈ కర్మకాండని మొదట నేర్పించిన గురువు పేరు కూడా అయియుండచ్చు. శాక్తేయం సాధారణంగా పార్వతిని కేంద్రం చేసుకుంటుంది. కనుక ఇది శివపూజలలో ఒక పద్ధతిగా అనుకున్నాను. కాని ఆ విషయం గురించి తెలుసుననే వాళ్ళు ఇది రామానుజ శాఖలో భాగమని నొక్కి నొక్కి చెప్పారు.

కొంత వాస్తవమూ, కొంత వదంతీ కలిసిన ఒక వివరణ నాకు ఇచ్చారు. నాకు యీ సమాచారం తెలిపిన వారికి ఒకప్పుడు రామానుజుడనే గొప్ప గురువు అన్ని కులాల వారినీ, స్త్రీ పురుషులనీ శిష్యులుగా చేసుకున్నాడని తెలుసు. ఆయన సిద్ధాంత రహస్యాలను శిష్యులకి ఉపదేశించలేదు. కాని ఒక గ్రంథంలో రాసి వారి నుంచి దాచాడు. ఆయన చనిపోయినపుడు అతనివద్ద ఎవరూ లేరు. ఈ రహస్య సిద్ధాంతాల గ్రంథం బ్రాహ్మణుల చేతిలో పడింది. స్వభావ సహజంగా వాళ్ళు దానిని వాళ్ళకోసం ఉంచేసుకున్నారు. అతని ఇతర శిష్యులు కూడా గురువు బోధనలు తెలుసుకోవాలన్నారు. నాట్యకులానికి చెందిన యిద్దరు శిష్యురాళ్ళు, చదవటం రాయటం వచ్చిన వాళ్ళు, తప్పనిసరై వెతికి తలో పుస్తకం రాయాల్సి వచ్చింది. మరణశయ్య మీద ఉండగా రామానుజుడు చేసిన బోధనలు గ్రంధస్తం చేశామని వారు చెప్పుకున్నారు. అందులో ఒక పుస్తకం నుంచి రామానుజ శాఖ పుడితే రెండవ దాని నుంచి చర్మ నిష్ట శాఖ పుట్టింది.

వారి ఊహకి అందని దాన్ని సామాన్య జనం అర్ధం చేసుకునే పద్ధతిలో ఇది ఒక కుతూహలకరమైన ఘటన. 12వ శతాబ్దంలో జీవించిన రామానుజాచార్యుడు, తొలి వైష్ణవ సంస్కర్త, చనిపోయినపుడు బ్రాహ్మణులు ఆయన గ్రంథాలను స్వాధీనపరచుకోవడం సత్యమే అయిండొచ్చు. ఆ గ్రంథాలలోని చిత్తు (ఆత్మ), అచిత్తు, ఈశ్వరుడు అనే మూడు పదార్థాలకు సంబంధించిన నిగూఢ తర్కం సామాన్య జన బాహుళ్యం

అవసరాలను తృప్తిపరచగలిగేది కాదు.

అతని అనుచరులు ఆయన బోధనలను పాడు చేసారు. ఆ మతం ఉత్తర దక్షిణవాదాలుగా విడిపోయింది. ఆ రెండు వాదాల మధ్య సంఘర్షణ భయంకరమైనది. వాస్తవంగా ఇది ఆర్మీనియన్, కాల్వినిస్టిక్ సిద్ధాంతాల మధ్య వివాదానికి భారతీయ వేషం. తల్లిని అంటిపెట్టుకుని వేళ్ళాడే కోతి పిల్లలా ఈశ్వరుని ఆత్మ ఇచ్ఛాపూర్వకంగా అంటిపెట్టుకుని ఉంటుందని ఉత్తరవాదం ఉంటుంది. దక్షిణవాదానిది పిల్లి పట్టు సిద్ధాంతం. తల్లి పిల్లి ఒక దగ్గర నుంచి యింకో దగ్గరికి తీసుకుపోయే వరకూ పిల్లి పిల్ల కదలకుండా ఉండి పోయినట్టే ఈశ్వరుడు చర్య తీసుకునే వరకూ చిత్తు (ఆత్మ) నిస్సహాయంగా నిర్వ్యాపారంగా ఉంటుందని దక్షిణవాదం అంటుంది.

ఇచ్ఛకు సంబంధించిన ప్రశ్నే కాకుండా విష్ణువు అర్ధాంగికి యివ్వవలసిన స్థానానికి సంబంధించిన ప్రశ్న కూడా రామానుజ మతాన్ని విడదీసింది. భర్తలాగే భార్య కూడా అనంతమూ ఆద్యంతరహితమూ అంటుంది. ఉత్తరవాదం. విష్ణువు భార్య కేవలమూ మధ్యవర్తి అనీ; ముక్తి యివ్వటానికి విష్ణువుతో సమానం కాదనీ అంటుంది దక్షిణవాదం. నేను విన్న ఇద్దరు నాట్య స్త్రీలు రాసిన పుస్తకాల కథ రామానుజ మతంలోని విభజనను సూచిస్తుంది.

రామానుజుని అనుచరులలో శాక్తేయం తాలూకు గుహ్యరూపాన్ని అభ్యాసం చేసే శాఖకు స్థానం కల్పించటం చాలా అసంగతం. రామానుజునివి నీతి బోధలు. ఆయన మధ్య మాంసాలను నిషేధించాడు. బహుశా ఆయన క్రైస్తవ మిషనరీలను కలిసి ఉండవచ్చు. అందుకే ఆయన క్రైస్తవ నియమాన్ని సూచించే సకల మానవుల ధార్మిక ఏకత్వాన్ని గురించి నొక్కి నొక్కి చెప్పాడు. ఆయన ఏకైక దైవానికి వ్యక్తిగత అర్పణను ప్రభోదించాడు. ఆ దైవం విష్ణువు.

చర్మ నిష్టశాఖకి చెందిన రహస్య తాండవాలు రామానుజుని కాలానికి వేలాది సంవత్సరాల మరింత వెనకటివి. ఒక పురాతన సంప్రదాయానికి మరింత ఆధునిక స్థానం కల్పించటానికి అనాలోచితంగా చేసిన ప్రయత్నమే రామానుజ మతంలో ఈ సంప్రదాయానికి స్థానం యివ్వటం.

# 1. సత్యాన్వేషణ

పదిహేడేళ్ళ క్రితం నేను బంగారవు తాతయ్యను ఎరుగుదును. అప్పటికి అతనింకా వయసులో ఉన్నాడు. అందరూ గౌరవించేవారు. అతను బాగా ముసిలి వాడయాక నేను తిరిగి చూశాను. నిన్న జరిగినదేమిటో అతనికి గుర్తు ఉండేది కాదు. కాని, ఎప్పటివో పాత విషయాలను గురించి అడిగితే, దాదాపు చూపులేని అతని కళ్ళు దూరంలోకి చూస్తున్నట్లు కనిపిస్తుండగా అతను అనేక విషయాలు నాకు చెప్పాడు.

'నేను మన దొరను పిలిచాను ఆయన వచ్చాడు.' తర్వాత మౌనంలో మునిగిపోయాడు. నేను చుట్టూ ఉన్న మిషన్ ఇళ్ళను, పాఠశాల భవనాలను, రద్దీగా ఉన్న మిషన్ వాకిలినీ చూశాను. అనేక సంవత్సరాల క్రితం అతనిక్కడికి ఎలా వచ్చాడో నాకు గుర్తు వచ్చింది.అతని హృదయం లోపల్లోపల మండుతోంది. తెల్ల బోధకుడు వచ్చాడా లేదా అని చూడ్డానికి వచ్చాడు. అతనికి పిచ్చిగా పెరిగిన బ్రహ్మజెముడు కనిపించింది. ఈ వాకిలిలోనే ఓ మూలగా ఒక గుడిసెలో గుండ్ల పెంటయ్య నివశిస్తున్నాడు. ఆ భక్తుడు ఒంగోలు మిషనరీ యింకా నెల్లూరులోనే ఉందని త్వరలోనే వస్తుందని చెప్పాడు.

ఒంగోలు మిషనరీని ఈ ప్రదేశానికి తీసుకు వచ్చిన పరిస్థితుల గొలుసులో తాతయ్య అభ్యర్థన చివరి కొక్కెం. అతను యువకుల భుజాల మీద అనుకున్నప్పుడు యువతరం ముందు గర్వంగా చెపుతాడు. "మన దొరని నేను పిలిచాను. ఆయన వచ్చాడు."

"తాతయ్యా! పాత రోజుల గురించి చెప్పు" అన్నాను. అతను చుట్టూ అర్థం కానట్టు చూస్తే అక్కడున్న వారిలో ఓ యువకుడు అన్నాడు. "తాతా! దొర మొట్టమొదటిసారి వచ్చిన రోజుల గురించి దొరసాని అడుగుతోంది.

"దొర నన్ను బోధించమన్నాడు." అస్తమాను నేను ఒక్కడినే ఎలా వెళ్ళను? అని అడిగాను. 'నీ భార్యని నీతో తీసుకువెళ్ళు. మీరు ఇద్దరు అవుతారు" అన్నాడు. ఆ తర్వాత సత్యమ్మా నేనూ యిద్దరం కలిసి వెళ్ళేవాళ్ళం. ఒక్కోమారు ఆమె మూటను మోస్తే ఒక్కోమారు నేను మోసేవాడిని. నేను బోధించేదే ఆమె బోధించేది. నేను తిన్నదే తినేది. సత్యమ్మ నాతో ఎప్పుడూ ఉండేది."

"పాత రోజుల్లో నీ మీద ద్వేషం చూపించలేదా?"

తాతయ్య మొహం వయసుతో స్తబ్దమైపోయినా జీవంతో వెలిగింది. "నన్నెవరూ నిందించలేదు. మతద్వేషం చూపలేదు. నన్నెప్పుడూ దయగా గౌరవంగా చూసేవారు. అని భరోసాగా అన్నాడు.

"నువ్వు రాజయోగి గురువులతో చాలాకాలం ఉన్నావని అంటారు. వాళ్ళనించి ఏమైనా నేర్చుకున్నావా?

"వాళ్ళ నుంచి ఏమి తెలుసుకున్నానా? భగవంతుడు ఒక్కడే. ఆయనే అన్నిటినీ సృష్టించాడు. అన్నిటినీ నడుపుతున్నాడు. ఇదే వాళ్ళు నాకు చెప్పినది. నేను అది నమ్మాను. కాని జీసస్ క్రీస్తు గురించి వినేదాకా నా ఆత్మకి తృప్తి కలగలేదు."

ఎలాంటి సంకోచమూ లేకుండా అతని జీవితంలోని ఒకానొక వాస్తవాన్ని తాతయ్య నాతో అలా చెప్పాడు.

అది అతని జీవిత సత్యాలలో ఒకటి అన్నంత గట్టిగా చెప్పాడు. ఆలోచించటానికి కూడా వీల్లేనంత పెద్ద వయసు ఆయనది. తాతయ్య సత్యాన్వేషణ సారాంశం నాకు ఆ విధంగా లభించింది. రాజయోగంలో ఆయనకు బంగారం దొరికితే క్రీస్తు సువార్తలో ఆయనకు అమూల్యమైన వజ్రం దొరికింది.

మిషనరీ వారు అడిగినపుడు కొన్నేళ్ళక్రితం తాతయ్య తన జీవితం గురించి వివరించాడు. కొన్ని నిర్ణయాత్మక సందర్భాలలో తాతయ్య ప్రసక్తి లేకుండా పాతరోజులు గురించి చెప్పలేమని అనేకమంది ఆయన చెప్పినదాన్ని సమర్థించారు. ఆయనది స్వచ్ఛమైన పవిత్రమైన జీవితమని ఆయన ప్రజలు నమ్ముతారు.

తల్లిదండ్రులకు వయసు ముదిరాక ఆయన పుట్టాడు. వారిని చూడవలసిన బాధ్యత ఆయనమీద పడింది. చదువు నేర్చుకోగలనని ఆయన ఎన్నడూ అనుకోలేదు. ఆ రోజులలో మాదిగ కుర్రవాడికి చదువు చెప్పేవారు ఎవరూ లేరు. తోలును పదును చెయ్యటం, శూద్రులకు చెప్పులు కుట్టడం తండ్రి నుంచి నేర్చుకున్నాడు.

అతని తాతగారి కాలంలో రామానుజ మతానికి చెందిన గురువుని ఆహ్వానించి విష్ణువు విగ్రహాలను తెప్పించి పూజలను జరిపించుకుంది ఆ కుటుంబం. ప్రత్యేక సందర్భాలలో పూజలు చేయించుకునేవారు. ఉన్న కొద్దిపాటి సంపాదన నుంచే పూజారి అడిగిన దక్షిణ చెల్లించేవారు. తండ్రి చనిపోయినపుడు రామానుజ మత గురువు చెప్పిన ప్రకారం చావు తంతులు జరిపించి తాతయ్య తృప్తిపడ్డాడు. సామాన్య మాదిగల ఆచారాలకు సంప్రదాయాలకు యిది సామాజికంగా మతపరంగానూ ముందడుగుగా భావించబడింది.

రామానుజ మతంలో చేరటం వల్ల తమకు ఆధ్యాత్మిక సత్యం లభించిందని తాతయ్యగాని మరో మాదిగ గానీ ఏనాడూ చెప్పలేదు. ఆ మత సిద్ధాంతాల గురించి మాదిగలకు ఏమీ తెలియదు. విష్ణువు అనేక అవతారాలలో అంతరార్థం వారు చూడనేలేదు. వారు చేరిన మతంకి సంబంధించిన సిద్ధాంతాలపట్ల ఎలాంటి అవగాహనా లేకపోవటం ఆదివాసుల మధ్య ఆర్యుల సంప్రదాయాలకు తగిన స్థానం లభించకపోవటాన్ని సూచిస్తుంది. రాజయోగి మతంలో శివపూజ దీనికి భిన్నమైనది. తాతయ్య జీవితం మీద ఈ దిశ నుంచే గొప్ప ప్రభావం పడింది.

వయసు చేత నడుం వంగిన ఒక ముదుసలి తన కూతురిని

చూడటానికి ఇరుగుపొరుగు ఇంటికి వచ్చింది. బండికట్ల వీరమ్మ అనే ఈ వృద్ధురాలు పోతులూరి వీరబ్రహ్మయోగి శిష్యురాలు. ఆమె దైవభక్తిపరురాలు. గొప్ప వ్యక్తి అయుంటుంది. తాతయ్యా మరికొందరూ ఆమె పాదాల చుట్టూ చేరారు. ఆమె గురించి తెలుసుకున్నారు.

యోగి వీరబ్రహ్మం భారతదేశంలో పుట్టి కొన్ని తరాలను ప్రభావితం చేసి మరుగునపడ్డ సంస్కర్తలలో ఒకరు. వేలాదిమందిని ఆయన ఒక ఆశతో ప్రభావితం చేశాడు. ఈ ఆశకీ క్రైస్తవ హృదయాలలోని వేయి సంవత్సరాల ఆశకి పోలికలు ఉన్నాయి. క్రైస్తవుడు క్రీస్తు పునరాగమనం కోసం ఎదురు చూస్తుంటాడు. యోగి వీరబ్రహ్మం భగవంతుడు ఒక శక్తి అంటాడు. ఆవిధంగానే పూజించాలి అంటాడు. చిత్తశుద్ధి లేని దానిని ఆయన నిరాకరించాడు. రామరామ అనేవాళ్ళు పతనమవుతారు. ఎందుకంటే అది కేవలం నోటిమాట. అందులో చిత్తశుద్ధి లేదు. అని ప్రభోదించాడు. ఆయన బోధనలను ఆయన శిష్యులు ఒక పుస్తకంలో భద్రపరిచారు. అందులో–అజ్ఞానం నుంచి బయటపడి వెలవబోయే అవతారం కోసం ఎదురు చూడమని ప్రజలకు పిలుపునిచ్చాడు. ఒక దేముని వునరాగమనం జరగబోతోందన్న భావన ఆయన బోధనలలో కేంద్రబిందువు. ఆయన అనుచరుల హృదయాలలో ఈ ఆశతో ఆయన ఎంతగా నింపాడంటే అది త్వరలోనే జరగబోతోందని వారు ఎదురుచూశారు.

వీరబ్రహ్మం వ్యక్తిగత చరిత్ర ఇంచుమించు ఒక గాథలా ఉంటుంది. ఆయన తండ్రి శివభక్తుడు. వయసులో ఉన్నప్పుడు వీరబ్రహ్మంకు చేలో ఒక వెలుగు కనిపించింది. అది ఓ గుడి దగ్గరకు తీసుకువెళ్ళింది. అప్పటి నుంచి అతను అక్కడ తరచుగా దేమునితో మాట్లాడేవాడు. ఆయన వచ్చిన పని పూర్తయ్యాక సమాధిలో సజీవంగా ప్రవేశించి తలుపులు మూసేయమని ఆజ్ఞాపించాడు. అతని నాలుక మీద ఆ యోగి మాటలు ఒక అదృశ్య హస్తం రాసింది. సిద్దప్ప బయలుదేరాడు. కుల వ్యతిరేకంగా బోధించసాగాడు. తన స్వామి ఆదేశం ప్రకారం దేవుడు తిరిగి అవతారమెత్తుతాడని కులం నశించిపోతుందని మనుషులంతా ఒకటవుతారని ప్రచారం చేశాడు.

బండికట్ల వీరమ్మ నుంచి ఈ బోధనలు తాతయ్య స్వీకరించాడు. ఆమె జీవితం ఆవిడ జ్ఞానానికి దృష్టాంతం. ఆమెది కంసాలి కులం. మాదిగలకన్న పెద్ద కులం. అయినా ఆమె ఇంటికి మాదిగలతో సహా అన్ని కులాల వాళ్ళూ వస్తూ పోతుండేవారు.

వీరమ్మ ఆమె కూతురూ నివశిస్తున్న యింటి యజమానురాలు వీళ్ళ పద్ధతులకి అభ్యంతరం చెప్పటం ఆరంభించింది. "వీళ్ళంతా వస్తున్నారు పోతున్నారు. వాళ్ళ మా వంట పాత్రలను ముట్టుకోవచ్చు. మా కులం పాడయిపోతుంది. మీరు ఇంకో యిల్లు చూసుకోండి" అని చెప్పింది. తన తక్కువ కులపు శిష్యులను రావద్దని చెప్పకుండా వీరమ్మ మరో యిల్లు చూసుకొంది. ఆమె మనసు దొడ్డది. అందరినీ ప్రేమించేది.

ఆమె బయటకు వచ్చేశాక అందరికీ నచ్చజెప్పింది. "మీ అందరూ ఒక గురువు శిష్యులు. కనుక ఒక తల్లి బిడ్డల్లా ఉండాలి. విశ్వసించండి. పాపం చెయ్యకండి. ముక్తి సాధనకు పట్టుదలగా నిలబడండి."

బంటికట్ల వీరమ్మ నుంచి తాతమ్మ రాజయోగి గురువుగా ఉపదేశం పొందాడు. రోజూ ఒక గంటసేపు ముక్కు చెవులూ పట్టుకుని కళ్ళు మూసుకుని ధ్యానం చేసేవాడు. ఇంద్రియజ్ఞానం నశించి ఆత్మకి సర్వాంతర్యామియైన భగవంతుని సాక్ష్యాత్కారంకోసం లభిస్తుందని అలా చేసేవాడు. అతని మత నిష్ట వల్ల రాజయోగి భక్తులలో పెద్దగా పరిగణించబడేవారు. తాతయ్య నివసించే కనిగిరి తాలూకాలో నేల గట్టిగా ఎండిపోయి ఉండేది. చేలలో నూతులు తవ్వి పంటలకి నీళ్ళు పెట్టే వారు. శూద్రులు పెద్ద తోలు బాల్చీలతో నీళ్ళు పైకి తోడేవారు. వీటిని తయారు చెయ్యటం మరామ్మత్తు చెయ్యటం మాదిగల పని. గోదావరి జిల్లాలో ఏదో విషవురుగు కాటు వల్ల పశువు మరణిస్తున్నాయని చర్మం చవకగా దొరుకుతోందని తాతయ్య విన్నారు. తన కులస్తులతో కలిసి ఉత్తరానికి వర్తకం కోసం వెళ్లాలని నిశ్చయించుకున్నాడు.

ఉత్తరాది జిల్లాల్లో ఉండగా తాతయ్య క్రీస్తు గురించి మొదటిసారి విన్నాడు. ఒక తోటి వ్యాపారస్తుడు మాదిగ కులస్తుడు ఈ కొత్త మతాన్ని ఒక దొర బోధన, చేస్తున్నాడని చెప్పాడు. వాళ్ళు వెళ్ళి అతన్ని చూడాలనుకొన్నారు. అక్కడ వాళ్ళని ఆదరంగా ఆహ్వానించారు. మళ్ళీ తిరిగివెళ్ళారు. " ఈమతం నిజమైనది. నా ఆత్మ కుదుటపడింది." అన్నాడు తాతయ్య. "నువ్వు నీ యింటికి వెళ్ళు. అప్పుడప్పుడు కనుక్కొంటూండు. తొందరలోనే ఓ తెల్లబోధకుడు ఒంగోలుకి వస్తాడు. ఈ మతం గురించి మరింత చెవుతాడు" అన్నాడు ఫాదర్.

ఇంటికి తిరిగి వెల్తున్నప్పుడు పాత జీవితానికి స్వస్తి చెప్పి కొత్త జీవితం ఆరంభించాలనుకున్నాడు. తాతయ్య గ్రామదేవతల విగ్రహాల ముందు మోకరిల్లటం మానేసాడు. రాజయోగి ప్రజలతో నేను మీలో ఒకడిని కాదన్నాడు. వాళ్ళు యిస్తున్న దానికన్న చాలామంచిది తనకు దొరికిందనన్నాడు. నువ్వు ఏ స్వామిని పూజించబోతున్నావని అడిగితే జీసస్ క్రీస్తు అని చెప్పాడు. ఆయన దేవుని కుమారుడు. ప్రజల కోసం మరణించాడు. అని చెప్పాడు. ' ఒక దొర నాకు బోధించాడు. మరొక దొర త్వరలోనే వచ్చి మరింత వివరంగా బోధిస్తాడు. అని చెప్పాడు.

తాతయ్య వంటి పెద్ద మనిషి అంత నిస్సంకోచంగా చెప్పటాన్ని సులువుగా తీసిపారెయ్యలేకపోయారు. గ్రామదేవతలలో భూతాలలో భయపడే కొందరు మాదిగలు తాతయ్య మాటలతో అవన్నీ కోపగించి వాళ్ళందరినీ నాశనం చేస్తాయని అనుకున్నారు. శూద్రులు కూడా అతని నిర్ణయానికి సంతోషించలేదు. స్నేహితులు

వాదించారు.

"నువ్వు ఈ దేశానికి చెందని ఒక దేవుడిని నమ్ముతున్నావు. ఒక కొత్త దేవుడు. మన మధ్యకు కొత్త జీవిత పద్ధతులని తీసుకువస్తున్నావు. పోలేరమ్మనూ, అంకాలమ్మనూ నువ్వు పూజించటానికి రావటంలేదు.ఉంటున్నావు. నీవల్ల ఆ దేవతలు మా మీద కోపగించి శపిస్తారని నీకు తెలియదా?"

తాతయ్య నిందించదగినవాడు కాదు. అతన్ని అవమానించటానికి, అగౌరవించటానికి ఎవరూ సాహసించరు. అందరూ తనకి దూరంగా వెళ్ళిపోతుంటే ఒంటరి వాడయిపోతున్నట్లు అనిపించి అన్నింటికన్నా ఎక్కువ బాధ కలిగింది. అంతకుముందు ధార్మిక గురువుగా భావించినవారు తప్పుకున్నారు. శూద్రులు యిస్తానన్న పని యివ్వటం మానేసారు. అతనికి కూలి దొరకటం లేదు.

భార్య సత్యమ్మ కూడా వదిలెయ్యటం అతనికి అగ్నిపరీక్ష అయింది. ఆమె అతనికి తోడుగా నిలవలేదు. జీసస్ క్రీస్తు మతానికి తాతయ్య తన మనసును తెరిచినపుడు ఆమె అతనితో లేదు. అందువల్ల ఆమెను పూర్తిగా నిందించనవసరం లేదు. తిరిగి వస్తూనే అంతా చెప్పాడు. అయినా ఆమె అతనిని వ్యతిరేకించింది. అతనిలో మార్పు వాళ్ళిద్దరి మధ్యా గోడలా అయిపోయింది. తన భర్త దూరమై పోతున్నాడని అనుకొంది. బంధువులు స్నేహితులూ తాతయ్యకు ఆమె మీద ప్రేమ గనుక అతన్ని ఆమె రక్షించాలి. అతన్ని గట్టిగా వ్యతిరేకించాలి. అని చెప్పారు. ఆమె వారి మాటలను విన్నది.

అంతకుముందు అతని అవసరాలన్నీ చూసేది. ఇప్పుడు మానేసింది. ఒక్కోమారు తిండి ఆలశ్యమయేది. రుచిగా ఉండేదికాదు. ఒక్కోమారు వస్తువులు ఉండాల్సి వచ్చేది. తాగుదామంటే నీళ్ళుండేవి కావు. అతను బ్రతిమలాడినకొద్దీ ఆమె నిరాకరించేది. చిట్టచివరకు తాతయ్య చెప్పాడు. నన్నీ రకంగా అన్ని కష్టాల్లోకి తీసి నన్ను యిక్కడ ఉంచలేవు. నేను క్రైస్తవులలో కలిసిపోతాను. వాళ్లతోనే తింటాను. వారి మధ్య తగువు చల్లారింది. ఆ తర్వాత ఆ విషయం గురించి తాతయ్య తేలికగా చెప్పాడు. "దేముడు కరుణతో ఆమె మనసు మార్చాడు."

అంత కష్టాలలోనూ ఒంగోలుకి మిషనరీ వస్తుందన్న విషయం తాతయ్య మరిచిపోలేదు. నిజంగా వచ్చేసారా! సత్యమ్మ అతనితో వెళ్ళి చూడటానికి ఒప్పుకుంది.

నెల్లూరి మిషనరీది అని అందరూ అనుకునే వాకిలిలో తాతయ్య అలిసిపోయి పుళ్ళుపడిన కాళ్ళతో అడుగుపెట్టాడు. మధ్యలో ఒక చిన్న బంగ్లా ఉంది. కాని ఏ తెల్ల బోధకుడూ లేడు. ఏదో కావాల్సిన వాడిలా తాతయ్య ఆ వాకిలి అంతా కలియదిరిగాడు. గుండ్ల పెంటయ్య అతన్ని చూశాడు. గుడిసెలోంచి బయటకు వచ్చాడు. "ఎందుకు వచ్చావు"? అని అడిగాడు.

"ఒక తెల్ల బోధకుడిని వెదుక్కుంటూ వచ్చాను. ఆయన యిక్కడ లేడా?" అడిగాడు తాతయ్య.

నెల్లూరి క్రైస్తవుడు పెంటయ్యని ఈ వాకిలికి కాపలా కాస్తూ మిషనరీ రాకకోసం చూస్తుండమని పంపారు. తన గుడిసెలోకి తీసుకెళ్ళాడు. మాట్లాడుకున్నారు. పెంటయ్యకి పరిస్థితి అర్ధమయ్యింది. తాతయ్య మీద సానుభూతి కలిగింది. నెల్లూరి మిషన్ హౌస్‌లో ఈ వార్త తెలిస్తే ఎంత సంతోషిస్తారో పెంటయ్యకు తెలుసు. అనేక ప్రార్ధనలు జరిగిన ఒంగోలులోని ఆ ప్రదేశంలో ధర్మం మీద ఆకలి దప్పులతో ఒక వ్యక్తి ఎదురు చూస్తున్నాడన్నదే వార్త.

పెంటయ్యకు చెయ్యాల్సినది తెలుసు. "కొండ పక్కనే ఉన్న యింటిలోకి వెళదాం రా! అక్కడ అమ్మగారు నెల్లూరు మిషనరీకి స్నేహితురాలు. ఏం చెయ్యాలో ఆమెకు తెలుసు'' అని తీసుకువెళ్ళాడు. వినయంగా నమస్కరించారు. మధ్యవర్తిగా పెంటయ్య అన్నాడు. ''అమ్మా! ఇతను తాతయ్య. పనిమీద ఉత్తరాదికి వెళ్ళినప్పుడు ఒక మిషనరీని చూశాడు. ఒంగోలుకి ఒక తెల్ల బోధకుడు వస్తాడని ఆయన చెప్పాడు. ఇతనికి క్రీస్తు మీద విశ్వాసం కలిగింది. ఇతను బోధకుడిని చూడటానికి వచ్చాడు. అతనిక్కడ లేకపోవటంతో బాధపడుతున్నాడు. ఎందుకు ఆలస్యమయిందో తెలుసుకోవాలనుకుంటున్నాడు. ఆ విషయం అడగటానికి మేము వచ్చాం."

ఆమెకి అర్ధమయ్యింది. "నేను మిషనరీకి రాస్తాను. నీ కోసం కబురంపుతాను. ఎప్పుడయినా రావటానికి తయారుగా ఉండు" అని తాతయ్యతో చెప్పింది.

కొద్దిరోజులకే ఒక కూలీ తాతయ్య ఊరికి వచ్చాడు. మిషనరీ వచ్చిందని ఒంగోలు రమ్మని చెప్పాడు. కావల్సిన విశ్రాంతి కూడా తీసుకోకుండా ఏభై మైళ్ళు నడచి భార్య సత్యమ్మతో కలిసి దారిపట్టాడు. నెల్లూరు మిషనరీ అతనితో బాటు ఒంగోలు మిషనరీ కాబోతున్న యువకుడు కనిపించారు. తాతయ్య వాళ్ళు కనిపించినప్పుడు కలిగిన ఆనందం మాటలకి అందనిది అన్నాడు. కొన్నేళ్ళ క్రితం ఒంగోలు బజారులో ఆ యిద్దరిలోనూ పెద్దతని మీద రాళ్ళు వేశారు. అయితే ఇప్పుడు అతని సందేశాన్ని నిరాకరించిన ఇదే స్థలంలో అతని ముందొక మనిషి ఉన్నాడు. అతనా సందేశాన్ని తృప్తిగా వినలేదు. ఒకరి ముఖంలో ఒక పవిత్రానందం. రెండవవారి ముఖంలో యింకా తెలుసుకోవాలన్న ఆకాంక్ష గంటలకొద్దీ కూర్చుని దాహం తీర్చుకోసాగాడు.

స్వంత సమాజం చేత వెలివేయబడ్డ తాతయ్య అతని భార్య ఒంగోలు చేరారు. భారతదేశాన్ని పరిపాలిస్తున్న జాతి యొక్క మతంలోకి తీసుకోబడ్డారు. ఆ తర్వాత ఇంటికి తిరిగి వచ్చారు. జరిగిందేమిటో వారికి పూర్తిగా తెలియదు. ఈ భూమికి లవణం వంటి జనాలలో వారు ఒకరయ్యారన్నది వాస్తవం. వారింక ఒంటరి వారు కారని మాత్రమే వారికి తెలుసు. భుజాల మీద కరపత్రాలతో, పుస్తకాలతో, చెవులతో తెల్ల బోధకుల ఆశీర్వచనాల వాక్యాలు మోగుతుండగా, ముఖాల మీద ఒక కొత్త ప్రకాశంతో వాళ్ళ ఊరికి

తిరిగివచ్చారు.

ఆతర్వాత అంతంలేని కార్యక్రమం మొదలయింది. అదే లెక్కలేనన్ని ఫలాలు కాసింది. అలసట లేని భక్తితో, నిమగ్నతతలో తాతయ్య ఊరూరా తిరిగాడు. భార్య సత్యమ్మ ఎప్పుడూ అతనితో ఉండేది. ఆడవాళ్ళు సత్యమ్మను యిష్టపడేవారు. చుట్టూ చేరేవారు. అలసిపోయావా. దాహమేస్తుందా అని అడిగేవారు. తీసుకెళ్ళి విశ్రాంతి యిచ్చేవారు. తర్వాత జీవితంలో ఆమెకి కొద్దిగా మతి భ్రమించింది. సహాయం లేకుండాపోయింది. ఇరవై ఏళ్ళుగా భర్తని అనుసరించి ఆమె కనబరచిన విశ్వాసాన్ని ఆమెపట్ల అసహాయ స్థితిలో తాతయ్య అంత ప్రేమతోనూ చూసుకుని చూపించాడని మాదిగలు గొప్పగా చెప్పుకునేవారు. ఆమెకి మతిస్థిమితం లేనప్పుడు చెయ్యి పట్టుకుని తీసుకువెళ్ళి కూర్చోబెట్టి తినిపించేవాడు.

మిషన్ తొలి దినాలలో తాతయ్య రాతిస్తంభంలా నిలబడ్డాడు. మాదిగ సమాజం పాత విశ్వాసాలు సడలిపోయి కొత్తవాటిని స్వీకరించే సమయంలో అతను నాయకుడు. ఒక అనుభవజ్ఞునిలా, ఒక పెద్దగా తనకున్న కొద్దిపాటి స్థలంలోనే అతని అభిప్రాయాలని లక్ష్యపెట్టే వారిమధ్య అవుననిపించుకున్నాడు. అతని ధైర్యస్వభావం, ఆచితూచి నడిచే నడత, ఒక విధమైన స్వాభావికమైన హుందాతనం పసివానికుండే వినయంతో కలిసి అతను మాట్లాడిన వారందరివద్దా మన్ననలు పొందాడు.

ఇతరులలాగ అతను రాజయోగి భావనలను తన బోధనల్లో విమర్శించలేదు. శాస్త్రుల్లు చెప్పే విచిత్రమైన అల్లికతో తన ఉపన్యాసాలను ఆరంభించటానికి ఇష్టపడే వాడు– “అక్షరమాలకి ఎటుచూసినా అయిదు వరసలు. అలాగే శరీరం అయిదు పదార్థాలతో తయారయింది. మరో అయిదున్నాయి. రెండు వినటానికి, రెండు చూడటానికి ఒకటి మాట్లాడటానికి. అంతేకాదు ఇంకో అయిదున్నాయి. క్రీస్తు అయిదు గేయాలు” అప్పటికే వినేవాళ్ళకి కుతుహలం పెరిగేది. ఈ రకంగా ఆరంభించటం హిందూ హృదయానికి నప్పుతుంది. ఆ తర్వాత రోజులలో ధియోలాజికల్ సెమినరీలో శిక్షణ పొందిన వారు మిషనరీలోకి వచ్చాక విమర్శలు వచ్చాయి. తాతయ్యను దోవలో పెట్టాలన్నారు. వేదాంతానికి, ధార్మికత్వానికి మధ్యనున్న పాత వివాదం తాలూకూ అంశ యిందులో ఉంది. కాని తాతయ్య తన పద్ధతిలోనే ఉండిపోయాడు. అతని బోధనల ద్వారా వందలాది మందికి క్రీస్తు మీద గురి కుదిరింది. ఆధ్యాత్మిక విషయాల మీద గొప్ప పరిజ్ఞానంతో ఉండే ఆయన మాటలకూ ఆయన దృష్టాంతాలకు ఒక శక్తి ఉండేది.

ముసలితనంలో తాతయ్య ఒంగోలుకి మరోమారు వచ్చాడు. ఆదివారం ఉదయం ప్రార్థనా సమావేశంలో అతను సాధారణంగా కూర్చునే చోటుకి నెమ్మదిగా తీసుకువచ్చారు. మిషనరీ తన దైవోపన్యాసాన్ని మధ్యలో ఆపుచేశాడు. అతన్ని తన కుర్చీలో కూర్చొబెట్టాడు. పాత రోజుల గురించి, ఆనాటి నాయకుల గురించి బొత్తిగా తెలియని యువతరంలో కొందరి ముఖాలమీద ఆశ్చర్యాన్ని మిషనరీ చూశాడు. భగవంతుడు యిచ్చిన లక్ష్యానికి ఒక అంగుళం కూడా పక్కకి జరగనివాడూ సంక్షోభాలలో అనంతమైన బాధ్యతలలో చిన్ని చిన్ని ఆరంభ సమయాలలో ఎల్లప్పుడూ తన పక్కనే నిలబడ్డ ఆ వృద్ధుని వంక చూస్తున్న మిషనరీ హృదయం ఆర్ద్రమయింది.

తనముందున్న వందలాదిమంది శ్రోతలవైపు తిరిగాడు. “ ఈ మనిషెవరో తెలుసుకోవాలనుకుంటున్నారా? చెప్తాను. మీరు స్వర్గానికి వెళ్ళినప్పుడు మీరంతా అక్కడికి వెళ్తారని నేను నమ్ముతున్నా. మీకు దూరంగా పైన తేజస్సుతో ప్రకాశిస్తుండే ఒకతను కనిపిస్తాడు. అతన్ని బాగా చూడాలంటే మీకు ఒక టెలిస్కోప్ కావాలి. ఎందుకంటే మీకూ అతనికి మధ్య దూరం అంత ఎక్కువ. “ఎవరా ప్రకాశవంతమైన దుస్తులతో ఉన్న మనిషి” అని మీరు అడుగుతారు. “ ఆయన తెలుగుదేశపు బంగారపు తాతయ్య” అని చెబుతారు. అతన్ని చూడటానికి మీ కళ్ళు మిరుమిట్లు గొలుపుతాయి.”

మిషనరీ తన ప్రార్థనా సమావేశాన్ని కొనసాగిస్తున్నపుడు అందరి ముహాలలోనూ తాతయ్యపట్ల ఒక గౌరవం ఉంది. ఓ ఏడాది తర్వాత తాతయ్య ఆత్మ ఎగిరిపోయింది.

# 2. ఆరుగురు గురువుల వరస

పాశ్చాత్య నాగరికత భాషలో పుల్లికూరి లక్ష్మయ్యని ' ఎ ఫాస్ట్ యంగ్‌మాన్' అని ఉండేవారు. చెవిపోగులు, కంకణాలు, నడుముకు పట్టీలతో వాటి విలువ కన్న మెరుగులతో అందరినీ ఆకట్టుకునే వాటితో, అలంకరించుకునేవాడు. ఎర్ర తలపాగ,తెల్లటి అంగీలు పెట్లో వాడకానికి సిద్ధంగా ఉండేవి. ఎక్కడ ఆట, పాట పండగ ఉన్నా అక్కడకి తిరుగుతుండేవాడు. పాపమూ కామమూ పెరిగిపోయాయి. అతని ఆత్మలో ఈ మొత్తం పరిస్థితి మీద విరక్తి కలిగేవరకూ అవి కొనసాగేయి. వీటితో విసుగెత్తిపోయాడు. ఎప్పుడు వచ్చిందో ఒక ఆలోచన ఒక రోజు అతనికి కలిగింది. నేను చనిపోతే?

ఆ సమయంలో యోగి వీరబ్రహ్మం సంచార శిష్యులలో ఒకరు ఆ ఊరికి వచ్చాడు. లక్ష్మయ్య దృష్టి అతని మీదపడింది. అతని సంపాదన అంతా ఆ గురువుకి దక్షిణలు దానాలు యివ్వటంతో ఖర్చుపెట్టాడు. అతనికి ముక్తిమార్గాన్ని చూపించేది ఏదైనా కనుక్కోవాలనిపించింది. మరణానంతరం ఆత్మకి ఆనందమిచ్చే స్థితిని కోరుకున్నాడు. రోజులు గడిచాయి. అతనికి నిశ్చయమైనదేదీ కనబడలేదు. ఓ రోజు పొద్దుటే గురువు తన శిష్య బృందంతో మరోచోటకి వెళ్ళిపోయాడు. కొన్నాళ్ళకి యింకొకరు వచ్చారు. లక్ష్మయ్య అతని చుట్టూ తిరిగాడు. గురువుకి తినబెట్టడంలో తనవంతు తను యిచ్చాడు. యిద్దరూ కలిసి తాగారు. దొర్లారు. కొన్ని నెలల తర్వాత అతనూ తన దోవన వెళ్ళిపోయాడు. తన జ్ఞానం ఏ మాత్రమూ పెరగలేదని లక్ష్మయ్యకి తెలిసింది.

ఆ విధంగా ఆరుగురు గురువులని లక్ష్మయ్య కొందరిని వారాలు, కొందరిని నెలలూ పోషించాడు. మాదిగ సమాజంలో వదంతులు వ్యాపించాయి. శుభ్రమైన బట్టలు, అలంకారాల మీద ఆసక్తి పోయి రాజయోగి గురువుల పాదాల ముందు కూర్చుంటున్నాడని చెప్పుకోసాగారు. ఈ పరిస్థితిని వాడుకోటానికి చుట్టాలమని చెప్పుకుంటూ ఒకరితర్వాత ఒకరు రాసాగారు. అతను దీక్ష తీసుకున్నప్పుడు నేర్చుకున్న మంత్రాలు, శ్లోకాలు గురించి అడుగుతూ అతనికి అతిథులయారు. అప్పటికి ఉన్న గురువుకి పరిచయం చేయటం, వాళ్ళు అవీయివీ అడగటం తెలుసుకోవటం, అందరిలోనూ ఆసక్తి పెరగటం జరిగాయి. కొందరు స్నేహితులు మాటిమాటికి వచ్చేవారు. బంగారపు తాతయ్య కూడా ఒక్కోసారి వాళ్ళ మధ్య ఉండేవాడు. ముఖ్యంగా బండికట్ల వీరమ్మ వెళ్ళిపోయాక వీళ్ళదగ్గరకి వచ్చేవారు. వారందరి మధ్య ఓ సంఘీభావం ఏర్పడి కొన్నేళ్ళు నిలబడింది. ఈ బృందంలోని దాదాపు ప్రతి సభ్యుడూ తరువాత సంవత్సరాలలో క్రైస్తవ ప్రచారంలో బలమైన శక్తులుగా మారారు.

ఏదైనా చిత్తశుద్ధి గల సత్యాన్వేషణ వృథా అవదు. సామాన్య మాదిగల మూఢనమ్మకాల నుంచి లక్ష్మయ్య అతని స్నేహితులూ పైకి ఎదిగారు. అంతకన్నా మెరుగైనదానిని ఆశించారు. అంటే చిన్నతనపు విశ్వాసాల నుంచి బయటపడ్డారు. ఆత్మకి కలిగే ఆకలిని తృప్తిపరుచుకోటానికి ప్రతీ ఒక్కడూ యోగి చెప్పినవన్నీ ప్రయత్నించాడు. ఎవరెవరు ఏం సాధించారో తెలుసుకోటానికి వారి మధ్య స్నేహమూ, ఏకఫలాపేక్షా వారిని కలుపుతూండేవి. ప్రతి ఒక్కడూ ఎవరి దోవలో వారు నిరాశచెందారు.

ఒకరూ ఒకరూ తోలు వ్యాపారం కోసం ఉత్తరాదికి వెళ్ళారు. రెండు సంవత్సరాల పాటు గురువుగా ఉన్న బల్లి సోమయ్య దగ్గర లక్ష్మయ్య ఉండిపోయాడు. సోమయ్య శూద్రులతో కలిసి ఊళ్ళో ఉన్నప్పటికీ అతని ప్రధాన పోషకుడు లక్ష్మయ్య. దాంతో అతని దగ్గర ఉన్నదంతా కరిగిపోసాగింది. అప్పుల్లో పూర్తిగా మునిగిపోయాడు. అతనికి అప్పు యిస్తుండే కోమటి చక్రవడ్డీలు వసూలు చేసేవాడు. అతని స్నేహితులకీ సహ అన్వేషకులకీ యిచ్చిన ఉచిత ఆతిథ్యం ఖర్చు అతని ఆస్తిని మించిపోయింది. వాళ్ళంతా వెళ్ళిపోయారు. ఓ వదంతి వచ్చింది. వాళ్ళంతా ఉత్తరాదిని మళ్ళీ కూడారుట. ఇంగ్లీషు వాళ్ళ దేశం నుంచి వచ్చిన ఏదో మతం గురించి తెలుసుకుంటున్నారుట.

లక్ష్మయ్య ఉత్తరాదికి వెళ్ళి నాలుగు పైసలు కనిపిస్తున్న తోలు వర్తకం చేసి అప్పులు తీర్చాలని నిశ్చయించుకున్నాడు. అయితే వదిలి వెళ్ళాలనుకొన్నా గురువు బల్లి సోమయ్యని ఏం చెయ్యాలి? నేనింక నిన్ను పోషించలేనంటే ప్రమాదం వస్తుందేమో చెప్పకుండా అతని కర్మకి అతనిని వదిలేసి వెళితే శపిస్తాడేమో? అన్న ప్రశ్నలు. రోజురోజుకి గురువు సోమయ్య ఉండటం ఇబ్బందికరంగా తయారయింది. చిట్టచివరికి అతన్ని వదిలించుకోవటానికి ఓ దారి దొరికింది. గురువు తాలుకు అన్నదమ్ములు ఉత్తరాది జిల్లాల్లో ఉంటున్నారని లక్ష్మయ్యకి తెలుసు. "నీ శిష్యులంతా ఉత్తరాదిన ఉన్నారు. బోల్డంత సంపాదిస్తున్నారు. నా అప్పులు పెరిగిపోయాయి. నేనూ వెళ్ళాలి. నువ్వూ నాతో వస్తే అక్కడ ఏదో ఆధారం నీకు దొరుకుతుంది." అని చెప్పాడు. అలా వారి ప్రయాణం మొదలయింది.

పాత శిష్యులు ఉంటున్న చిన్ని నివాసానికి వెళ్ళేసరికి, సోమయ్యకి నిరాశ ఎదురయింది. వాళ్ళకి యింక అతను అక్కరలేదు. పాత సంబంధం కోసం తిండిపెట్టారు కాని సారాయిని వదిలేశారు. మామూలుగా యిచ్చే సారాయి యివ్వనందుకు అతడు కోప్పడ్డాడు. స్నేహితులంతా మాట్లాడుకున్నారు. ఈ బరువు వదిలించుకోటానికి లక్ష్మయ్యకి సహాయం చేయాలనుకున్నారు. ఓ పది రూపాయలు అందరూ పోగేసి గురువుని అతని అన్నదమ్ముడి దగ్గరకి పంపారు. బంగారపు తాతయ్య ఒక్కడూ

వేరేగా ఉండిపోయాడు. "నేనేమీ యివ్వను. వచ్చినపుడు ఎలా వచ్చాడో అలాగే వట్టి చేతుల్తో పంపెయ్యండి. అన్నాడు. అయితే పులుకూరి లక్ష్మయ్య చాలా సంతోషించాడు. కొత్త మతాన్ని తెలుసుకోటానికి గురువు ఉండటం అతనికి అడ్డంకిగా ఉంది.

ఆ తర్వాత కాలంలో లక్ష్మయ్యకి పాత గురువుల ప్రసక్తి విషంలా అనిపించేది. వాళ్ళు చెప్పేదానిలో ఏదయినా కొంచెం సత్యం దాగున్నా వారి ఏ విలువలూ లేని నడత ఆ సత్యాన్ని ధ్వంసం చేసేది. ఆ రోజులగురించి లక్ష్మయ్య అనేవాడు. "పోతులూరి వీరబ్రహ్మం శిష్యుల కాళ్ళు పట్టుకున్నాను. ఏదయినా ముక్తిమార్గం దొరుకుతుందా అని ఆశలు పెట్టుకున్నాను. అంతా వృధా అయిపోయింది. గాలి మూట మీద నమ్మకం పెట్టుకుంటే ఏం లాభం? పోతులూరి జనాలతో కలిసి సారాయి తాగాను. ఏదో పుణ్యకార్యం చేస్తున్నాననుకున్నాను. నాలో పవిత్రత అన్నది మచ్చుకి కూడా లేకపోయింది. ఎంత గడ్డి తింటే మాత్రం ఆకలి పోతుంది?"

రాజయోగి మతం ద్వారా ముక్తి మార్గం దొరుకుతుందని స్నేహితుల ద్వారా తెలుసుకున్నాడు. ఏమీ ఫలించలేదు. గురువుల మీద ఉన్నదంతా ఖర్చుపెట్టాడు. కొత్త మతం గురించి తెలుసుకోటంలో ఇతరులు ముందున్నట్టు అర్థమయింది. తనూ అనుసరించాలి. ఒకరి తర్వాత ఒకరు మాదిగ వర్తకులు గోదావరి జిల్లాలోని ఆ నివాసం నుంచి ఇళ్ళకి బయలుదేరారు. అతని చుట్టం రాఘవయ్య వెనక్కి ఉండిపోయాడు. నాలుగు డబ్బులు మిగుల్తాయని ఊహించుకున్నారు.

ఒంగోలుకి ఒక మిషనరీ వచ్చాడని వదంతి. అందరూ ఆ కొత్త మతం గురించే చెప్పుకుంటున్నారు. కొందరు క్రైస్తవంలో చేరుతామని అంటున్నారు. వాళ్ళు ఖచ్చితమైన సమాచారం కోసం ఆరాటపడుతున్నారు. వ్యాపారం మీద పాత ఇంటి చుట్టుపక్కల ఉండే ఓ స్నేహితుడు వచ్చాడు. ఏం జరిగిందో చెప్పటానికి వాళ్ళని కలిశాడు. ఒంగోలు మిషనరీ తలకొండపాడు వచ్చాడు. 28 మందికి బాప్టిజం ఇచ్చాడు. వాళ్ళలో లక్ష్మయ్య అన్నదమ్ముడూ, అతని కొడుకూ, రాఘవయ్య కొడుకూ వారిచుట్టాలూ స్నేహితులూ ఉన్నారు.

వచ్చినతను వెళ్ళిపోయాక ఇద్దరూ కూర్చున్నారు. మనసంతా బాధగా ఉంది. కళ్ళమ్మట నీళ్ళు రావటం తరువాయి. " నా తరువాత పుట్టాడు తమ్ముడు. నా సొంత కొడుకు కూడా స్వర్గమార్గంలో నాకన్న ముందున్నారు. నేనిక్కడ ఎక్కువకాలం ఉండలేను'' అన్నాడు లక్ష్మయ్య. మర్నాడు పదహారు బళ్ళు బేరమాడుకున్నారు. ఒక్కో దానిమీద వంద తోళ్ళు వేశారు. ఇంటికి బయలుదేరారు. ఎనిమిది బళ్ళ బరువు దోవలో అమ్ముడుపోయింది. మిగిలిన ఎనిమిది బళ్ళతోనూ యిల్లు చేరారు. వాళ్ళ కొడుకులు ఒంగోలులో బడిలో ఉన్నాడు. వాళ్ళకి దొరకనిది వాళ్ళ బిడ్డలకి దొరికినందుకు పొంగిపోయారు. వాళ్ళు యింటికి వచ్చారని మిషనరీకి కబురు వెళ్ళింది. ఒక బోధకుడిని వాళ్ళకి కొత్తదైన క్రైస్తవం గురించి చెప్పటానికి పంపారు.

రాజయోగి గురువులలో ఆఖరు అతను వదిలేసరికి లక్ష్మయ్య అప్పులలో మునిగి ఉన్నాడు. అతని పాత సహచరులంతా బోధకులు అయ్యారు. వాళ్ళ హోదాకు ఉన్న గౌరవంతో సంతోషంగా ఉన్నారు. లక్ష్మయ్య ఒక్కడైపోయాడు. అడిగితే అప్పు గురించి చెప్పాడు. వాస్తవానికి ఆ అప్పు కారణం కాదు. కొంచెం తప్ప దాదాపు అంతా తీర్చేశాడు. లక్ష్మయ్య తన కాళ్ళమీద తను నిలబడాలనుకునే మనిషి. అతను యీ బోధకుల వృత్తిలో ఓ చిన్న భాగమవటానికి యిష్టపడలేదు. వ్యాపారం మీద వెళ్ళి డబ్బు చేసుకుంటూ అతనికి యిష్టమైనచోట యిష్టమైనపుడు బోధించాలని ఎవరికీ జవాబు చెప్పనవసరం లేకుండా జీవించాలనుకున్నాడు.

అలా ఆరేళ్ళు గడిచాయి. నెలవారీ సమావేశాలకు ఒంగోలు వచ్చినపుడు మిషనరీ అడుగుతుండేవాడు. వ్యాపారం వదిలేసి ఇక్కడే ఉండి దైవకార్యంలో నిమగ్నమయ్యే రోజు యింకా రాలేదా అని అడిగేవాడు. అతను వస్తాననేవాడు కాని ఎన్నడూ రాలేదు. చివరికి కాలం మారింది. మిషనరీ నుంచి వచ్చిన ఓ కబురు అతన్ని బలవంతం చేసింది. లక్ష్మయ్య కొడుకు బడి వదిలి సెలవులకి యింటికి వస్తున్నాడు. దొర నమస్కారాలు చెప్పమన్నాడని మీ నాన్నకి చెప్పు అన్నాడు దొర కుర్రాడితో. "నేను మీ నాన్నని పనికి పిలిస్తే అతను రాలేదు. దేశమంతటా యజమాని లేని కుక్కలా తిరుగుతున్నాడు.'' అని చెప్పమన్నాడు. ఆ మాట అందరి చెవుల్లోనూ పడింది. లక్ష్మయ్య అప్పుడు నవ్వాడు. ఈ కథ చెప్పినపుడల్లా ఈ నాటికీ నవ్వుతూనే ఉంటాడు. బోధకులంతా నవ్వారు. లక్ష్మయ్య సందిగ్దస్థితిని దొర అలా చెప్పడం వారికి నచ్చింది "నువ్వు వెళ్ళి తీరాలి" అన్నాడు కొడుకు. తండ్రి నవ్వుతూనే వెళ్ళటానికి ఒప్పుకున్నాడు కాని ఇప్పుడే కాదన్నాడు. మిషనరీకి తన విలువ తెలిసింది. ఆ ధర్మ యుద్ధంలో తనే జయించాడు అని లక్ష్మయ్యకి సంతోషం కలిగింది. తన దోవలో తనుండటంతో లక్ష్మయ్యకి ఎంత బలముందో అతన్ని దోవలో పెట్టడానికి మిషనరీకి అంతకన్నా బలం ఉంది. అతని నిజమైన స్థితి ఏమిటో ఎదుటపెట్టాడు.

ఇదంతా అయిన కొన్నాళ్ళకి మిషనరీ కనిగిరి తాలూకాలో విశేషంగా పర్యటించాడు. అప్పుడు మిషనరీ లక్ష్మయ్యను చూశాడు. తోటి బోధకులతో కలిసి తనను అనుసరించటమే కాదు అతని గ్రామం చుట్టుపట్ల ప్రాంతాలలో అనేకమంది క్రైస్తవులకి మత నాయకుడుగా పాస్టర్‌గా ఉన్నాడు లక్ష్మయ్య. అక్కడి నుంచి వెళ్ళిపోయేటపుడు లక్ష్మయ్యతో అతని భార్యతో మాట్లాడాడు. "నువ్వు ఏం చెయ్యాలనుకుంటున్నావు లక్ష్మయ్యా?" అని అడిగాడు. నాకు దేవుడి సేవలో చేరాలనే ఉంది కాని నాకొక అప్పు ఉంది." జవాబిచ్చాడు. ఇది నెపం అని మిషనరీకి తెలుసు. బల్లమీదున్న ఓ కాగితంముక్క తీసుకుని చిన్న చిన్న ముక్కలు చేసి ఓ గుప్పెడు లక్ష్మయ్య మీద విసిరాడు. ఆ గుడారంలో అన్ని మూలాలూ

పడ్డాయి. " ఇలా నీ అప్పు తీరిపోయింది" అన్నాడు. అతని భుజం మీద మెల్లగా తట్టి ఇంటికి పంపేశాడు.

ఊరికి తిరిగి వస్తూండగా లక్ష్మయ్యను ఒక విషపు పురుగు కుట్టింది. వాపూ నొప్పీ మొదలయాయి. ''తప్పకుండా చచ్చిపోతాడు. ఓ కోమటాయన ఇలా కుడితేనే చనిపోయాడు అన్నారు. లక్ష్మయ్య గాబరా పడిపోయాడు. మరుసటి రోజు బైబిలు తీసుకుని ఈ అకాల మరణం రాబోతున్న సమయంలో తనకు ఓదార్పునిచ్చేది ఏదైనా దొరుకుతుందా అని వెదికాడు. ప్రాఫెట్ జోనా అనుభవం ఉన్న పేజీలు తిరగెయ్యటం జరిగింది. దాంతో తనకు దేవుడి పంపించిన విధంగా భోదకుడవటానికి నిరాకరించటమే తను కూడా ఈ ఆపదలో పడటానికి కారణం అనిపించింది. దొరకి ఓ ఉత్తరం రాయించాడు. "నేనొస్తున్నాను. పనికి వెళతాను. "రెండ్రోజులకి వాపు తగ్గిపోయింది. లేచాడు. అనేక గ్రామాలు తిరిగాడు. అన్నిచోట్లా బోధించాడు. నెలవారీ సమావేశానికి ఒంగోలు వచ్చాడు.

ఇతర బోధకుల మధ్య అతన్ని చూచి నవ్వాడు దొర. "వచ్చావా లక్ష్మయ్యా!"

"వచ్చాను"

# 3. రామస్వామి మౌనం

ఓ రోజు మధ్యాహ్నం పొలాల నుంచి ఇళ్ళకు వచ్చేసరికి ఎర్రపాలెం మాదిగలకు గ్రామానికి కొంచెం దూరంలో ఎవరో ప్రయాణంలో అలసిపోయి కూర్చున్నట్లు కనిపించాడు. “ ఎవరీయన? అడుగుదాముండు అనుకున్నారు. వాళ్ళలో ఒకడు తమ యిళ్ళకు దగ్గరగా ఉన్న పెద్ద చెట్ల కిందకి రమ్మని పిలిచాడు.

వాళ్ళ దగ్గరికి వస్తూనే అతను చెప్పాడు. “ నా పేరు బండారు పుల్లయ్య. ఒంగోలు నుంచి వచ్చాను. ముక్తి మార్గం ఒకటి నాదగ్గరుంది. చెపుతాను వింటారా” అది సాయం సమయం. చెట్ల నీడ హాయిగా ఉంది. కొత్తదేదో కుతూహలకరమైనది వినడానికేం?

ఆ చెట్ల కింద రామస్వామి కోవెల ఒకటి ఉంది. ఆ ఊరి మాదిగలు కొన్ని పర్వదినాలలో పూజలు చేస్తుంటారు. వినటానికి తయారయిన వాళ్ళు చిన్న చిన్న గుంపులుగా ఎవరికి అనుకూలంగా వాళ్ళు కూర్చున్నారు. గుడి అరుగు మీద చెప్పుల కాళ్ళను గుడిగోడలకు తాకించుతూ కూర్చున్నాడు పుల్లయ్య అందరూ విస్తుపోయారు. వాళ్ళు శాంతిప్రియులు. వాళ్ళ ముందు అతను దేవుడు రామస్వామి మీద తన ధిక్కారాన్ని ఆ విధంగా చూపించాడు. వాళ్ళకు కోపం రాలేదు గాని పుల్లయ్యకు ఏమవుతుందోనని భయపడ్డారు. వాళ్ళు ఆ గుడి సమీపంగా కాళ్ళకి చెప్పులతో వెళ్ళటానికి ఎన్నడూ సాహసించలేదు. లేకపోతే భగవంతుడు కోపగించి తమని సర్వనాశనం చేస్తాడు. పుల్లయ్య వాళ్ళ ఆశ్చర్యాన్ని భయాన్ని చూసి నవ్వాడు. “ ఈ గుడిలో పవిత్రమైన దైవం ఉన్నాడా? భయపడకండి. నాకెలాంటి కీడూ కలగదు.”

వాళ్ళా సాయంత్రమంతా అతన్ని చూస్తూనే ఉన్నారు. అతను జీసస్ క్రీస్తుని గురించి ధారాళంగా మాట్లాడుతున్నాడు. వాళ్ళు వింటున్నారు. అంతసేపూ అతని చెప్పుల కాళ్ళు రామస్వామి కోవెలను ధైర్యంగా తాకుతూనే ఉన్నాయి. ఆ దేవునిమీద వాళ్ళ గౌరవం తగ్గింది. పుల్లయ్యను గౌరవించదగ్గ అతిథిగా భావించసాగారు.

చీకటి పడుతోంది. అతన్ని తమతో తినమనటానికి సంకోచం కలిగింది. ఆ క్రైస్తవులు చచ్చిన గొడ్ల మాంసం తినటం ఆరోగ్యం కాదని అవమానకరంగా భావిస్తారని అతను వాళ్ళతో నిస్సంకోచంగా చెపుతున్నాడు. అది వాళ్ళకి సంకోచం కలిగిస్తున్నా అతని అవసరాలు చూడాలని వాళ్ళకి ఉంది. మాదిగ పెద్ద అడిగాడు. ఉడికించిన అన్నం పులుసూ మాతో తింటారా లేకపోతే ఎవరైనా శూద్రుడి చేత వండించమంటారా అని అడిగాడు. హిందూ గురువులు ఉపదేశం యివ్వటానికి వచ్చినపుడు రెండో పద్ధతే పాటిస్తారు. పుల్లయ్య దాన్ని ఒప్పుకోలేదు. “ఏం ఫరవాలేదు. మీతోనే తింటాను” అన్నాడు.

వాళ్ళలో ఒకడిగా తీసుకువెళ్ళారు. మాదిగ పెద్ద భార్య విస్తరాకు మీద వడ్డించింది. ఆ ఆకుని తిరిగి ఉపయోగించరు. పుల్లయ్య భోజనం అయాక ఆకుని ఎత్తి బయట పారేస్తారు. అపరిచితుల శుచి శుభ్రతలను గౌరవించటంగా వారా పద్ధతిని పాటిస్తారు.

వెన్నెట్లో వాళ్ళంతా ఆ రాత్రి కూర్చున్నారు. క్రీస్తు పవిత్ర జీవితం గురించి చావు గురించి కథలను గంటలకొద్దీ విన్నారు. కొత్త మతం సూత్రాలను పుల్లయ్య యిచ్చిన వివరణలను శ్రద్ధగా విన్నారు. వాళ్ళంతకాలం జీవించిన చీకటితో పోలిస్తే అతను చెప్పినది గొప్ప కాంతిలా అనిపిస్తోందని వాళ్ళు ఒప్పుకున్నారు.

పుల్లయ్యను మరో రెండు రోజులు ఉండమని అడిగారు. అదే సమయానికి గురువు తన శిష్యుల మంచి చెడ్డలు చూసిపోదామని అంతేకాకుండా సొంతలాభం చూసుకుందామని వచ్చాడు. కూర్చుంటూనే అడిగాడు. “కోడి కొయ్యండి! అన్నం వండండి! కూర చెయ్యండి! సారా తెండి! కుటుంబంలోని ‘చిన్న పిల్లలు’ గురువుగారు అలిసిపోయారు అని కాళ్ళు పట్టడం మొదలెట్టారు. దేవుడు కరుణిస్తాడని ఆశపడ్డారు.

ఈ సారి గురువుకి అలవాటయినట్లు ఆతిథ్యంలో భక్తిశ్రద్ధలు లేకపోయాయి. నీళ్ళు పోసి కాళ్ళు కడిగారు. కాని ఆ నీటిని పాత్రలోకి తీసుకుని భగవదనుగ్రహం కోసం తాగలేదు. కోడిమాంసాన్ని సారాని భోజనంలో యిమ్మని మామూలుగానే ఆజ్ఞాపించినపుడు గురువుకి వ్యతిరిక్తత ఎదురయింది. అతను చెట్టు కింద కూర్చున్నపుడు ఎవ్వరూ మంత్రాలు అడగలేదు. పైగాపుల్లయ్య చెప్పినది చెప్పారు. క్రైస్తవులు కావాలనుకుంటే వాళ్ళ జుత్తు కత్తిరించుకోవాలి. ఒకస్వామి తమ ఇంట్లో ఉండటం కోసం తలమీద కొప్పు ఉంచుకోటం ఏ క్రైస్తవుడూ చెయ్యలేదు. పుల్లయ్య తన జేబులో ఎప్పుడూ ఒక కత్తెర ఉంచుకుంటాడు. అతను తిరుగుతున్నపుడు వందలాది కొప్పులు కత్తిరించవలసి వస్తుంది. గ్రామస్తులు తలలు వంచి “కత్తిరించెయ్యండి” అనేవారు. అందరూ ఆ కత్తిరింపు పనిలో ఉండగా గురువు లేచాడు. ఇటూ అటూ చూడలేదు. ఎవ్వరికీ చెప్పలేదు. వెళ్ళిపోయాడు. మళ్ళీ తిరిగిరాలేదు.

ఇదంతా నిశ్చితంగా పుల్లయ్యకి అనుకూలించింది. అనేక మాదిగ కుటుంబాలలో ప్రవేశం లభించింది. అతన్ని సాధారణంగా దగ్గరి చుట్టంగా భావించేవారు. మాదిగలు తమ వంశ సంబంధాలను చుట్టరికాలు కలుపుకోడంలోచూపిస్తారు. అవి ఎంత దూరపు చుట్టరికాలయినా వాటికి చాలా ప్రాముఖ్యత యిస్తారు. పుల్లయ్య కుటుంబం ఎప్పుడో ఓ మారు సంబంధం కలుపుకోటానికి రావటం యిరు కుటుంబాల మధ్య ఓ పెళ్ళి జరగటంతో అతనికి అనేక యింటి తలుపులు తెరచుకున్నాయి.

అతనికి అనుకూలించిన మరో అంశం చిన్నతనంలో రాజయోగి మతస్థుల సాహచర్యం. వాళ్ళ పడికట్టు పదాలు, ఆచారాలు నమ్మకాలు పుల్లయ్యకు బాగా పరిచయం. క్లుప్తంగా చెప్పాలంటే వాళ్ళ భాషను మాట్లాడేవాడు. కనక ఎక్కడికి వెళ్ళినా వాళ్ళలో ఒకడయిపోయేవాడు. బంగారపు తాతయ్య తతిమా వాళ్ళు రాజయోగి మతంలో ఆసక్తిగా ఉండే రోజులలో పుల్లయ్యతో సంబంధం ఉండేది. అతను తిరుగుతున్నపుడు మొట్టమొదట రాజయోగి జనాలను పట్టుకునేవాడు. ఎందుకంటే వాళ్ళు అప్పటికే మాదిగ వాడలలోని స్వాములను దాటి ఒకే ఒక దైవాన్ని చూడాలని తెలుసుకోవాలని కోరుకుంటున్నారు. ఒకే దైవాన్ని పూజించటం వాళ్ళు నేర్చారు. అలాంటి వారికి జీసస్ క్రీస్తే ఆ దైవం అవతారమని చెప్పటం చాలా సులువు.

పుల్లయ్య ఎర్రపాలెంను విడిచిపెట్టేనాటికి అనేక ప్రముఖ కుటుంబాల పెద్దలు మాట యిచ్చారు. విగ్రహారాధన మానేస్తామన్నారు. ఆదివారం విశ్రాంతి దినమవుతుందన్నారు. చచ్చిన గొడ్ల మాంసాన్ని వాడలోకి తేమన్నారు. అతను చేసినట్లుగా మోకాళ్ళ మీద జీసస్ క్రీస్తుని ప్రార్థిస్తామన్నారు. కొన్ని నెలలు గడిచాయి. పుల్లయ్య తరచూ వచ్చేవాడు. "మాకు ఎందుకు బాప్తిజం యివ్వరాదూ? అని యిద్దరు ముసలివాళ్ళు అడిగేవారు. నెలవారీ సమావేశాలలో ఒంగోలుకి తీసుకువెళ్తానని అన్నాడు. చేతిలో కర్ర, భుజాన చద్దన్నం మూటతో వాళ్ళు నలభై మైళ్ళ ప్రయాణం ఆరంభించారు.

ఆ దోవమీదే వెళ్తున్న మరికొందరిని కలిసారు. అంతా కలిసి దోవలో ఏదయినా మాదిగ వాడ దగ్గర ఆగి మంచినీళ్ళు అడిగేవారు. ఈ ప్రయాణానికి కారణం చెప్పేవారు. దోవలో వెట్టివారిని కలిసేవారు. వాళ్ళు ఈ వార్తను వ్యాపింపజేశారు. అనేకమంది మాదిగలు ఒంగోలుకు బయలుదేరారు. మూడో రోజు సాయంత్రానికి మిషన్ వాకిలిలోకి ప్రవేశించారు. ఆడా మగా గుంపులుగా కూర్చుని కుండలలో అన్నం వండుతున్నారు. అన్నం ఉడకటం కోసం చూస్తున్నారు. మాటలు, ప్రశ్నలు, అనుభవాల కలబోత జరుగుతున్నాయి. ఒకరి అవసరాలు ఒకరు చూడటంలో సహోదరత్వం ఆతిథ్యం అక్కడ ఉన్నాయి.

ఎర్రపాలెం నుంచి వచ్చిన యిద్దరి అనుభవం గురించి బోధకులు కుతూహలంగా అడుగుతున్నారు. మిషనరీ వాళ్ళతో మాట్లాడాడు. అంతకుముందు దొరనెవరినీ చూడకపోవటం వల్ల ఆ తెల్ల ముఖం చూసి వాళ్ళకి సంకోచం కలిగింది. వాళ్ళు కుర్చీలలో కూర్చోలేరు గనుక నేల మీద చాపలు పరిచి కూర్చోమన్నాడు. దొరసాని వచ్చింది. అరటిపళ్ళు పిల్లల చేతుల్లో పెట్టింది. వాళ్లతో మాట్లాడింది. తొందర్లో వాళ్ళ భయాలు తొలగిపోయాయి.

వాళ్ళిద్దరిలో ఒకరికి బాప్తిజం యిచ్చారు. రెండో అతను పాపయ్యకి ఓ అభ్యంతరం ఎదురయింది. అతనికి ఇద్దరు భార్యలు కనుక బాప్తిజం ఆగిపోయింది. అందరూ ఆశ్చర్యపోయారు. ఇది పాపమని తెలియదు. మా హిందువులం ఇలాంటివి చేస్తాం. అయితే ఇది దేముడికి యిష్టంలేకపోతే తప్పకుండా మానెయ్యాలి" అనుకున్నారు.

పాపయ్య తల్లి ఈ ఏర్పాటు చేసింది. ఆమె మేనకోడలుని భర్త వదిలేశాడు. అనాథ. పాపయ్యకి రెండో భార్యగా యింట్లోకి తీసుకురాకపోవటానికి ముసలావిడకి కారణం కనిపించలేదు. ఆమెకి ఓ యిల్లు ఏర్పడుతుందని ఆశించింది. ఈ ఏర్పాటు మొదటి భార్యకు కష్టం కలిగించింది. ఆయితే ఆమెకి కూతురే తప్ప కొడుకు లేడు. అందువల్ల ఈ విషయంలో ఆమె మాటకి విలువ లేకపోయింది. ఆమెకి భర్త మీద చాలా కోపం వచ్చింది. కొత్త భార్యతో స్నేహంగా ఉండలేదు. అయితే ఆమెకి ఎవరి సాయం లేదు. తన కొత్త స్థానం తాలూకు బాధలను మౌనంగా భరించవలసి వచ్చింది. లేకపోతే ఆమెతో కఠినంగా వ్యవహరించేవారు. కొట్టినా కొట్టేవారు.

ఒంగోలు నుంచి తిరిగి వచ్చాక ఈ విషయం వాడలో బాగా చర్చించారు. ముసలి తల్లికి చాలా కోపం వచ్చింది. ఓ మగాడికి ఇద్దరు పెళ్ళాలు ఉండగూడదని ఎవరయినా విన్నారా అని అడిగింది. ఆ తర్వాత వారాల్లో బోధకులు వచ్చి వెళ్ళారు. పాపయ్యకి బాప్తిజం ఎందుకు యివ్వలేదని అడిగితే విషయాన్ని వివరించబోయాడు. ఆడం ఈవ్‌లగురించి చెప్పాడు. దేముడు ఆడంకి ఒకే ఒక్క భార్యగా ఈవ్‌ని ఇచ్చాడు. కొత్త నిబంధన ప్రకారం మగవాడూ యిద్దరి భార్యలూ వాళ్ళ ఆత్మల విముక్తి కోల్పోతారని స్పష్టం చేశారు. బహుభార్యాత్వంలోని మతపరమైన నైతికపరమైన ఉల్లంఘన, నేరం ఈ మధ్య వరకూ ఆ బోధకులకి కూడా తెలియదు. కొన్ని విషయాలలో మాదిగలలో సాంఘిక నీతి బాగా తక్కువ. క్రైస్తవనాగరికత ఉన్నతంగా భావించే వైవాహిక జీవితం తాలూకు పవిత్ర భావనలు హఠాత్తుగా వారికి ఎదురయాయి.

కుటుంబమంతా విషయాన్ని గట్టిగా చర్చించింది. భారత గ్రామీణ జీవితానికి వ్యతిరేకమైన భావాల ప్రవేశాన్ని అభ్యంతరపెట్టిన వాళ్ళని నోరెత్తకుండా చేశారు. ఈ చిక్కు నుంచి బయటపడే దారి కనిపెట్టారు. ఆ వాడలోనే రెండో భార్య చుట్టాలున్నారు. వాళ్ళు తమతో ఉండమన్నారు. ఆమె బిడ్డ ఆడపిల్ల. మగపిల్లాడయితే ఆమె కర్మ మరోలా ఉండేది. పెళ్ళి తంతు జరగలేదు కనక వచ్చినట్టే ఆమె వెళ్ళిపోయింది. పాపయ్య మొదటి భార్యకీ మళ్ళీ శాంతి లభించింది.

క్రైస్తవం మాదిగ సమాజంలో ప్రవేశించిన చోటల్లా సామాజికపరమైన, మతపరమైన తిరుగుబాటు తలెత్తేది. కొత్త మతం తాలూకు పవిత్ర నియమాలు ఒక కుటుంబం తర్వాత ఒకటి స్వీకరించాయి. మత మార్పిడికి బహిరంగ చిహ్నంగా జుత్తు ముడి (కొప్పు) కత్తిరించబడేది. కాని ఎవరయినా చచ్చిన గొడ్డు

మాంసం ఉడుకుతున్నపుడు దూరంగా కూర్చుంటే అది సామాజిక మార్పుగా గుర్తించబడేది. "చూశావా వాడు తినడు. వాడు కూడా ఒంగోలు మతానికి వెళ్తున్నాడు." కుటుంబంలో ఒక్కోసారి గొడవలు తలెత్తేవి. ఈ మత భ్రష్టత్వంగురించి దుఃఖమయిన రోజులూ, వారాలూ, నెలలూ ఉండేవి.

క్రైస్తవ కుటుంబాలకు పాత ఆచారాలనే పాటించే అతిథులు వచ్చినపుడు వాళ్ళకి కావలసినంత తిండి పెట్టేవారుగాని ఆ కుటుంబం వాళ్ళు తినే మూకుళ్ళని ముట్టుకోనిచ్చేవారు కాదు పాత మూకుళ్ళలో తిండి వడ్డించి తిన్నాక బయట పారేసేవారు. తాగటానికి మాత్రం ఇత్తడి కప్పులలో యిచ్చేవారు. ఆ తర్వాత వాటిని ఇసకవేసి తోమేవారు. "మా తిండి మీరు ముట్టుకుంటే మేం జబ్బుపడతాం. మీరు శుభ్రంగా ఉండరు" అనేవారు. వెలివేయబడటానికి బదులుగా వాళ్ళే ఇతరులను వెలివేసేవారు.

ఆధ్యాత్మిక నలహాను వినిపించుకోని అనేకమంది చెవొగ్గకపోటానికి కారణం ఎవరైనా ఆ ఆహారాన్ని చీదరించుకోటాన్ని కుటుంబం విరోధించేది. మాదిగలకి తగిలిన శాపం గురించి గాథలు ఆచారాలు చెప్పేవారు. వాళ్ళు చచ్చిన గొడ్డు మాంసాన్ని తిని తీరాలి. క్రైస్తవ కుటుంబ కేంద్రాలు దీనితో పోరాడేవరకూ ఈ శాపవిముక్తికి ఎవ్వరికీ శక్తి వుండేది కాదు. వాదన అనవసరం. కుళ్ళిన ఆహారం కారణంగా ఎందరో జబ్బుపడలేదా? తల్లిదండ్రుల తప్పుడు అలవాట్లు బిడ్డల బాధలకు సాక్ష్యం చెప్పవా?

ఒక కొత్త రోజు ప్రవేశించింది. శుభ్రత తాలూకు సువార్త ప్రవేశించింది. మురికి వదిలితే అజ్ఞానం దానితో వెళ్ళి తీరుతుంది. రామస్వామి కోవెల మీద పుల్లయ్య చెప్పుల కాళ్ళు ముట్టిన రోజు గడచిన కొన్ని ఏళ్ళకే ఒక మాస్టారు ఒంగోలు నుంచి వచ్చి యర్రపాలెంలో నివాసమున్నాడు. చిన్ని పాఠశాలకు మట్టి గోడలను నిలబెట్టేయి కొందరిచేతులు. పై కప్పుకి తాటాకు ప్రతి కుటుంబమూ యిచ్చింది. గ్రామ వడ్రంగికి డబ్బిచ్చి దూలం తయారు చేయించారు.

పాఠశాల భవనానికి స్థలంగా రామస్వామి కోవెల లేచిపోవలసి వచ్చింది. శూద్రులు సందేహంగా తలలు పంకించారు. కాని అనేకమంది బోధకులు ముందుకు రావటంతో క్రైస్తవుల ధైర్యం పెరిగింది. గునపాలు పారలు తీసుకొన్నారు. గుడిగోడలు పడిపోయాయి. ఒక చిన్నపాము కలుగులో ఉన్నది. బయటపడింది. చావు దెబ్బ పడేముందు పడగ ఎత్తి బుస కొట్టింది. రామస్వామి మాత్రం వెళ్ళిపోయుంటాడు. ఎలాంటి ఆగ్రహమూ చూపించలేదు.

# 1. సంస్కర్త నజరయ్య

"నేను క్రైస్తవుడిని కాకముందు నజరయ్య మతంకి చెందినవాడిని" అనేక మంది ఆదామగా పదే పదే నాతో చెప్పేవారు. ఈ మతమేమిటా అని సహజంగానే నేను ఆరా తీసాను.

"నజరయ్య మత గురువులు మా దగ్గరకి వచ్చి చెప్పారు. దొంగతనం వద్దు. విగహారాధన వద్దు. దేముడు ఒక్కడే-"

"మాదిగలలో చాలామంది ఈ మతంవారా?"

జవాబులు అస్పష్టంగా వుండేవి. ఒకతను కనీసం వందమంది ఉంటారన్నాడు. ఇంకొకతను వెయ్యి అన్నాడు. మూడోవాడు నాకెలా తెలుస్తుంది-" అన్నాడు.

నేను అనేక ప్రశ్నలు వేశాను. ఈ నజరయ్య ఎవరు? ఏ కాలంవాడు? హిందువుల అసంఖ్యాక శాఖలలో ఇది ఏ తరగతికి చెందినది? నాకొకతను దొరికాడు. నజరయ్య మతం ఏడాది పండగకి త్రిపురాంతకంలో ఉన్నానన్నాడు. నజరయ్య మతం తాలూకు చివరి గురువు సుందరమ్మ బతికే వుందని తను చూశానని ఇంకొకడు చెప్పాడు. చివరికి ఓ మాదిగతను నజరయ్యను స్వయంగా చూశాడని విన్నాను. అతని కోసం కబురంపాను. వచ్చాడు. పండుముసలి. రోమన్ ముక్కు, దట్టమైన కనుబొమలు. "నువ్వు నజరయ్యను చూశావా?"

రెండు కళ్ళమీదా అయిదువేళ్ళూ పెట్టుకొన్నాడు. నా వేపు వంగాడు. అతని ప్రవర్తన, శరీరంలోని కదలికలూ అతని మాటలమీద నమ్మకం పెంచాయి. "ఈ కళ్ళతో నేను నజరయ్యని చూశాను".

ఆ విధంగా నాకు నజరయ్య కాలం తెలిసింది. అతనికి డబ్బయి లేదా డబ్బై అయిదు ఏళ్ళుంటాయి. నజరయ్య ఆరంభించిన మతోద్యమంలో అతని తండ్రి కొట్టుకుపోయాడు. ఓ చిన్నికుర్రాడిగా ఉన్నపుడు అతనిని త్రిపురాంతకం తీసుకెళ్ళాడు. కొన్నేళ్ళకి చనిపోతాడనగా నజరయ్యను ఈ బాలుడు చూశాడు. అంటే అది 1825 అయింటుంది.

అనేక సంవత్సరాలు గడిచినా ప్రభావం నశించని ఈ నజరయ్య వ్యక్తిత్వాన్ని గురించి తెలుసుకోవాలనుకున్నాను. నా ముందున్న ఈ ముసలతను అతని గురించి ఏమీ చెప్పలేకపోయాడు. నజరయ్య పేరిట ఉన్న మతం గురించి చెప్పడానికి మాత్రం సిద్ధంగా ఉన్నాడు. అనేక సంవత్సరాలుగా ఆ మతం దీక్ష పుచ్చుకున్న గురువు ఈ ముసలతను. అతను చెప్పగలిగింది అంతా సేకరించాను. విన్నకొద్దీ ఈ నజరయ్య ఎవరో తెలుసుకోవాలన్న కోరిక పెరిగింది. అనేక చోట్లకి కబుర్లు పంపాను. గురువు నజరయ్య కథ ఎవరికైనా వాళ్ళ తండ్రి చెప్పడం గుర్తుందా అని అడిగాను. ఒక మహమ్మదీయుడని కనిపెట్టాను. అతని తండ్రి నజరయ్య నుంచి దీక్ష పొందాడు. నజరయ్య అంత పెద్ద గురువు ఎలా అయ్యాడో ఆ కథ చెప్పాడట. చిన్న కుర్రాడుగా తనే స్వయంగా చూశాడుట. అతనొక ముసలివాడు. అతను చెప్పిన కథ భారతదేశపు మత జీవితపు స్వభావంతోనే ఉంది.

వందేళ్ళ క్రితం మహమ్మదీయమతానికి చెందిన సయ్యద్ శాఖలో ఓ ధనవంతుడైన వర్తకుడు ఉండేవాడుట. అనేక ఓడలుండేవి. తరచూ దూర ప్రయాణాలు చేసేవాడు. గలెప్ షరీఫ్ అనే ఆ వ్యాపారి అలాంటి ఓ ప్రయాణంలో ఒక గురువును కలిసి అతని బోధలకు ఆకర్షించబడ్డాడు. అతను దీక్ష తీసుకున్నాడు. తన గురువుకి పూర్తిగా విధేయుడయిపోయాడు. లాభాలు వచ్చే వ్యాపారాన్ని వదిలేశాడు. బాపట్ల తాలూకాలో తనకోసం ఓ గుడికట్టుకున్నాడు. అక్కడే నివశించాడు. అనేక మంది అతని బోధలు వినడానికి వచ్చేవాడు. అతని ముఖ్య సిద్ధాంతం దేవుడు ఒకే ఒక్కడు.

నరసారావుపేట రాజా గలెప్ షరీఫ్ గురించి విన్నాడు. అతనికి దైవిక శక్తులున్నాయిట. అద్భుతాలు చేస్తాడుట. ఓ దూతని పంపి గురువుని తన భవనానికి ఆహ్వానించాడు. అతనికి శిష్యుడవాలనుకుంటున్నానని కబురంపించాడు. షరీఫ్ వచ్చాడు. ఒకటి రెండురోజులు నిరీక్షించాడు. కాని రాజా తన సముఖంలోకి రప్పించడానికి ఆలస్యం చేశాడు. ఇంక నిరీక్షించలేక లేచి ఇంటి మొహం పట్టాడు.

రాజా దగ్గర ఒక సహాయకుడు ఉన్నాడు. పేరు నజర్ మహమూద్. షేక్ శాఖ. అతనికి ఈ గురువుమీద ఆసక్తి ఎక్కువ. షరీఫ్‌ని అనుసరించి వెళ్ళాడు. కాళ్ళమీద పడ్డాడు. తనని శిష్యుడిగా చేసుకుని ఉపదేశం ఇమ్మన్నాడు. గురువు ఉపదేశానికి నాలుగువందల రూపాయలు ఇమ్మన్నాడు. నజర్ మహమూద్‌కి ఉన్న బలీయమైన కోరికవల్ల ఆ నాలుగువందలు ఇస్తానన్నాడు. అయితే అతని దగ్గర ఆ డబ్బు చెల్లించడానికి ఏమీ లేదు. అద్భుతశక్తులు నేర్పాక ఇస్తానన్న డబ్బు ఇవ్వాల్సిన రోజు దగ్గర పడింది. నజర్ మహమూద్ లేచి పారిపోయాడు. త్రిపురాంతకం చేరాడు. అక్కడో హిందూదేవాలయం ఉంది. దేవాలయంలో వాళ్ళు, భక్తులూ అతని బోధనలను వినడానికి వచ్చేవారు. రోజు రోజుకీ అతనికి అనుచరులు పెరిగారు.

తన శిష్యుడు నజర్ మొహమూద్ దాక్కున్న స్థలం గలెప్ షరీఫ్‌కి తెలిసింది. ఇస్తానన్న ధనంకోసం దేవాలయానికి వచ్చాడు. నజర్ మహమూద్ శిష్యులు మాట్లాడుకున్నారు. "ఆయన గొప్ప గురువు. అతని అప్పు తీరుద్దాం. గుడికడదాం. ఆయన మన మధ్య ఉంటాడు. మనం ముక్తి సంపాదించుకుందాం-" అనుకున్నారు. షరీఫ్ తన డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు. ఒక పెద్ద గుడి కట్టారు. కొత్త గురువు పేరు అన్ని చోట్లకీ పాకింది. మహమ్మదీయ పేరు

నజర్‌కి తెలుగు 'అయ్య' చేర్చారు సామాన్య జనం. ఆ విధంగా ఆ మతం నజరయ్య మతం అయింది.

నజరయ్య మతమేమిటి? పుట్టుకరీత్యా మహమ్మదీయుడు. అయినప్పటికీ అతనుగాని అతని శిష్యులుగాని మహమ్మద్ ప్రవక్త పేరు చెప్పారు. గలెప్ షరీఫ్ తన ప్రయాణంలో కలుసుకున్న గురువు ఓ యోగి అయుండాలి. నజరయ్య బోధనలు చాలావరకూ యోగి సిద్ధాంతాలు. నిజానికి అతని అనుచరులు తమని రాజయోగి ప్రజలుగా చెప్పుకుంటారు. మహమ్మదీయులూ ఈ యోగీ కూడా దేముడు ఒక్కడేనని ఒకేలా నమ్ముతారు.

నజరయ్య ఉపదేశ విధానం యోగి సిద్ధాంతానికి సరిపోలుతుంది. "నీ మనసుని కేంద్రీకరించు. అన్ని రహస్య ఆలోచనలనూ వదిలిపెట్టు. పైకి చూడు. శరీరం ఉనికిని మరిచిపో. తలమీద ఉన్న జుత్తు ముడిమీద దృష్టిపెట్టు. (సన్యాసుల జుత్తులాగ), నిశ్చలబుద్ధితో పరికించు. అప్పుడు నీకు ప్రత్యక్షమవుతాయి... కాంతి, దైవాత్మలు, పవిత్రనదులూ స్థలాలూ, రుషులు, సూర్యచంద్రులు, మెరుపులు, ఉరుములు, నిప్పు, నీరు, శబ్దాలూ ఆకాశాన్ని నింపేస్తాయి. భూమి ఒక గుడ్డులా కనిపిస్తుంది. బ్రహ్మ కనిపిస్తాడు అంతా ఒకటైపోతుంది".

నజరయ్య శిష్యులని తయారుచేశాడు. తన బోధలను ప్రచారం చెయ్యడానికి పంపాడు. అతను కులభేదాలను, లింగభేదాలనూ పాటించలేదు. ఆడామగా అందరికీ ఉపదేశాల తంతు (దీక్ష) జరిగింది. అందరూ మతం మారారు. నేను ఈ తంతుల గురించి ఆరాతీశాను. ప్రతిసారీ నాకు చుక్కెదురయింది. నేను విన్నది అంతా ఒకటే చెవిలో ఏదో అంటారు. ఉపదేశానికి అనర్హులయిన ఎవరికీ ఎట్టి పరిస్థితులలోనూ దానిని చెప్పకూడదు.

నజరయ్య జీవితకాలంలో ఆయన నిషేధించిన వాటిని చెయ్యటానికి శిష్యులు ఎవరూ సాహసించలేదు. సారాయి కాని భంగు కాని వాళ్ళు వాడితే చివాట్లు వేసేవాడు. కులవివక్షమీద విరుచుకుపడ్డాడు, అతనికి ధర్మాగ్రహంతో ఒళ్ళు తెలిసేదికాదు. నజరయ్య ఎవరో చెప్పలేనివారు కూడా కామవాంఛలమీద ద్వేషానికి గుర్తుగా అతను పగబట్టి రక్తం చిందించిన కథ చెప్పగలిగేవారు. ఓ రోజు ఒక స్త్రీ శిష్యురాలు కేకలు వినిపించాయి. ఆమె మీద గాయాలూ అవమానాలూ కనిపించాయి. ఆ తప్పు చేసిన వాడిని పట్టుకుని గుండెల్లో పొడిచేశాడు నజరయ్య. ఆయనకేమీ జరగలేదు. జైలు వేసినా ఎవ్వరూ అతన్ని పట్టుకోలేకపోయారు. జైలు గోడల నుంచి ఆయన బయటికి రావడం వీధుల్లో తిరగటం జైలు తలుపులవద్ద భటులు నిలబడిపోవడం సామాన్య జనం చూశారు. నజరయ్య గురించి చెప్పుకునే అలాంటి కథలు జనంమీద ఆయనకున్న పట్టుని వివరిస్తాయి.

ఆయన మరణానంతరం నజరయ్య మతం పాడయిపోయింది. విగ్రహారాధన చేస్తే ఏ అపాయమూ జరగదన్నారు శిష్యులు. నైతిక నియమాలలో వాళ్ళు దారితప్పారు. బయటపడకుండా చెయ్యగలిగితే దొంగతనం ఎందుకు చెయ్యగూడదు? సారాయి, భంగు తప్పించుకోటం కష్టం. శక్తి పూజ తాలూకు అసహ్యకర రూపాలు కూడా నజరయ్య మతంలో ప్రవేశించినట్టున్నాయి.

త్రిపురాంతకంలోని మాదిగల ప్రత్యేకమైన గుడి నజరయ్య జీవితకాలంలో కట్టలేదేమోనని నా అనుమానం. కులవివక్షకి అలాంటి ప్రాముఖ్యతను ఆయన అంగీకరించే అవకాశంలేదు. ఆయన మతం మార్చి గురువుగా తయారుచేసిన తొలి శిష్యులలో ఒక మాదిగ ఉన్నట్టున్నాడు. ఆయన జనాలను మతం మార్చడానికి పంపి ఉంటాడు. నజరయ్య మతం పుచ్చుకోవడం మాదిగలకి అభివృద్ధి అని అర్థం. వాళ్ళ గ్రామాలలోని సంప్రదాయాలలోని బహుదైవత్వంకన్న నజరయ్య ఏకదైవత్వం మెరుగయినదని గ్రహించారు. ఒకతను నాతో అన్నాడు– "నేను పాపాత్ముడనని ఒక యోగి చెప్పాడు. ముక్తి సంపాదించుకోవాలన్నాడు. నేనంతకు ముందు ఎప్పుడూ అలా ఆలోచించలేదు." ఇంకో మనిషి అన్నాడు– "మా గ్రామదేవతలతోబాటు నేను విష్ణువు విగహాలను పూజించాను. రాజయోగి ప్రజలు వచ్చి దేవుడు ఒక్కడేనని, ఈ విగ్రహాలవల్ల ప్రయోజనం లేదని చెపితే నేను వారిని నమ్మాను. నేను అంతకు మునుపు విన్నవాటి అన్నింటికన్నా ఇది మంచిది." నజరయ్య మతానికి చెందటం మాదిగల సాంఘిక స్థాయిని కూడా పెంచింది. ఎందుకంటే త్రిపురాంతకంలో శిశిరంలో ఏటా జరిగే ఉత్సవంలో అన్ని కులాల తరగతులవాళ్ళతో ఒకేవరసలో నిలబడతారు.

మొత్తం కుటుంబాలు కలిసి ఆ ఉత్సవానికి వెళ్తారు. వాళ్ళతో బాటు మేకలు, కోళ్ళూ, బియ్యం, చింతపండు, కూర మసాలా తీసుకువెళతారు. ఇవన్నీ సుందరమ్మకి అర్పిస్తారు. ప్రత్యేక శ్రద్ధతో మొక్కుతారు. నజరయ్య చుట్టూచేరిన శిష్యగణంలో ఆమె చివరిది. నజరయ్య సమాధిమీద పూలు ఉంచి పూజలు చేస్తారు. సుందరమ్మ అవన్నీ తీస్కుని సామూహిక వంటకి అందిస్తుంది. వచ్చిన వారందరికి కులం ఏదైనప్పటికీ ఒకే కుండలో వండుతారు. తినేటపుడు అందరూ కూర్చుని కలిసి తింటారు. కాని మాదిగలు కాస్తంత ఓ పక్కగా కూర్చుంటారు. చివరికి నజరయ్య మతంలో కూడా శూద్రులు, మాదిగలు పక్కపక్కన కూర్చుని భోంచెయ్యరు.

మాదిగలు క్రైస్తవానికి రావటం మొదలైనపుడు నజరయ్య మతస్థులే క్రీస్తులో లభించే దివ్య జీవితానికి హృదయాలు తెరిచారు. నజరయ్యను అనుసరించినవారు క్రీస్తు శిష్యులయ్యారు. త్రిపురాంతకంలో అనుకున్నారు "మాదిగలు మనని వదిలేస్తున్నారు" కొందరు భుజాలు ఎగరేశారు– "వాళ్ళని పట్టి ఉంచటానికి మనమేం చెయ్యగలం? వాళ్ళు ఓ కొత్త మతాన్ని అనుసరిస్తున్నారు" ఇతరులు అన్నారు. "పోనీండి!". ఆ విధంగా నజరయ్య మతం చాలా మందికి అంతకన్నా ఉన్నతమైన దానికి ఎక్కేరాయిగా గుర్తుండిపోయింది.

# 2. దైవదర్శనాకాంక్ష

ఉల్లూరి వారి కుటుంబం కీర్తి నలుదిశలా వ్యాపించింది. వాళ్ళ ధనాన్ని బట్టి కాదు. గొప్ప గొప్ప పనులు చెయ్యటంలో ముందున్నందుకు కాదు. వాళ్ళ భక్తి తత్పరతే దానికి కారణం. గురువు పోలయ్యకి పదహారు రూపాయల విలువైన ఆవుని వారు యిచ్చారు. ఒక గురువుకి యిచ్చే కానుకలలో ఇది చాలా గొప్పగా భావించబడింది. మతపరమైన అంకితభావానికి ఆ కుటుంబం ఖ్యాతి సంపాదించుకుంది.

చిన్నపూడి పోలయ్య పూర్తిగా నిరక్షరాస్యుడైనప్పటికీ ఒక ప్రత్యేకమైన ఆదరాన్ని సంపాదించుకున్న మనిషి అయుంటాడు. అదే అతన్ని తతిమ్మా వాళ్ళ కన్నా భిన్నమైన వాడుగా చేసి గురువుని చేసింది. అతను ధ్యానముద్రలో ఉండేవాడు. స్వప్నాల స్వాప్నికుడు. ఓరోజు తెలివిగా ఓ ప్రశ్న లేవదీశాడు "కోటప్పకొండ స్వామి తతిమ్మా స్థలాలలోని స్వాములూ, జనం యింతగా పూజ చేస్తున్నారు గాని, మనుషులు తయారుచేసేవాళ్ళే. ఈ మనుషులు చేసిందెవరు? భూమ్యాకాశాలను చేసిందెవరు? దేవుని చూడకుండా నేను చనిపోవాలా?" అతని తండ్రి నజరయ్యను అనుసరించినవాడు. నజరయ్యను చూడటానికి అతని తండ్రి నజరయ్యను అనుసరించినవాడు. నజరయ్యను చూడటినికి అతని తండ్రి త్రిపురంతకం తీసుకువెళ్ళటం ఆ పోలయ్య తొలి జ్ఞాపకాలలో ఒకటి. బీదరికంలో సన్యాసిలా బ్రతికి ఎవరితోనయినా ఎప్పుడైనా దేముడు ఒక్కడే అన్న తన ముఖ్యసిద్ధాంతం గురించి మాటలాడటానికి సిద్ధంగా ఉండే నజరయ్యను ఆ బాలుడు పోలయ్య ఏనాడూ మరచిపోలేదు. ఆ బాలుడి మనసులో విగ్రహారాధన పట్ల వ్యతిరిక్తత, భగవంతుడిని చూడాలన్న అవిశ్రాంత కాంక్ష నజరయ్య నాటాడు.

ఉల్లూరి కుటుంబానికి గురువైన పోలయ్యకి తన ఉపచారాలలో తన అజ్ఞానాన్ని గంభీరమైన గురుత్వంలో ఎలా కప్పిపెట్టుకోవాలో బాగా తెలుసు. వాళ్ళకి మంత్రాలూ శ్లోకాలూ చెప్పేవాడు. రాజయోగి ప్రజల వేదాంతంలో ఇక్కడో ముక్క అక్కడో ముక్క నేర్చాడు. ప్రత్యేక సమయాలలో తన జ్ఞానాన్ని కొంచెం ప్రదర్శించేవాడు. అతను తనకి మించిన లోతులకి వెళ్తున్నానని తెలియగానే వెనక్కి తగ్గి ఒక రహస్యమయ వాతావరణాన్ని కల్పించేవాడు. అది సరళ స్వభావులకీ చాలా అద్భుతంగా అనిపించేది. మరోసారి యింకా ఎక్కువ చెపుతానని మాట యిచ్చేవాడు. ఆవిధంగా వారిలో కుతూహలాన్ని రేకెత్తించి తిరిగి వచ్చినపుడు ఏం చెపుతాడా అన్న కౌతుకంతో ఎదురు చూసేటట్టు చేసేవాడు.

దేముడిని చూపిస్తానని చెప్పటం తన శిష్యులకి పోలయ్య యిచ్చిన వాగ్దానాలలో వాళ్ళని పట్టి ఉంచిన వాటిలో ఒకటి. ఆ కుటుంబంలో వయసు మీదబడిన తండ్రికి దేముడికి చూడాలన్న బలీయమైన కోరిక కలిగింది. అతనంటే అందరికీ గౌరవం. కొడుకులు తండ్రి కోరికని శ్రద్ధగా పట్టించుకున్నారు. వాళ్ళు పోలయ్యను సంప్రదించారు. అతను పదిహేను రూపాయలు ఇమ్మన్నాడు. వాళ్ళు ఇది చాలా ఎక్కువ అనుకున్నారు. ఆ తాంత్రిక రహస్యాన్ని సంపాదించుకోటానికి తాను ఎన్ని పరీక్షలు ఎదుర్కొన్నదీ మైనంలా కరిగిపోయేలా అద్భుతంగా వర్ణించాడు. తన ప్రయత్నాల ద్వారా ఆకుటుంబంలో ఒక్కరు దేముడిని చూడగలిగితే మొత్తం కుటుంబానికి నిస్సందేహంగా ముక్తి దొరుకుతుందని నొక్కి చెప్పాడు. చివరికి పోలయ్య పదకొండు రూపాయలకి ఒప్పుకున్నాడు. ఆ ప్రయత్నం చేసే రాత్రి నిశ్చయమయింది.

పదిమంది ఆడామగా దేముడిని చూడాలన్న కాంక్షతో విశ్వాసంతో అర్ధరాత్రి వేళ ఉల్లూరి వారి ఇంటిలో కూర్చున్నారు. గోడకున్న గూటిలో రెండు చిన్న నూనె దీవం బుడ్లు వెలుగుతున్నాయి. అక్కడ కొద్దిపాటి వెలుతురిని యిస్తున్నాయి. గురువు మధ్యలో కూర్చున్నాడు. శిష్యులు చుట్టూ వృత్తాకారంలోకూర్చున్నారు. నజరయ్య మతం తాలూకు మంత్రాలు చదువుతూనే ఉన్నాడు. అతని హడావుడి భయంకరంగా ఉంది. చూస్తున్న వాళ్ళంతా ఊపిరిబిగబట్టారు. కదలకుండా ఉండిపోయారు.

చిట్టచివరికి ఆ క్షణం వచ్చేసింది. అందరినీ పొమ్మని సంజ్ఞ చేశాడు. ఆ ముసలతనిని మాత్రం కూర్చోమన్నాడు. మరిన్ని మంత్రాలు చదివాడు. మరిన్ని విచిత్రమైన బొమ్మలు గీశాడు. ముసలతను ముక్కు చెవులూ, కళ్ళు మీద అంతకు ముందు పోలయ్య చెప్పినట్టుగా వేళ్ళు పెట్టుకున్నాడు. బాహిర ప్రపంచంతో ఆ విధంగా సంబంధాలు తెంచుకుని అంతరేంద్రియంతో భగవంతుడిని చూడాలని అతనికి అర్ధమయ్యింది.

కొంత సమయం గడిచింది. పోలయ్య చెవిలో గొణిగాడు. నీకేమైనా కనిపిస్తోందా అని.

"అంతా ఎర్రగా పచ్చగా కనిపిస్తోంది. మధ్యలో ఏదో మనిషి బొమ్మ ఉన్నట్టు కనిపిస్తోంది" అన్నాడు ముసిలతను.

"అదే దేవుడు. నువ్వు చూశావు" అన్నాడు పోలయ్య

ఆశ్చర్యంతో సంభ్రమంతో ముసిలాయన పిల్లలని కలిశాడు. మనవలు చుట్టూ ఆడుకుంటుండగా ఇంటి పట్టున కూర్చుని, అనేక రోజులు దాని గురించే ఆలోచించాడు. జనం వస్తున్నారు. వెళుతున్నారు. అంతా ఎలా కనిపించిందీ చెపుతున్నాడు. ఆ ముసిలాయనకి అదో గొప్ప తృప్తిని కలిగించే విషయమయింది. అంతా డబ్బులు ఖర్చుపెట్టినందుకు పిల్లలు విచారించలేదు.

కొన్నేళ్ళు గడిచాయి. పశిగోపు బసయ్య తన తోలువని పరికరాలను పదునుపెట్టించుకోటానికి ఒకరోజు మదులూరు వచ్చాడు. అతను ఉల్లూరి వాళ్ళ కుటుంబానికి స్నేహితుడు. ఇంటికి బయల్దేరే ముందు వాళ్ళని చూడటానికి వెళ్ళాడు. అదీ యిదీ మాట్లాడుకుంటున్నారు. కొత్త మతాన్ని ఒక దొర ఒంగోలుకి తీసుకువచ్చాడు. విన్నారా అని అడిగాడు. దాన్నంతా మంచి మతం అనుకుంటున్నారు. అని చెప్పాడు. వివరాల కోసం వాళ్ళు అడిగారు కాని బసవయ్య వాళ్ళకి తృప్తి కలిగించలేకపోయాడు. ఈ మతాన్ని నమ్మినవాళ్ళని జీసస్ క్రీస్తు రక్షిస్తాడు, ఆయనే పూజించాలి, మిగిలిన స్వాములు అందరూ తరువాతే అని మాత్రం బసయ్య విన్నాడు. అంతేకాక అనేకమంది ఈ మతం పుచ్చుకున్న మాదిగలు ఆదివారం పనిచెయ్యరు. చచ్చిన గొడ్డు మాంసాన్ని వాడలోకి తీసుకురారు అని ఓ వెట్టి బసయ్యతో చెప్పాడు.

బసయ్య ఇంటికి వెళ్ళిపోయాడు. ప్రయాణంలో అలసిపోయిన ఓ మనిషి అతని ఇంటివద్ద చెట్టుకింద కూర్చుని ఉండటం కనిపించింది. అతను మాదిగల పెద్ద గురించి అడిగాడు. వస్తాడని చెప్పారు. మాదిగల పెద్దగా బసయ్య కొత్తవాళ్ళని ఆహ్వానించటం, వాళ్ళ కష్టసుఖాలు విచారించటం, తన పెద్దరికంతో ఏదైనా సాయం కోరితే చెయ్యటం అతని విధులు తన ఎదురుగా ఉన్న బద్దేపూడి కన్నయ్య క్రైస్తవుడని తెలుసుకుని చాలా సంతోషించాడు. అతని అవసరాలు చూశాడు. కన్నయ్య బాధ్యత అంతా తీసుకున్నాడు. క్రైస్తవ ప్రచారానికి భారతీయ గ్రామీణ సమాజంలోని తెగ పద్ధతి ఆ విధంగా ఒక వాహిక అయింది. మర్నాడు మదులూరికి వెళ్ళారు. అతిథులుగా వారిని ఆదరించారు. కన్నయ్య ఎందుకొచ్చిందీ బసయ్య చెప్పాడు. అతను చెప్పేది వినటానికి ఒప్పుకున్నారు.

ఆ వేళ ఎక్కువేం చెప్పలేదు. వచ్చినవాళ్ళు వెళ్ళాక ఈ మతం గురిచి మళ్ళీ వినటానికి వాళ్ళని మళ్ళీ పిలుద్దామనుకున్నారు. అలాగే పిలిచారు. ఇద్దరు మనుషులు వెళ్ళి పిలిచారు కన్నయ్య వచ్చాడు. అతనికి ఆ రోజు, మంచి అవకాశం దొరికింది. అందరూ వినటానికి సిద్ధమయ్యారు. పిల్లలు పడుకున్నారు. కుక్కలు మాత్రం అప్పుడప్పుడు రాత్రి శబ్దాన్ని బద్దలు చేస్తున్నాయి. క్రీస్తు మరణగాథ విన్నారు. క్రైస్తవుల పద్ధతిలో కన్నయ్య ప్రార్థించాడు. ఇలాంటిది వాళ్ళంతకు ముందు ఎప్పుడూ తెలియదనుకున్నారు. “మనమెందుకు ముందుకు వెళ్ళకూడదు? మనం చేస్తున్న దానిలో ఎలాంటి ముక్తీ లేదు? అనుకున్నారు. ఆ తర్వాత రోజులలో.

ఉల్లూరి వాళ్ళ కుటుంబంలో చిన్నవాళ్ళు తోటివాళ్ళతో ఈ కొత్తమతం గురించి చర్చించారు. దోవన పోతున్న వెట్టివాడు మదులూరిలో విచిత్రాలు జరుగుతున్నాయని చెప్పాడు. ఉల్లూరి వాళ్ళ ముసలి తండ్రి ఆ విషయాలను ఆలోచించి పట్టించుకోమని సలహా యిచ్చాడు. వాళ్ళకి దైవభక్తి ఉందని గుర్తుచేశాడు. త్రిపురాంతకంలో నజరయ్య సమాధిని చూడటానికి కుటుంబమంతా వెళ్ళలేదా? బియ్యమూ, మేకా యివ్వలేదా? పాటలు పాడుతూ నజరయ్య సమాధిమీద పూదండలుంచలేదా? పూజలకి పోలయ్య గురువుకి ఆవుని యివ్వలేదా? అన్నింటికన్నా కొన్నేళ్ళక్రితం అర్ధరాత్రి తమ తండ్రికి దేముడుని చూపించలేదా?

అంతేకాక ఈ మాదిగ కుటుంబపెద్దకి ఉక్కమ్మ అనే కూతురు ఉంది. ఒక ప్రత్యేకమైన ప్రేమాదరాలతో ఆమెను చూసుకునేవాడు. పదేళ్ళ వయసులోనే ఆమె విధవ అయింది. ఆర్య హిందూ ఆచారాలని అనుసరిస్తూ పసితనంలోనే వాళ్ళకి బాగా తెలిసిన కుటుంబంలోని ఓ యువకుడికి యిచ్చి పెళ్ళిచేశారు. అత్తారింటికి పంపే రెండో కార్యక్రమం జరగలేదు. బ్రాహ్మణ విధవలాగే ఈ చిన్న మాదిగ కన్య మళ్ళీ పెళ్ళాడరాదు. మాదిగల పద్ధతికి అది చెందకపోవచ్చు. రెండుసార్లు పుట్టే బ్రాహ్మణులను అనుసరించటం మంచిదనుకున్నారు.

ఏళ్ళు గడుస్తున్నాయి. ఉక్కమ్మ నజరయ్య శిష్యులు చెప్పిన మత విధులలో మునిగిపోయింది. ఆమతం పాటలని పాడటాన్ని తల్లిదండ్రులు ప్రోత్సహించారు. ఆమెకి తోడుగా వెళ్ళేవారు. క్రమంగా ఉక్కమ్మకి నలభై ఏళ్ళు వచ్చాయి. ఆ ఊరు ఈ ఊరు పాడటానికి ఆడటానికి పిలిచేవారు. ఆమెని చాలా గౌరవించేవారు. “ ఆమె అందరు ఆడాళ్ళలాంటిది కాదు. భగవంతుడిని సేవిస్తోంది” అనుకునేవారు. కొన్నాళ్ళకి ఆమె వేలు విడిచిన సోదరి కూడా భర్తని కోల్పోయింది. ఇద్దరు ఆడవాళ్ళు అప్పటినుంచి కలిసి తిరుగుతుండేవారు. వాళ్ళు ఏ వూరు వెళ్ళిపాడినా ఉట్టి చేతులతో పంపేవారు కాదు. వాళ్ళ చేతుల్లో డబ్బు పోగయింది. కొంత నజరయ్య గుడికి యిచ్చారు. కొంత తల్లిదండ్రులకు యిచ్చారు.

ఉక్కమ్మ దూర గ్రామంలో ఉండి కుటుంబంలో అందరికన్నా దైవభక్తి గలది కనుక ఏ ముఖ్యనిర్ణయం తీసుకోవాలన్నా ఆమెను సంప్రదించాలని తండ్రి గట్టిగా చెప్పాడు. ‘పెద్ద కొడుకు కొండయ్యకు ఆ తర్వాత రోజులలో నిద్రపట్టలేదు. “ ఉక్కమ్మ రావటంలేదు. నేనే వెళ్తాను. అన్నాడు. రెండు రోజులు ప్రయాణం చేశాడు. అక్క కళ్ళు మెరిసాయి. “ ఇంటి దగ్గర అందరూ బాగున్నారా”? అని అడిగింది. ఆ వాడ వాళ్ళందరికీ తన తమ్ముడు వచ్చాడని చెప్పింది. మాదిగ పెద్ద భార్య ఇత్తడి గ్లాసులో మజ్జిగ యిచ్చింది. సేదదీరాడు.

అక్కా తమ్ముడూ కూర్చుని మాట్లాడున్నారు. అక్క వ్యతిరేకించదని కొండయ్యకి తెలిసిపోయింది. “ ఈ మతం గురించి విన్నాను. మన నజరయ్య చెప్పిందీ దేవుడు ఒకడేనని. అది సత్యం. కాని మనం తప్పు చేశాం. విగ్రహాలను పూజిస్తున్నాం. నీకు ఒంగోలుకి వెళ్ళాలనిపించటం మంచిదే. నా కోసం చూడకు. వెంటనే వెళ్ళు. తొందరలోనే నేను యింటికి వస్తాను. నేను కూడా జీసస్ క్రీస్తుమీద విశ్వాసాన్ని ప్రకటిస్తాను. అంది ఉక్కమ్మ. ఉక్కమ్మ మాటలు కొండయ్య ఇంటికి వచ్చి చెప్పాడు. అందరూ తృప్తిపడ్డారు. పాతది వదిలేసి కొత్త జీవితంలోకి ప్రవేశించే సమయం వచ్చిందన్నారు.

ఆ కుటుంబంలో మార్పులు వ్యాఖ్యానాలకు గురవకుండా ఉండవు. వారి కుటుంబం అంత ప్రసిద్ధమైనది. శూద్రులకు వాళ్ళమీద కోపం వచ్చింది. ఆదివారం నాడు పిలిస్తే. ఈ రోజున జరుగుతున్నట్టు. రామని ఉల్లూరి వాళ్ళ కుటుంబం అంతకుముందు ఎన్నడూ అనలేదు. క్రైస్తవుల సంఖ్య పెరుగుతోంది. అందరూ ఒకేరకంగా ధిక్కరిస్తున్నారు. అంతకుముందు ఎన్నడూ వాళ్ళ పాలేర్లలో శూద్రులు అలాంటివి చూడలేదు. "వాళ్ళకి పాఠంవ చెప్పాలి" అనుకున్నారు.

అవి నూర్పిళ్ళ రోజులు. కొందరు క్రైస్తవులు దమ్ముల్లోనూ, నాట్లలోనూ పనిచేశారు. పాత ఆచారాల ప్రకారం వాళ్ళ వంతు ధాన్యం తీసుకోవటం వాళ్ళ హక్కు వాళ్ళకి పాఠం చెప్పటానికి శూద్రులు ఆదివారం రోజునే మార్చారు. ఆ రోజు పనిలోకి రాకుండా ఉండిపోయారు క్రైస్తవులు. ఆ విధంగా వాళ్ళకి చాలా నష్టం వాటిల్లింది.

ఓ ఆదివారం రోజున శూద్రులందరూ పనుల కోసం పొలాలకు వెళ్ళారు. ఊళ్ళో కొంతమందే ఉన్నారు. పాలు కాచటానికి మునసబు ముసలి తల్లి నిప్పు ముట్టించింది. అలా పక్కకి వెళ్ళేసరికి పక్కనే ఉన్న చిట్టు తట్ట అంటుకుంది. పొలాల నుంచి జనం వచ్చేసరికి పది ఇళ్ళు కాలిపోయాయి. క్రైస్తవులకి నష్టం కలిగించటానికి ఆదివారం నాడు నూర్చిన ధాన్యమంతా కాలిపోయింది. దాక్కోటానికి ముసలమ్మ పారిపోయింది. తిరిగి వచ్చి గుండెలు బాదుకుంది. "దేముడు మనలని శిక్షించాడు" అంది. అంతకు ముందు క్రైస్తవుల మీద చాలా కఠినంగా ఉండేది. దైవం యిచ్చిన ఈ తీర్పుకి ప్రధాన కారణం తనే అనుకుంది. వివాదం ముగిసింది. అప్పటినుంచి శూద్రులు ఆదివారాలలో చిన్న చిన్న పనులు చేసుకుని ముఖ్యమైన పనులు క్రైస్తవులు తమతోచేరినపుడు చేసుకోసాగారు.

గ్రామదేవత పండగ చేసుకోటానికి శూద్రులు అన్ని ఏర్పాట్లు చేసుకుని మాదిగలకి దేవతా విగ్రహం ముందు డప్పుకొట్టమని, నాట్యం చెయ్యమని కబురుపంపారు. ఇది అనాదిగా వస్తున్న పరస్పర సహకారపద్ధతిలో మాదిగలు నిర్వహించవలసిన విధి. వాళ్ళు ఇప్పుడు రామన్నారు. శూద్రులకి మళ్ళీ ఆగ్రహం కలిగింది.

వాళ్ళు మాదిగలకి కబురుపంపారు. "అయితే మీ అంతట మీరుండండి. మా అంతట మేం ఉంటాం. మీరు మాకు పనులు చెయ్యనక్కరలేదు. మీరు మాకు వద్దు."

శూద్రులు అనుకున్నంత సులువుకాలేదు బరువులు మొయ్యటం, క్రైస్తవులు కాని మాదిగలు కూడా ఓ విధమైన సంఘీభావనతో తమవాళ్ళు నిరాకరించిన పనులను తామూ చెయ్యమన్నారు. ఏదో కొద్దిమంది పనికిమాలిన వాళ్ళు వెళ్ళారు. దాంతో శూద్రులు రాజీ పడదామన్నారు.

ఉల్లూరు వాళ్ళ కుటుంబానికి చాలా కుటుంబాలతో సంబంధాలు ఉన్నాయి. గురువు పోలయ్య కూడా ముక్తి మార్గానికి క్రైస్తవుడవటమే మార్గమని సలహా యిచ్చాడని అందరికీ తెలిసింది. ఈ మార్పు తాలుకు ప్రాధాన్యత ఆ కుటుంబాలలో దూరం వాళ్ళు గ్రహించలేరు. వాళ్ళు గురువులు మాత్రం మారారని, మాదిగలలో పురాతన సంప్రదాయాలను వారు ముట్టుకోలేదని అనుకున్నారు.

పదిమైళ్ళ దూరంలోని ఓ కుటుంబం నించి పేరంటారు పండగకి రమ్మని కబురొచ్చింది. "మేం క్రైస్తవులం. పేరంటాలుతో మనమేం చెయ్యగలం" అన్నారు చాలామంది.

"గోడమీద ఆ చిహ్నాల గురించి మనం ఏమనుకుంటున్నదీ వెళ్ళి చెపుదాం" అన్నారు ఇతరులు.

వెళ్ళారు. గోడమీద పేరంటాలు చిహ్నాలని చెరిపేస్తేనే వండిన వంటలను ముట్టుకుంటామన్నారు.

అందులో ఒకడు బలహీనంగా అన్నాడు. "ఇంతవరకూ ఎవరు ఎందులో చేరినా తేడా ఏమీ లేకుండా పేరంటాలుని పూజించేవారు. క్రైస్తవం వాటికన్న భిన్నమయినదా?"

వాదనలు నడిచాయి. మధ్యలో ఒకడు లేచి కావాలంటే నా చెప్పులతో పేరంటాలు తాలూకు పసుపుబొట్లు, ఎర్రబొట్లు చెరిపేస్తానని ముందుకొచ్చాడు. అది జరిగింది. గొడవ చల్లారింది. ఆ కుటుంబం తాలూకు పురాతన స్త్రీ పూర్వీకురాలుకి పెట్టకుండా విందు జరిగింది.

"మనకావిడ ఏం మంచి చేసింది? ఏ పాపం తొలగించింది? మనకి కావలసినది దేవుని ఆశీర్వచనాలు" అన్నారు. వచ్చిన వాళ్ళలో ఒకరు.

మరో కుటుంబ శాఖ ఏటా చేసే నాగరప్పమ్మ పండగకి తయారవుతోంది. వాళ్ళు నాగులని పూజిస్తారు. పడగపట్టిన పాముని స్త్రీ రూపంలో పూజిస్తారు. పురాతనమైన సర్పరూప పూజశక్తి పూజల కలయిక అది. పొలాల్లో చీమల పుట్టల్లో పాములు నివాసముంటాయి. ఏడాదికోమారు నాగరప్పమ్మ పండగ జరుగుతుంది. పాము నివాసాలుగా భావించే చీమ పుట్టల మీద నీళ్ళు పోస్తారు. అన్నం పుట్ట ముందు పెడతారు. పాలు కన్నాల్లో పోస్తారు. ఆ చీమల పుట్ట పాము గుర్తులున్నా లేకపోయినా పూజలు చేస్తారు. భక్తులు తృప్తిగా వెళ్ళి విందు చేసుకుంటారు. నాగరప్పమ్మ వాళ్ళ పూజలను స్వీకరించిందని నమ్ముతారు.

పేరంటాలు చిహ్నాలకు జరిగింది తెలిసి నాగరప్పమ్మ పండగని మానెయ్యడం మంచిదనుకున్నారు. వాస్తవానికి ఆ పండగ మళ్ళీ జరగలేదు. క్రైస్తవం ఎంత తొందరగా వ్యాపించిందంటే దానికి పూర్వంవి అన్నిటినీ తుడిచేసింది.

ఆ కుటుంబాల్లోని ఎల్లమ్మ భక్తులు కూడా ఇంట్లో ఎల్లమ్మ గృహాన్ని కప్పునించి వేళ్ళాడే కుండనీ, చిహ్నప్రాయమైన గుల్లలనీ ఉంచుకోటానికి సిగ్గుపడ్డారు. ఆ ప్రాంతంలోని మాతంగి మాత్రం తన కోపాన్ని దాచుకోకుండా చూస్తూ ఉండిపోయింది.

బడులు మొదలయాయి. తెలివైన పిల్లలిని చదువులకి ఒంగోలు పంపారు. నజరయ్య మతస్థులు ప్రత్యేకించి ఒకరి తర్వాత ఒకరు మాదిగలని క్రైస్తవులుగా మార్చే ఉద్యమంలోని ముఖ్యకేంద్రాలలో గొప్ప సేవ చేశారు.

# 3. తల్లి శాపం

కొమ్ము పున్నయ్య అనే యువకుడు ఉత్తరాదికి తోళ్ళ వర్తకం కోసం బయలుదేరేముందు తిరిగొచ్చాక సుబ్బమ్మ అనే పిల్లని పెళ్ళాడ్డానికి నిశ్చయించుకున్నాడు. ఆమె పదమూడేళ్ళ అందాల బొమ్మ. దూరం చుట్టం కనుక తరచు చూసేవాడు. ఈ మధ్యకాలంలో ఆచారం ఒప్పుకోదు గనుక మాట్లాట్టానికి సాహసించలేదు.

అతను వాళ్ళ కుటుంబంతో మాట్లాడాడు. పెళ్ళికి ఒప్పుకున్నారు. ఓ రోజు ఆ పిల్ల బామ్మతో మాట్లాడుతున్నాడు. సుబ్బమ్మ తలుపు వెనుక ఉందని తెలుసు. ప్రతీమాటా వింటోందని తెలుసు. '' ఒక్క ఏడాదిలో తిరిగొస్తాను. నా చేతుల్లో డబ్బులుంటాయి. నేను లేనప్పుడు సుబ్బమ్మకి పెళ్ళి చెయ్యకండి'' అన్నాడు. ముసలమ్మ ''అలానే నువ్వు వచ్చాక నీకే పెళ్ళాం అవుతుంది'' అంది. తలుపు వెనక ఏదో కదలిక. ముహాన్ని చేతుల్తో కప్పుకుని సంతోషంతో ఉందని పున్నయ్య గ్రహించాడు.

ఓ ఏడు కాదు. అయిదేళ్ళు గడిచాయి. ఎవరైనా మాదిగ తన తోళ్ళ బళ్ళతో ఊరికి తిరిగి వెళ్తున్నారని తెలియగానే సుబ్బమ్మ మామ్మకి కబురుపంపేవాడు. తను బానేవున్నానని, యింటికి తిరిగిరాగానే సుబ్బమ్మని పెళ్ళాడుతానని కబురు పంపేవాడు.

పున్నయ్య నజరయ్య మతస్థుడు. ఉత్తరాదిన అతనితోనే ఉండే శేషయ్యది కూడా అదే మతం. దార్ల ఎల్లయ్య అనే మాదిగది కూడా అదే వ్యాపారం. అతను ఆరునెలలకు ఓ సారి వచ్చేవాడు. పున్నయ్య శేషయ్య కొన్న తోళ్ళను బేరం చేసేవాడు. ఎల్లయ్య క్రైస్తవుడు. ముగ్గురూ కూర్చుని వాళ్ళ మతాల గురించి మాట్లాడుకునేవారు. ఎల్లయ్య క్రైస్తవ పాటలు పాడితే వాళ్ళిద్దరూ నజరయ్య పాటలు పాడారు. కాని క్రైస్తవ పాటలని నేర్పమన్నారు.

నజరయ్య మతం తాలూకు అన్ని రకాల ఆచారాలు పూజలూ ముందుగా వదిలెయ్యాలన్నాడు. నిజమైన దేవుడిని మాత్రం పూజించాలన్నాడు. ఇదెలాగవుతుందని వాళ్ళు అడిగారు. ఆ సమయానికి ఓ నది ఒడ్డున ఉండటం జరిగింది. ఎల్లయ్య భుజం మీద తువ్వాలు తీసి నేలమీద పరిచాడు. వాళ్ళని తనతోబాటు మోకరిల్లమన్నాడు. "నేనే నా తండ్రియైన దేమునితో మాట్లాడతాను" వినమన్నాడు ఆరోజు వాళ్లని వదిలేముందు టెన్ కమాండ్‌మెంట్స్ చెప్పాడు. అతను వెళ్లిపోయాక వాళ్ళు అనుకున్నారు. "మనం నజరయ్య పాటలని పాడుకోవచ్చు. అయితే ఎల్లయ్య చేసినట్టు ప్రార్థిస్తే మంచిది".

ఎల్లయ్య అటు వెళ్ళినపుడు వాళ్ళకి యింకా యింకా బోధించాడు. కొన్నాళ్ళకు వాళ్ళు అనుకున్నారు. "మనం సారా మానేద్దాం. చచ్చిన గొడ్డుమాంసం తినొద్దు" వాళ్ళు తోళ్ళ బేరం కుదుర్చుకున్న మాలలకు కోపం వచ్చింది. "మీరు మాదిగలలా ఉండటంలేదు.. చచ్చిన గొడ్డుమాంసం తినటంలేదు. మీరు క్రైస్తవులు" అన్నారు. చేసుకున్న ఒప్పందాన్ని తిరస్కరించారు. పున్నయ్య చేతిలో ఎలాంటి రుజువూ లేదు. మదుపు పెట్టినదంతాపోయింది. ఆ తరువాత అతను నేరుగా కొన్నాడు. ఒప్పందంలో మిగిలినంత మిగలలేదు.

పున్నయ్య ఇంటికి వచ్చాడు. పెళ్ళాడాడు. సంసారంలో స్థిరపడ్డాడు. ధనవంతుడయ్యాడు. అతను కాస్త చదవనేర్చిన మనిషిని పట్టుకుని చదువు నేర్పమన్నాడు. అతని ద్వారా ఒంగోలుకి ఓ దొర వచ్చాడని విన్నాడు. వెళ్ళి చూడాలని నిశ్చయించుకున్నాడు. మేకతోళ్ళు ఓ బరువు వేసుకుని అమ్మకానికి ఒంగోలు బయలుదేరాడు. మిషన్ వాకిలిలో అడుగుపెట్టగానే పెంటయ్యను కలిశాడు. చెట్లకింద కూర్చుని కబుర్లు మొదలెట్టాడు. పెంటయ్య అమ్ముతున్న చిన్ని చిన్ని పుస్తకాలమీద ఆసక్తి కలిగింది. పుస్తకాలంటే పున్నయ్యకి ఆకర్షణ. కొన్నేళ్ళ తరవాత అతను క్రమబద్ధమైన బోధకుడు అయ్యాక అతను అనేక తెలుగు గ్రంథాలు పుస్తకాలు సేకరించాడు. అతని దగ్గర పుస్తకాలు కొన్నే ఉండటం తెలుగు క్రైస్తవ సాహిత్యం తగినంతగా లేకపోవడాన్ని సాక్ష్యం. కాని పున్నయ్యకి తన లైబ్రరీ అంటే చాలా గొప్ప. ఎవరయినా వచ్చి చూసేలోగానే తెల్లచీమలు వచ్చి మొత్తం తినేశాయి. తర్వాత అతను ఒక మిషన్ కుటుంబం నుంచి కొద్ది రూపాయలకు, ఒక "మాంసం పెట్టె (Meat-Safe)" కొన్నాడు. దానిలో తెల్లచీమలు ఏరవు. అతను నాకు వివరించాడు. "చుట్టూ ఇనప కిటికీలు ఉంటాయి". దాని ద్వారా నాకు అది తీగచిక్కం (Wire-netted) అని అర్థమయింది. ఆహారానికి చీమలూ దోమలూ పట్టకుండా ఉంచే ఆ పెట్టెలో తన కొత్త గ్రంథాలయం భద్రంగా ఉంటుందని పున్నయ్య అనుకున్నాడు. పుస్తకాలమీద ప్రేమతో పున్నయ్య వెంటనే ఆ పుస్తకాలు తీసుకువెళ్ళి తన తోళ్ళ అమ్మకంతోబాటు పెంటయ్య కోసం అమ్మిపెడతానన్నాడు. ఇద్దరూ బంగ్లాకి వెళ్ళారు. దొరకి పెంటయ్య పరిచయం చేశాడు. క్రైస్తవునిలా జీవిస్తున్నాడని చెప్పాడు. పుస్తకాలు అమ్మటానికి ఒప్పుకున్నాడని చెప్పాడు. ఒంగోలు స్కూలుకి రమ్మన్నాడు దొర. సరే అన్నాడు.

వ్యాపార నిమిత్తం వచ్చి వెళ్లినపుడల్లా పున్నయ్యని స్కూలుకి రమ్మంటూనే ఉన్నారు. అస్తమానూ వస్తానవేవాడు కాని అతని వ్యాపార ప్రవృత్తి బలమైనది. డబ్బు సంపాదన ప్రయత్నాలలో రాటానికి సంకోచించాడు. ఒకరోజు మేకతోళ్ళ బండి బరువుతో ఒంగోలు వచ్చాడు. మామూలుగా దొరని చూడటానికి వెళ్ళాడు.

' ఎలా ఉన్నావు పున్నయ్యా?"

తెలుగు వాళ్ళకి సాధారణమైన విధంగా తల ఊపి బానే వున్నాను అని అన్నాడు పున్నయ్య.

"ఈసారి ఎంత డబ్బు వచ్చింది?"

"ముప్పై రూపాయలు" నడుముకి కట్టుకున్న మూట విప్పి వెండిని చూపించాడు. దొర అతని చేతులు పట్టుకుని ఆ డబ్బులు తీసేసుకుని అన్నాడు. "నువ్వు మాట మారుస్తున్నందుకు యిది ఫైన్. నాలుగుసార్లు స్కూలుకి వస్తానన్నావు. రాలేదు. సలాం" అని దొర బంగ్లాలోకి వెళ్ళిపోయాడు.

పున్నయ్య వెళ్ళలేదు. బయట నిలబడి దొర లోపల తిరుగుతూండటం గమనించుతున్నాడు. రెండుసార్లు తలుపు తీసి "ఎందుకు వెళ్ళటం లేదు" అని అడిగాడు.

"నాకు నా డబ్బు కావాలి"

చిట్టచివరికి దొర పిలిచాడు. భుజం మీద చెయ్యేశాడు. మృదువుగా కదిపాడు. దాదాపు ఆ యువకుడు పడిపోయినంత పనయింది. కాని అది అతనికి అమితమైన ఆనందం యిచ్చింది. "ఇదిగో నీ డబ్బు. స్కూలుకి వస్తావా"?

"వస్తాను".

కాని దొర తన భోధకుడిని పిలిచాడు "జొనాధన్! ఈ యువకుడు నాతో నాలుగుసార్లు అబద్ధమాడాడు. ఇప్పుడతను స్కూలుకి వస్తానంటున్నాడు. అతను రాకపోతే నువ్వే సాక్ష్యం. నువ్వు ఇతన్ని తీసుకొచ్చి నాకు అప్పగించాలి. పేరు రాసుకో! అన్నాడు. జోనాధన్ పేరు రాసుకున్నాడు. పున్నయ్య యింటికి వెళ్ళాడు.

ఆ తర్వాత పున్నయ్యకి శాంతి లేకపోయింది. పశువులు అమ్మేశాడు. అంతా సిద్ధం అయాక ఒంగోలుకి బయలుదేరాలనుకున్నాడు. భార్య సుబ్బమ్మ "నేను రాను" అంది. సుబ్బమ్మ చాలా అందమైన యువతి ఇప్పుడు. మెడలో నల్లపూసలు, చేతులకి గాజులు ఆమెకి ఇష్టం. వాళ్ళకి పెళ్ళయినప్పుడు ఆచార ప్రకారం మాదిగ దాసరి ధాన్యం రాశి మీద ఉంచిన తాళిబొట్టు తీసి పున్నయ్య చేతికి యిచ్చి సుబ్బమ్మ మెడలో కట్టించాడు. తాళిబొట్టు బంగారంది. ఆమె యితర నగల్లో వెండీ, బంగారం తక్కువకాని చూడటానికి బానే ఉండేవి.

మొదట మతంపుచ్చుకున్న ఆడవాళ్ళు దొరసాని గాజులు మంగళసూత్రాలు వేసుకోకపోవటం చూసి ఇవి లేకపోవటం క్రైస్తవ మతంలో భాగమయుంటుందని తొలి రోజులలో భావించినట్టు కనిపిస్తుంది. బంగారపు తిమ్మయ్య భార్య సత్యమ్మ గాజులని పగలగొట్టింది. వాళ్ళు వెళ్ళిన చోటల్లా 'రాజయోగి మతం వెండి రింగులు వేసుకోమంది. వేసుకున్నాను. అయితే యిప్పుడు ఏమీ లేదు" అని బోధించేవారు.

ఆడవాళ్ళు వేసుకునే గాజులు కేవలం నగలు కాదు. వేసుకున్నావిడ విధవ కాదు అని తెలియజేస్తాయి. బ్రాహ్మణులలో మగవాడు చనిపోతే విధవరాలి నగలన్నీ తీసేస్తారు. ఒక్కోమారు క్రూరంగా కూడ వొలిచేస్తారు. రెండుసార్లు జన్మించే ఆర్యుల ఈ ఆచారాన్ని మాదిగలు తప్పనిసరిగా అనుకరించి ఉంటారని నేను అనుకొంటాను. మాదిగలు విధవరాలిని కొత్తగా చేసిన భర్త సమాధి వద్దకి తీసుకువెళతారు. ఓ కర్రతో ఆ గాజులని పగలగొడతాడు. మాదిగ దాసరి.

మిషన్ కొత్తగా వచ్చిన రోజులలో ఒక బోధకుని భార్య తనకు బాగా తెలిసిన గ్రామానికి వెళ్ళింది. ఆమె చేతులకు గాజులు లేవు. అక్కడ ఆడాళ్ళు పో అన్నారు. "మీ దేముడు మాకు అవసరంలేదు. నువ్విక్కడ ఉన్నపుడు నీకు భర్త ఉన్నాడు. ఇప్పుడు నీ చేతులు చూడు గాజులు పోయాయి. నీ కొత్త దేముడు నీకు చేసినది ఏమిటి?" ఆ తరువాత మిషనరి అతని భార్య ఆడవాళ్ళని గాజులు ఉంచుకోమన్నట్లు కనిపిస్తుంది. ఇందులో ఒక సాంఘిక ఆచారం ఉంది కనుక దానిలో కలగజేసుకోటం తగదనుకున్నారు.

పున్నయ్య భార్య సుబ్బమ్మ ఇది వినే వుంటుంది. నగలు లేకుండా రానంది. ఒంగోలుకి తనతోబాటు తీసుకువెళ్తున్నట్లు ఆమె తల్లికీ, బామ్మకి తెలియకుండా చూసుకున్నాడు పున్నయ్య. ఒక్కడే వెళ్ళాడు. ఆరు నెలల తర్వాత సుబ్బమ్మ కోసం వచ్చాడు. తల్లీ, బామ్మ ఏడ్చారు. ఊళ్ళో గొడవ చేశారు. అంతా అన్నారు. "అది దాని మొగుడితో వెళుతూంది. అందులో గొడవేముంది"? నేను వెళ్తున్నాను అంది సుబ్బమ్మ ఒంగోలుకి పదిమైళ్ళ దూరంలో ఓ చెట్టు కింద కూర్చున్నాక కాళ్ళకి మట్టెలు, దండ కడియాలు సత్తుతో చేసినవి "ఇవి ఒంగోలులో బాగుండవు" అన్నాడు. సుబ్బమ్మతో పున్నయ్య 'తీసెయ్యి' అంది ఆమె. గాజులు ఉంచుకుంది. దొర, దొరసానిలకు సలాం చేయించాడు. పున్నయ్య. 'చాలా మంచి అమ్మాయి' అన్నారు వాళ్ళు.

ఏళ్ళు గడిచాయి. పున్నయ్య బాధ్యతలను మోయగలడదు గనుక బోధకుడయ్యాడు. సుబ్బమ్మ చిన్న చిన్న పిల్లలని ఆమె తల్లి చూసుకునేది. వాళ్ళిద్దరూ ఆరంభించిన స్కూలులో సుబ్బమ్మ పాఠాలు చెప్పేది. ఓ రోజు కొల్లుం రామయ్య ఒక ఆపదలో వాళ్ళ దగ్గరికి వచ్చాడు. అతను క్రీస్తుని నమ్ముతున్నాడు కాని కుటుంబమంతా వ్యతిరేకిస్తోంది.

పున్నయ్య అతని ఊరు వెళ్ళాడు. అతను ఆతిథ్యం యిచ్చాడు. పున్నయ్య ఊళ్ళోకి ఎక్కడికి వెళ్ళినా బియ్యం దంచుతున్న ఆడాళ్ళతోనూ ఆటల్లో ఉన్న పిల్లలతోనూ మాట్లాడుతూంటే రామయ్య అంటిపెట్టుకుని ఉండేవాడు. కోడిని కొయ్యమని ఆ సాయంత్రం పెళ్ళానికి చెప్పాడు. 'ఈ మనిషి, మనకి చుట్టమా అంత విందు చెయ్యడానికి' అని ముసిలావిడ అనటం విన్నాడు. రామయ్య ఆ రాత్రి కొబ్బరి నూనెదీపం వత్తి తగ్గించి గాలి ఆర్పేయకుండా గూట్లో ఉంచాడు. తతిమ్మా వాళ్ళు నిద్రోయారు. తెల్లారీదాకా రామయ్య పున్నయ్య కొత్త మతం గురించి మాట్లాడుకున్నారు. "నేను జీసస్ క్రీస్తుని నమ్ముతాను. ఇంతవరకూ నేను చేసినవన్నీ వ్యర్థం" అన్నాడు రామయ్య.

రామయ్య భార్య అతనివేపే ఉంది. లేకపోతే కుటుంబంలో ఒక్కడూ అయిపోయేవాడు. ఆమె కష్టాల్లో పడింది. అత్తగారు

వాళ్ళింటికి వస్తున్న కీడంతటికి కారణం నువ్వే అని కోడలుని తిట్టింది. నువ్వు క్రైస్తవులలో చేరితే నిన్నొదిలేస్తానని భర్తతో ఎందుకు అనలేదు?– అని అడిగింది. భర్త ఆమె మీద ఒత్తిడిని గమనించాడు. కుటుంబం అందరిముందూ– ''రాదలుచుకుంటే– రా. సంతోషిస్తాను. రాదలుచుకోలేదూ– ఉండిపో. నేను మాత్రం నీతో ఉండను. నీకోసం నేను నా ఆత్మ విముక్తి మార్గాన్ని వదులుకోలేను– '' అన్నాడు భార్యతో. అతనలా అనడంతో ఆమెని ఎవరూ తప్పుపట్టలేకపోయారు. నువ్వెక్కడికి వెళ్తే నేనూ అక్కడికే. నువ్వు లేనిచోట నేనుండను" అని చెప్పింది.

తన బాప్తిజం కారణంగా తన కుటుంబం తనని వెలివేయడం చూచి రామయ్య అతని భార్య బంధువులు ఎవరైనా తమతో కలుస్తారని ఆశపెట్టుకున్నాడు. అరవైమైళ్ళు నడిచి వెళ్ళాడు. భార్య బంధువులు ఆదరంగా ఆహ్వానించారు. వాళ్ళు నజరయ్య మతస్థులు. అందువల్ల రామయ్య తీసుకొన్న నిర్ణయంపట్ల వ్యతిరిక్తత చూపించలేదు. "త్రిపురాంతకంలో ఏడాది పండగకి మాతోరా. పదమటను దూరంగా ఉన్న మా కుటుంబం వాళ్ళు అక్కడకి వస్తారు. మేం కలుస్తాం. అంతా కలిసి నువ్వు చెప్పేది వింటాం" అన్నారు.

ప్రయాణం జరిగింది. ఓ పెద్ద మర్రిచెట్టు కింద త్రిపురాంతకంలో కుటుంబమంతా కలిసి కూర్చుంది. రామయ్య అడిగాడు– "క్రీస్తు తప్ప మరో మార్గంలేదు. మనం ఇంకా తప్పుడు దోవలలోనే ఎందుకుండాలి?"

రామయ్య భార్య పినతండ్రి వయసు రీత్యా హుందాతనం రీత్యా ఆ కుటుంబమంతటికీ పెద్ద. "నజరయ్య మనని బిడ్డల్లా అనుసరించమన్నాడు. ఆయనే మనకి దారి చూపిస్తాడు." అన్నాడు.

''మీరు నజరయ్యను కూడా అనుసరించటంలేదు. విగ్రహారాధన వద్దన్నాడు ఆయన. మీరు పోలేరమ్మకీ మహాలక్ష్మికీ మొక్కుతూనే ఉంటారు. అన్నాడో రామయ్య.

అతని భార్య పెద్దన్న మరో కోణంలోంచి చూశాడు. "క్రైస్తవం సరయిన మతమే కావచ్చు. కాని మనం దాన్ని భరించలేం. "సారాయి తాగొద్దు. దొంగతనం చెయ్యొద్దు. ఇతర పాపాలు చెయ్యొద్దు అన్నాడు నజరయ్య. కాని మనం నజరయ్య నియమాలని పాటిస్తున్నామా లేదాఅని ఎవరూ అడగరు. క్రైస్తవులయితే మనం జాగ్రత్తగా ఉండాలి. చాలా కష్టం. ఎవరయినా క్రైస్తవ నియమాలతో ఎలా బ్రతకగలరు?"

అవునంటే అవునన్నారు అందరూ. నజరయ్య మతంలో ఉండటం మరింత సునాయాసంగా ఉంటుంది. క్రైస్తవ జీవితం చాలా కష్టంగా కనిపించింది.

రామయ్య భార్య పినతల్లి చివరగా అంది. ఆమె తెలివైనది. అందరూ ఆమె మాటను వింటూంటారు. "మనం పోలేరమ్మకి అంకాలమ్మకి మొక్కటం వల్ల తినటానికింత తిండి ఈ రోజు దొరుకుతోంది. వాళ్ళకి మొక్కడం మానివేస్తే తిండానికి గడ్డీ గాదం తప్ప ఏమీ దొరక్కపోవచ్చు."

వాళ్ళ సమస్యకి అది వాస్తవ పరిష్కారంగా అందరికీ సంతోషం కలిగింది. చాలామంది లేచి కాళ్ళు జాడించుకున్నారు. అది చర్చకి ముగింపు. ''అయితే మీరు మీ తిండి కోసం ఆత్మలని వదులుకొంటారా? అని అడిగాడు. రామయ్య తను విఫలుడనయ్యానని గ్రహించి అతనూ వెళ్ళటానికి బయలుదేరాడు.

ఇంటికి వెళ్తూ రామయ్య పున్నయ్యను కలిశాడు. సంగతి చెప్పాడు. మనలాంటి వాళ్ళు కొన్నాళ్ళు వెలివేయబడతారు. కాని కొన్నాళ్ళకి మన కుటుంబాలు మనని కలుస్తాయి'' అన్నాడు పున్నయ్య. ఇంటికి వచ్చేసరికి తండ్రి యిద్దరు తమ్ముళ్ళూ వినటానికి సిద్ధపడేసరికి రామయ్యలో మళ్ళీ ఆశ పుంజుకుంది. కాని రామయ్య తండ్రి మెత్తటి మనిషి. పెళ్ళామంటే భయం. తమ్ముళ్ళు అటూ యిటూగా ఉన్నారు. అన్న మొదటి అడుగువేయాలని చూస్తున్నారు. రామయ్య నిర్ణయం తీసుకోవాల్సిన సమయం వచ్చిందనుకున్నాడు. ఒంగోలు వెళ్ళి బాప్తిజం తీసుకున్నాడు.

ఒంగోలు నుంచి తన పల్లెకి వచ్చేసరికి రామయ్య భార్య చేతులలో చంటి బిడ్డతో దోవ పక్కన కనిపించింది. ఈ సమయానికి రావచ్చని అక్కడ నిరీక్షిస్తోంది."మనం ఏం చెయ్యాలి? మీ అమ్మ మండిపడుతోంది. నిన్ను యింట్లోకి రానివ్వను అంటోంది" అంది.

"ఫరవాలేదు మనం మరోచోటు చూసుకుందాం" ప్రశాంతంగా అన్నాడు. నెమ్మదిగా యింటికి వెళ్ళారు. రాత్రి భోజనానికి ధ్యానం దంచుతోంది తల్లి. పెద్ద కొడుకుని చూసింది. అతను తలగుడ్డ విప్పగానే కొప్పుముడి లేకపోవటం గమనించింది. గొప్ప దుఃఖంతో అంది.

''నిన్ను కన్నాను. పెంచాను. ముసలితనంలో నన్ను చూస్తావనుకున్నాను. మనం వెళ్ళగూడని మార్గంలో నువ్వు వెళ్ళావు. నీ చేతి తిండి నేను తినను. పో! నువ్వు నాకు చచ్చినవాడికిందే సమానం''

రామయ్య జీవితంలో తన నిర్ణయాలతోనే ఇంతకాలం నడిచాడు. ఇప్పుడు లొంగే అవకాశమే లేదు. ఇల్లు తనదే అన్నట్టు అతను ఇంట్లోకి అడుగుపెట్టాడు. అతనితో కలగజేసుకునే ధైర్యం ఎవరికీ లేకుండాపోయింది. కాని కుల కట్టుబాట్లు అతనికన్నా బలమైనవి. కుటుంబం భోంచేసేటపుడు వాళ్ళతో తిననివ్వలేదు. అతనికీ పెళ్ళానికి తిండి వేరేగా పెట్టారు. అతని మైల అంటుకుని అందరికీ రోగాలు వస్తాయి గనుక నూతిలో నీళ్ళు తోడనివ్వమన్నారు. తనకోసం ఓ నూతిని తవ్వుకోవలసి వచ్చింది. నీళ్ళు వెంటనే పడ్డాయి. బరువుగా బాధగా గడిచాయి రోజులు.

కాని తల్లి కఠిన నియమం నిలవలేదు. చిన్న కొడుకులు కూడా బాప్టిజం తీసుకున్నారు. జుత్తు కత్తిరించుకుని వచ్చినపుడు ఆమె వాళ్ళని శపించటానికి సాహసించలేదు. 'ముసలాయన మంచాన పడ్డాడు. చావు దగ్గరవుతోంది. క్రీస్తు గురించి చెప్పే ప్రతి పదం కోసం తపిస్తున్నాడు. కాని భార్య తిడుతుందేమోనన్న భయంకొద్దీ

తనకి శాంతి కలిగించేదేమిటో చెప్పటానికి ధైర్యం లేకపోయింది. అతను నజరేత్ యెక్క జీసస్ మీద విశ్వాసంతో చనిపోయాడు. రామయ్య ఒక తమ్ముడు ఒంగోలుకి స్కూలుకి వెళ్ళారు. ఆఖరాడు అమ్మకి సహాయంగా ఇంటివద్ద ఉండిపోయాడు. బయటకు ఒప్పుకోకపోయినా, ఎవరో ఒకరు యింటివద్ద ఉండిపోయి తనను చూసుకుంటే తల్లి సంతోషించింది.

కొన్నేళ్ళు గడచాక ఆఖరాడు అన్నదమ్ములను చూడటానికి ఒంగోలు వెళ్ళాడు. అక్కడ ముగ్గురూ ఉండగా కొద్దిగా జబ్బుపడి తల్లి చనిపోయిందని కబురు వచ్చింది. ముగ్గురూ ఒకరి మొహాల్లోకి ఒకరు చూసుకున్నారు. ఒకరి ఆలోచన ఒకరికి తెలుసు. రెండు చేతుల్లోనూ ముఖం పెట్టుకుని రామయ్య ఏడిచాడు. "నేను తనకి చచ్చిపోయినట్టేనని చెప్పింది. ముసలితనంలో నా చేతి తిండి తిననంది. పిల్లలందరూ దూరంగా ఉండగా చనిపోయింది. తనన్నట్టే చేసింది."

తల్లిని తలచుకున్నపుడల్లా రామయ్యకి అలవికాని బాధ కలుగుతుంది. తల్లి శాపం గురించి చెప్పినపుడల్లా అతని కళ్ళలో నీళ్ళు నిండుతాయి.

# 1. కల్లోలంలో

ఎండ్లూరి రత్నం భార్య తన భర్త పని మధ్యలో ఆపుచేసి తలవంచి చేతులు మడచి తనలో తను అనుకోవటం గమనించింది. "దేముడా నేను పాపిని. నాకు జ్ఞానం ఇయ్యి దారి వెతుక్కుంటాను" ఆమె కూడా అతనితో మోకరిల్లేది. దూర గ్రామంలో క్రైస్తవులను, వర్తకం కోసం వెళ్ళి చూసానన్నాడు. "అది తప్పకుండా మంచి మతం అయుంటుంది". అంది.

బంగారపు తాతయ్య తన వాళ్ళ మతం మంచి చెడ్డలు కనుక్కోటానికి ఒకరోజు వచ్చాడు. ఎందువల్లనో రత్నం తన మనసులో మాట చెప్పలేదు. తాతయ్యని నిరుత్సాహపరిచాడు. "క్రైస్తవమూ నజరయ్య మతమూ ఒకటే. నేనెక్కడున్నానో అక్కడే ఉంటాను." అన్నాడు. పదేళ్ళుగా నజరయ్య మతంలో ఉన్నందుకు రత్నంకి గొప్పగా ఉంది. రత్నం చాలాసార్లు త్రిపురాంతకం పండగకి వెళ్ళాడు. నేర్పిన మంత్రాలూ పాటలూ నేర్చాడు. దేముడు ఒక్కడే అన్నది పూర్తిగా నమ్మాడు. అయినా గురవడు స్వామిని పూజించటానికి తోటివాళ్ళు వెళ్తే తనూ వెళ్ళాడు. ఊరి చివర వేపచెట్టు కింద గురవడు నివాసం ఉంది.

ఆ ఊరి ముసిలాళ్ళు ఒకప్పుడు గురవడు అనే మనిషి ఉండేవాడని విచిత్రంగా చనిపోయాడని చెప్పేవారు. చుట్టాలంతా కుండలో అన్నం వండి గురవడు స్వామి సమాధి దగ్గరకు వెళ్ళి అన్నం పోసి రెండు పోగులు పెట్టారు. ఒక దానిలోంచి ఒక గుప్పెడు అన్నం తీసి రెండోదానిలో పెట్టి అర్పించారు. కొంచెం దూరంలో కూచుని చూస్తున్నారు. కాకులు వచ్చి తింటే గురవడు దయదలిచాడని వాళ్ళు భావించేవారు. కాకులు ఎగిరిపోతే వాటి రెక్కల మీద ఆత్మ శరీరాన్ని విడిచి స్వర్గానికి వెళతుందని మాదిగలు నమ్మేవారు.

గురవడు సమాధి వద్ద కాకులు వచ్చి తినలేదు. నేల మీదే ఆత్మ అలమటిస్తోందని అది తమకు కీడు చేయబోతోందని వాళ్ళకి తెలుసు. ఆ వేపచెట్టుకింద విచిత్రమైనవి రాత్రివేళ తిరగటం చాలామంది చూశారు. దాంతో దాని కింద ఓ రాయిపెట్టి పసుపురాసి ఎర్రచుక్కలు పెట్టి పూజిస్తే మంచిదనుకున్నారు. గురవడు ఏ రూపంలో ఉన్నా అలా గౌరవించి పూజించితే అతను ఊరికి కీడుచేయడు. గురవడు భయం తండ్రుల నుంచి కొడుకులకి సంక్రమించింది. ఊరికి ఏదయినా ఆపద జరిగితే అది గురవడు దెయ్యం పనేననుకునేవారు.

గురవడు గురించి తను అనుకుంటున్నది బంగారపు తాతయ్య ఎండ్లూరి రత్నంకి ధైర్యంగా చెప్పాడు. ఆ విషయం మీద తాతయ్యకు ఎప్పుడూ వ్యతిరేకతే వచ్చింది. తాతయ్య మాత్రం బాధపడలేదు. ఒంగోలు నుంచి ఒక బోధకుడు వచ్చినపుడు రత్నం వాళ్ళ ఊరు వెళ్ళమని తనవాళ్ళని వదిలేయవద్దనీ చెప్పాడు. అతను తెలివైనవాడు. విద్యావంతుడు. మాదిగలలో మతం మార్పిడి జరుగుతున్న తొలినాళ్ళలో పూర్వం మిషనరీలలో చేసిన సేవలకి ప్రసిద్ధుడు. ఆ తరువాత ఒంగోలు మిషనరీకి కుడిభుజం అయాడు. ఊరంతా అతనిచుట్టూ మూగారు. అతను ముగించకముందే నజరయ్య మతానికి క్రైస్తవానికి తేడా రత్నానికి అర్థం అయింది. అంతేకాదు ఆ బోధకుడు స్వామి గురవడు గురించి వేళాకోళంగా మాట్లాడాడు. అందరూ నవ్వారు. అందరి అనుమతి తీసుకుని గురవడు రాయిని, దాని మీద పసుపూ, ఎరుపూ చిహ్నాలతో కాలవలో పడేశాడు. బోధకుడికి ఏమీ జరగలేదు. గురవడు ఆనవాళ్ళు లేవు.

ఆ రోజు రత్నంతో ఒంటరిగా మాట్లాడాడు. కొన్ని ప్రశ్నలు వేశాడు. "నీవు పాపివా జ్ఞానివా? నువ్వు స్వాములను పూజించటం మంచిదా చెడ్డదా? నువ్వు విగ్రహాలకు మొక్కావు. నీ శూద్ర యజమాని కళ్ళుబడకుండా ధాన్యం దొంగతనం చేశావు. ఆదివారాలు పనిచేశావు. చచ్చిన గొడ్లమాంసం తిన్నావు. నీవు చేసిందాని గురించి ఇప్పుడేమనుకుంటున్నావు?" రత్నం తప్పు చేశానని ఒప్పుకున్నాడు. అవన్నీ వదిలెయ్యాలని ఒప్పుకున్నాడు. బోధకుడు సంతోషించాడు.

కొన్నాళ్ళలో రత్నాన్ని కరణం ఓ దూరపు గ్రామానికి ఉత్తరం తీసుకెళ్ళమన్నాడు. మిగిలిన పనంతా వదిలేసి ప్రయాణం చెయ్యాలి. దానికేం కూలి కూడా ఉండదు. కొన్ని తరాల క్రితం వెంకటగిరి రాజా ఆ కుటుంబానికి నాలుగెకరాల మాన్యం యిచ్చాడు. దానికి బదులుగా కరణం చెప్పిన పని చెయ్యటానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండాలి. ఇది వెట్టి చాకిరీ, మధ్య యుగాలలో Serfdomకి దగ్గరగా ఉంటుంది. రత్నం తలగుడ్డలో చుట్టుకుని ఉత్తరాన్ని తీసుకువెళ్ళాడు. పెట్లూరు చేరాడు. ప్రభుత్వ కార్యాలయానికి వెళ్ళాడు. బ్రాహ్మణ గుమాస్తాలు, అధికారులు పనిలో ఉన్నారు. దగ్గరికి వెళ్ళే ధైర్యం చెయ్యలేదు. ఒక పేద మాదిగ ఎదుటబడితేనే వాళ్ళు పీల్చే ఊపిరి మైలపడుతుంది. దూరంగా నిలబడ్డాడు. తెచ్చిన ఉత్తరం ఎత్తి పట్టుకున్నాడు. ఒక శూద్ర సేవకుడు వచ్చి ఉత్తరం తీసుకున్నాడు. అతన్ని వెళ్ళిపోవచ్చని చెప్పారు. ఒక చెట్టు నీడలో విశ్రాంతి తీసుకున్నాక చుట్టు దారిన ఇంటికి బయలుదేరాడు.

ఎండ్లూరి రత్నయ్య దూరపు బంధువు పుల్లికూరి లక్ష్మయ్య ఈ మధ్యనే బాప్టిజం తీసుకున్నాడని విని రాజయోగి గురువుల పనికిమాలినతనం గురించి చెపుతాడని విని చూడటానికి బయలుదేరాడు. లక్ష్మయ్య స్నేహదరాలతో ఆహ్వానించాడు. పుల్లలు వెలిగించి స్నానానికి వేణ్ణీళ్ళు పెట్టాడు. ఆడవాళ్ళు చేస్తున్న రాత్రి వంట ఘుమఘుమలాడుతుంది. చింత చెట్టు కింద కూర్చున్నారు. ఆ సాయంత్రపు చల్లదనంలో ఇద్దరూ అనేకం మాట్లాడుకున్నారు.

లక్ష్మయ్య అధికారయుతంగా మాట్లాడక తప్పదనుకున్నాడు. "నువ్వు క్రీస్తుని నమ్మావా?" అని అడిగాడు. అవునన్నాడు. రత్నం. "నువ్వు బాప్టిజం తీసుకున్నావా? "లేదు". అయితే ఈ నెలలోనే ఒంగోలు వెళ్ళు. బాప్టిజం తీసుకో. లేకపోతే నువ్వు తొందర్లోనే చచ్చి నరకానికి పోతావు".

ఆత్మలు, దెయ్యాలు, భూతప్రేతాలు నమ్మే మాదిగలలో ఆలోచించేవాళ్ళకి మరణానంతరం మంచి జరగాలని బలీయమైన కోరిక ఉంటుంది. క్రైస్తవ భావనలైన స్వర్గమూ, నరకమూ వాళ్ళకి సులువుగా పట్టాయి. ఒకటి దొరకాలన్న ఆశ మరొకటంటే భయమూ వారి నైతిక వర్తన మీద మతావేశం మీద బలమైన ప్రభావం కలిగి ఉంటాయి. ఆ విధంగా లక్ష్మయ్య ఎక్కించడంతో రత్నం ఊగిసలాట ముగిసింది. ఒంగోలు మిషన్ ఎంచదగ్గ ఒక గొప్ప సేవకునిగా అతని భవితవ్యం రూపొందింది.

రత్నం రూపంలోనే ఒక విధమైన మర్యాద ఉట్టిపడుతూంటుంది. అతని వాలకం సాధారణమైనదేనా గొప్ప రాజనం కనిపిస్తుంటుంది. ప్రతి ఉద్వేగమూ కళ్ళల్లో కనిపిస్తుంటుంది.. అతను తదనంతరం జీవితంలో ఆదుర్దాకి అలవాటుపడ్డాడు. అది అతని జీవితంలోని కష్టాలకు గుర్తు. ఎవరైనా దయగా చూస్తే అతని వదనం అరుదైన చిరునవ్వుతో ప్రకాశవంతమవుతుంది. ఆ దయకి బదులుగా అతనిలో భక్తి కనిపిస్తుంది.

మొదటి సంవత్సరాలలో చుట్టుపక్కల ఊళ్ళలో బోధించటానికి వెళ్ళేవుడు తోడుగా భార్యని తీసుకు వెళ్ళేవాడు. ఇది అసాధ్యమైపోయింది. మతం మార్చుకున్నవాళ్ళు పెరిగే కొద్దీ శూద్రులతో సమస్యలు పెరిగాయి. బోధకుడి మీద అతని భార్య మీద గొడవలు వచ్చాయి. "ఈ అవమానాలను ఎదుర్కోవడం ఆడాళ్ళకు అపాయం" అన్నాడు. అప్పటినుంచి ఒక్కడూ వెళ్ళేవాడు.

ఒక చిన్నతరహా సాంఘిక విప్లవం ఆ రోజుల్లో నడుస్తుండేది. మాదిగ జనాభా తొందరగా క్రైస్తవంలోకి మారుతోంది. తత్ఫలితంగా శతాబ్దాలుగా మాదిగలని పట్టి ఉంచిన ఆర్థిక సామాజిక సంబంధాలు తెగిపోతున్నాయి. వారానికి ఒకరోజు విశ్రాంతి, దైవప్రార్థన కావాలన్న క్రైస్తవుల కోరికలో ఒక కొత్తదనం ఉంది. చాలామంది మాదిగలకు వారంలో రోజులను గుర్తుంచుకోవటం తెలియని పని. ఎన్ని రోజులు గడిచిందీ తెలుసుకునేపాటి జ్ఞానం మానవులలో నైతిక వర్తనను అలవరచుకుందుకు అవకాశం యిస్తుంది.

మాదిగల ఈ నూతన స్వతంత్ర భావన శూద్ర భూస్వాములకి నిరంతరం చికాకుకి కారణమవుతూనే ఉంటుంది. కావలిసొచ్చినపుడల్లా తన పాలేర్లను పనికి పిలవటానికి అలవాటు పడ్డాడు. రాత్రీ పగలూ, విత్తనాల టైము పంటల టైము ఎప్పుడూ అతని పిలుపుకి సిద్ధంగా ఉండాలి. విశ్రాంతి పట్ల వారి కోరిక న్యాయబద్ధమైనదిగా భూస్వామి చూడలేదు. అధికారం మీద తిరుగుబాటుగా శూద్రునికి కనిపించింది. శూద్రుల బాధను కరణం పంచుకున్నాడు. అతనూ క్రైస్తవ వెట్టివారిని ఆదివారం పనిచేయమన్నాడు. దూరప్రయాణాలు ఆరంభించమన్నాడు. వాళ్ళు మర్నాడు వెళ్ళటానికి అనుమతించమన్నారు.

ఆ ప్రాంతమంతా ఉద్రిక్తత వ్యాపించింది. ఎప్పుడన్నా అమ్మవార్లకి, దేవతలకి పూజలు చెయ్యాల్సివస్తే తిరగబడుతున్న మాదిగలను ఎలా ఒప్పించాలన్న ప్రశ్న ఎదురయింది. గ్రామ సమాజానికి చేయవలసిన సేవలకు వాళ్ళు ఋణపడి ఉన్నారు. వాళ్ళ సేవలకు ప్రతిగా బలిచేయబడ్డ జంతువులు వాళ్ళకు చెందేవి.

రత్నం కింద ఉన్న గ్రామాలలో ఒకటైన బళ్ళపూడి గ్రామంలో ఈ తగువు తారస్థాయికి చేరింది. మాదిగలు పురాతన వ్యవస్థల మీద తిరగబడ్డారు. గ్రామీణ సామాజిక వ్యవస్థను వాళ్ళమీద ఉపయోగించారు. కుమ్మరి చేసే కుండలు పగిలిపోతూ ఉంటాయి. వాటిని తరచు మార్చాలి. అలాగే చాకళ్ళు గ్రామం అంతటికీ సేవ చేస్తుంటారు. వాళ్ళ యిళ్ళు ఊళ్ళోనే ఉంటాయి. చెరువు ఎండిపోతే తగినంత నీరు ఉన్నచోట్లకి గాడిదల మీద వేసి బట్టలు తీసుకెళ్తారు. అనేకరకాలుగా పరస్పరం ఆధారపడటం గ్రామీణ జీవితంలో ఉంది. మునసబు, కరణం గనక ఆజ్ఞాపిస్తే మాదిగలకి పరస్పర సహకార గ్రామ జీవితం ఉండదు. వాళ్ళ వెలి చాలా దుర్భరంగా ఉంటుంది.

బల్లపూడి కరణం మరీ ధృఢమైనవాడు కాదు. కాని పీడించే అధికారం తనకి ఉందని తెలుసు. తనే ముందడుగు వేయాలని నిర్ణయించుకున్నాడు. ఈ దారి తప్పుతున్న మాదిగలతో ఎలా వ్యవహరించాలో ఆ ప్రాంతానికంతటికీ చూపించాలనుకున్నాడు. చాకళ్ళని క్రైస్తవుల బట్టలు ఉతకవద్దని చెప్పారు. కుమ్మరిని కుండలు అమ్మవద్దన్నారు. అందరూ మేపుకొనే పోరంబోకు భూముల్లోకి వాళ్ళ పశువులని రానివ్వనీలేదు. శూద్రులు అందరూ చెప్పులు కుట్టడం వంటి పనులు ఇవ్వమన్నారు. పంటల సమయంలో వాళ్ళని పనుల్లోకి రానీలేదు. శూద్రులు యిచ్చే ధాన్యం దొరకలేదు. వాళ్ళని అన్నివిధాల బహిష్కరించారు. ఎక్కడెక్కడి నుంచో విగ్రహారాధన చేసే మాదిగలను రప్పించి ఊరిపనులు చేయించాడు కరణం. క్రైస్తవులకి గత్యంతరం లేక దూరపు ఊళ్ళు పోయి చచ్చి చెడీ పొట్టపోసుకోవలసి వచ్చింది. ఇలా ఓ ఏడాది గడచింది. ప్రజల కష్టాలకి రత్నం చాలా బాధపడ్డాడు.

బళ్ళపూడి గ్రామానికి దగ్గర తోపులో ఒంగోలు మిషనరీ మకాం వేసినపుడు రోగం కట్టే రోజు వచ్చింది. ఊరి బజారులోంచి మిషనరీ వెళ్తునపుడు రత్నం తతిమ్మా క్రైస్తవులు వెంట ఉన్నారు. మిషనరీ ఉండటం వల్ల వాళ్ళకి గొప్ప సంతోషంగా, ధైర్యంగా ఉంది. రోడ్డుకి ఓ పక్కన రెండు చేతులూ కట్టుకుని నిలబడ్డాడు. కరణం. "అతనే" అని రత్నం దొరకి చూపించాడు. కరణం ఒంగి ఒంగి సలాములు చేశాడు. దొర అతన్ని లెక్కపెట్టనట్టు కనిపించాడు. అప్పటికే భయంతో ఉన్న కరణం తనకి ఏం జరుగుతుందా అని

ఆందోళనతో నిండిపోయాడు. ఈ మాదిగలని రక్షించటంలో ఒంగోలు మిషనరీకి చాలా బలముందని అతను విన్నాడు.

గుర్రం వెనకాలే నడుస్తూ కరణం తప్పయిపోయింది. తప్పయిపోయిందనటం మొదలుపెట్టాడు. అన్ని కులాల వాళ్ళతో పెద్ద గుంపు చుట్టూ ముగింది. మహమ్మదీయులు కూడా ఉన్నారు. డేరా వేసిన దగ్గర నుంచి దానితోపాటు వచ్చిన లష్కర్లు చెపుతూనే ఉన్నారు. బళ్ళపూడికి దొర వస్తే చుట్టుపక్కల నుంచి జనం తండోపతండాలుగా వస్తారని అంటున్నారు. ఈ గొడవ అందరికీ ఆసక్తిగా ఉంది. దొర గనుక కరణాన్ని బెదరగొట్టకపోతే ఆ ప్రాంతంలో మాదిగల బ్రతుకు దుర్భరమయిపోతుంది. ఇతర కరణాలు ఇంకా తీవ్రమైన చర్యలు తీసుకోటానికి సిద్ధంగా ఉన్నారు.

భయంతో వణుకుతున్న కరణం వైపు కూడా దొర చూడటంలేదు. మతద్వేష బాధితులు ఆడామగా అతని చుట్టూ చిన్న గుంపు తయారయారు. కరణం చెప్పే కారణాలు కూడా వినలేదు. చివరికి వినమని అభ్యర్థించితే విన్నాడు. "నేనా పని చెయ్యలేదు. సాక్ష్యాలు లేవు' అన్నాడు కరణం.

దొర గుర్రం ఆగింది. వణుకుతున్న కరణం వేపు తిరిగింది. అది చాలా అందమైన తెల్లని జంతువు. పాత రోజులలో బోధకులకి అదుంటే గొప్ప. పాత రోజుల్లో ఓ మారు మిషన్ అప్పుల్లో ఉంది. దొర తన గుర్రాన్ని అమ్మేయటానికి సిద్ధపడ్డాడు. ఆ డబ్బు తన బోధకులకి యిద్దామనుకున్నాడు. కాని వాళ్ళు గుర్రాన్ని అమ్మొద్దన్నారు. "మాకు ఫరవాలేదు. గుర్రాన్ని ఉంచుకోండి. మమ్మల్ని హింసించే మత ద్వేషులకి మా దొర గుర్రపు స్వారీ ఎందుకు చేయటం లేదంటే మేమేం చెప్పగలం? అన్నారు.

దొరకి కరణానికి మధ్య జరిగిన దాన్ని నాతో చెప్పేటపుడు దొర గుర్రం గురించి ప్రత్యేకంగా గుర్తుంచుకున్నాడు రత్నం. "మా దొర జనంలో గాని నడిస్తే ఎంత లోకువగా ఉండేది? రత్నం గుండెలలో దొర ఒక మాట గొప్ప విచిత్రమైన కృతజ్ఞతా భావాన్ని నింపింది. కరణంతో అన్నాడు దొర "సాక్షులు లేరంటున్నావు. నువ్వేం చేసింది క్రైస్తవులు నాతో చెప్పారు. నాకు తమ్ముడు లాంటి బోధకుడు చెప్పాడు. నా తమ్ముడు నాతో అబద్ధమాడతాడా? నువ్వు అబద్ధం చెబుతున్నావు" ఇదంతా నాకు చెపుతున్న అనేకసార్లు రత్నం మొహంలో కృతజ్ఞత తొణికిసలాడింది. తనమీద కత్తిగట్టి వచ్చిన జనసమూహం ముందు, కొద్దిమంది తన వాళ్ళ ముందు దొర తనని "తమ్ముడు" అన్నాడు.

ఇంకెప్పుడూ తప్పులు చేయనని బడిపిల్లాడిలా కరణం ఒప్పుకున్నాడు. ఓసారి కాదు, రెండుసార్లు, క్రైస్తవులని ఇంకా బాదించనని అన్నాడు. దొరకి అతను అబద్ధమాడొచ్చనని శంక. మాదిగలు దేముని బిడ్డలని, దేముడు వారిని ప్రత్యేకంగా చూసుకుంటాడని చెపుతుంటే విని ఆశ్చర్యపోయాడు. "వాళ్ళ దేముడు మీ స్వాముల్లా పేదవాళ్ళు ప్రార్థిస్తే వినకుండా, చూడకుండా ఊరుకోడు. దేముడు దూరంగా లేడు. వాళ్ళని ముట్టుకుంటే ఖబడ్దార్! అన్నాడు మిషనరీ.

తలొంచుకుని కరణం ఇంటికి వెళ్ళిపోయాడు. తన కిందనున్న వాళ్ళని అణిచెయ్యగలడు గాని తన చర్యలకు సమాధానం చెప్పమని నిలదీసే వాడి ముందు వణికిపోయిన పిరికిపంద అనుకున్నారు. ఆ ప్రాంతంలో చాలామంది క్రైస్తవుల మీద కోపంతో రగలిపోతున్నారు. అయినా ఇతరులు వాళ్ళకి బుద్ధిచెప్పనీ మనం మాత్రం దూరంగా ఉందామనుకున్నారు.

కొన్నేళ్ళు గడిచాయి. అంకాలమ్మ దేవత పూజారులు ముక్తిమళ్ళ గ్రామంలోని ఆలయంలో జాతర వైభవంగా చెయ్యాలని నిశ్చయించుకున్నారు. తరచుగా పశువులకి రోగాలూ, నూతులు ఎండిపోటాలూ జరుగుతున్నాయి. ఈ మధ్యలో పూజలు సరిగ్గా జరగకపోవటం వల్ల, మాదిగలు డప్పు కొట్టడానికి నిరాకరించటం వల్ల కూడా అమ్మవారికి కోపం వచ్చి ఉంటుందని చెప్పారు. ఈ అంకాలమ్మ శివుని అర్ధాంగి పార్వతి అంశ. పది గొప్ప శక్తి రూపాలలో ఒకటి. ముక్తిమళ్ళ కరణం బ్రాహ్మణుడు. డెబ్భై ఏళ్ళ వయసు. శివభక్తుడు. శతాబ్దాలుగా జరుగుతున్నట్టు ఆ జాతరలో మాదిగలు డప్పులు వాయించాలని నిశ్చయించాడు. అంతేకాదు తిరగబడుతున్న మాదిగలకు తగినట్టు అవమానం జరిగితే అమ్మవారికి దాన్ని చూసే సంతోషం కలుగుతుంది.

జాతర నడుస్తోంది. భక్తులు మూగారు. కరణం క్రైస్తవులని రమ్మని డప్పు వాయించమని కబురంపాడు. వాళ్ళ మతం విగ్రహారాధనని ఒప్పుకోదని వాళ్ళు సమాధానం చెప్పారు. అయిదుగురు గ్రామభటులు వెళ్ళి అయిదుగురు ప్రముఖ క్రైస్తవులని బలవంతంగా తీసుకువచ్చారు. క్రైస్తవ మతం తాలూకు మైల పోయేవరకు వాళ్ళ నెత్తిమీద నీళ్ళు పోశారు. తలలు గొరిగారు. పిలక ఉంచారు. దానిలోనే స్వామి కాపురం ఉంటాడు. వాళ్ళ నుదుట మిగిలిన భక్తులకు లాగే విభూతి రాశారు. బొట్లు పెట్టారు. డప్పులు బలవంతంగా చేతుల్లో పెట్టారు. మూడు రోజుల వరకూ వాళ్ళా స్థితిని భరించవలసిందేనన్నారు. అమ్మవారిని పూజించటానికి పెద్ద సంఖ్యలో జనం వచ్చారు.

రత్నం అక్కడికి పరుగెత్తాడు. వాళ్ళంతా అతనివాళ్ళే. కాని ఏం చేయగలరు? వాళ్ళు సంఖ్యలో చాలా తక్కువ. అయిదుగురూ వాళ్ళ జుత్తుని పోగుచేసి గుడ్డలో మూటకట్టారు. విడిచిపెట్టగానే ఒంగోలుకి పరుగెత్తారు. మిషనరీకి తమ కథ చెప్పారు. మూటలోని జుత్తు చూపించారు. తలగుడ్డలు విప్పి తమ అవమానంకి గుర్తయిన బోడిగుళ్ళు చూపించారు.

క్రిమినల్ కోర్టులో కేసు వేశారు. ఒంగోలు ఆంగ్ల మెజిస్ట్రేటు కేసుని స్వయంగా విచారించాడు. మీరు అవమానించబడినట్టు భావిస్తున్నారా అని ఆ అయిదుగురు క్రైస్తవులనీ అడిగాడు. "మా తలలు తెగ్గొట్టినంత అవమానంగా ఉంది" అన్నారు వాళ్ళు. రత్నం మరో యిద్దరు క్రైస్తవ మాష్టర్లు ఒకవేపు సాక్షులు. రెండోవేపు అనేకమంది తప్పుడు సాక్ష్యాలు కొన్నాళ్ళు న్యాయవిచారణ

జరిగింది. తీర్పు వచ్చింది. కరణం వృద్ధుడు గనక పడవలసిన మూడు సంవత్సరాల జైలు తప్పించారు. ముప్పైరూపాయల జరిమానా, మూడు నెలల ఖైదు వేశారు. జైలు శిక్ష అంటే అన్నింటిలోకి పెద్ద మైల. విడుదల అయిన నాలుగు రోజులకు కరణం చచ్చిపోయాడు. కొడుకు అతని స్థానంలోకి వచ్చాడు. తండ్రి కన్న కొడుకు మంచాడా అని రత్నాన్ని అడిగాను. "పులి కడుపున నక్క పుడుతుందా?" అన్నాడు.

ఆ విదంగా ప్రభుత్వం తనంత తనే క్రైస్తవ సూత్రాలకు ఒక విధంగా వాహనమయింది. అసహాయులైన మాదిగల చేతిలో డప్పులు పెట్టడం చూడాలన్న అంకాలమ్మ కోరికను పట్టించుకోలేదు. మత అసహనంకి సంబంధించిన చట్టాన్ని ఉల్లంఘించితే అయిదేళ్ళవరకూ శిక్ష విధించుతారు. ఒక ముసలి బ్రాహ్మణుడు గౌరవనీయుమైన హోదాలో ఉన్నవాడు తీవ్రంగా అవమానం అనుభవించి ఉంటాడు. వెలివేసి అయిదుగురి మత విశ్వాసాలను అవమానించటం వల్ల ఇలా జరిగింది. పూర్వంరోజులలో అయితే ఇతర కులాల వారితో సమానమైన న్యాయ పరిధిలోకి రావటం చాలా అవమానంగా భావించబడేది. నిజానికి శతాబ్దాలుగా దాస్యం తప్ప మరేమీ తెలియని ఒక ఆదివాసీ తెగ అవశేషాలకు ఒక కొత్త రోజు ఉదయించింది.

# 2. శాంతి కాదు : ఆయుధం

నంబూరి వాళ్ళ కుటుంబంలో నలుగురు అన్నదమ్ములు ఉన్నారు. క్రిష్ణయ్య పెద్దవాడు. తండ్రి చనిపోయినపుడు బాధ్యత అంతా అతనిమీద పడింది. రెండవవాడు ఆనందయ్య కుటుంబానికి గర్వకారణం. మాల పూజారులందరిలోకి అతను పండితుడు. అన్నదమ్ములు చేసే పూజా కార్యక్రమాల్లో అతని విధానం ప్రత్యేకంగా ఉండేది. ఆనందయ్యకి తోడుగా ఉంటాడు. ఆఖరాడు చిన్న క్రిష్ణయ్య, కృష్ణుడిని ఆ కుటుంబం పూజించేది. ఇద్దరు పిల్లలకి ఆ దేముడు పేరు పెట్టుకుంటే మంచిదనుకున్నారు. అలాంటపుడు పెద్ద క్రిష్ణయ్య అనీ, చిన్నవాడిని చిన్న కృష్ణయ్య అనీ పిలవటం ఆచారం.

అందరిలోకి ఆనందయ్య చురుకైనవాడు. కుటుంబంలో అందరికన్నా జిజ్ఞాసువు చదవటం నేర్చాడు. ఎపుడూ కొత్త కొత్త పుస్తకాల కోసం చూసేవాడు. చరిత్రనీ జానపద గాధలనీ కలిపేసి పాత విషయాల గురించి పాడే గాయకులని వింటుండేవాడు. అతని మతాభిప్రాయాలతో విభేదించేవారు ఎదురయితే వాదనలోకి దిగేవాడు. క్రైస్తవుడు కాకముందే అతని జ్ఞానతృష్ణ వల్ల కొంత మతచరిత్ర ఆనందయ్యకు ఉండటం ఆశ్చర్యకరం కాదు.

నంబూరి కుటుంబం మాలలు. మాలవాళ్ళలో ప్రసిద్ధులు, సంపన్నులు. వాళ్ళకి తెలిసినంత వరకూ వాళ్ళ పూర్వీకులు పూజారులు. 12వ శతాబ్దానికి చెందిన వైష్ణవ సంస్కర్త రామానుజాచార్యుడు దక్షిణ భారతదేశంలో అన్ని కులాల నుంచీ ఏడు వందల ఏభై పూజారులను నియమించాడని చెపుతారు. రామానుజుడి నుంచి ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఈ మాల కుటుంబం తమ వారసత్వ పౌరోహిత్యాన్ని స్వీకరించి ఉండటం అసంభవం కాదు.

రామానుజమతంలోని పూజారి విధులతో తృప్తిపడకుండా చర్మనిష్ఠశాఖలో ఆనందయ్య చేరాడు. ఆనందయ్య పనికి అన్నదమ్ములు సంతోషించలేదు. అయినా తన దోవలో తను వెళ్ళాడు. ఈ శాఖకి రహస్యం, గోప్యత స్వభావాలు. బహుశా అందరి బలవంతం వల్లనేమో పోతులూరి వీరబ్రహ్మాన్ని అనుసరించి రాజయోగి శాఖలో చేరటంతో అందరూ ఊపిరి పీల్చుకున్నారు.

అతనూ అతని అన్నదమ్ములూ పూజారులుగా ఉంటూ కూడా ఆనందయ్య యిలా శాఖలు మార్చటం అతని వాళ్ళ నుంచి ఎలాంటి అభ్యంతరాలూ ఎదుర్కోకపోవటం హిందూ మతంలోని పరిమిత సహనానికి దేన్నయినా యిముడ్చుకోగల శక్తికీ ఒక నిదర్శనం. అయితే ఇది ఎంత వరకూ అంటే సాంఘిక వ్యవస్థకు ఆధారభూతమైన కులవ్యవస్థని మాత్రం ముట్టుకోనంతవరకూ.

ఆలోచించగల హిందువుకి శివుడూ విష్ణువూ ఇంకా చిన్నా పెద్దా హిందూ దేవుళ్లందరూ ఒకే ఒక దైవం పరమేశ్వరుని ప్రతిరూపాలు. ఈ పరమత సహనం క్రైస్తవానికి వర్తించదు. ఎందుకంటే ప్రవేశించిన చోటల్లా అది సృష్టించే తిరుగుబాటు భయానకమైనది. ఇది కులాలకు వ్యతిరేకమైనది. ఆ విధంగా సామాజిక సంబంధాలను విప్లవీకరిస్తుంది. ఇది స్వచ్ఛమైన దైవతత్వం. అది హిందూ మతంలోని శాఖోపశాఖలను అనుసరించే వారికి క్రైస్తవులకీ మధ్య అఖాతం సృష్టిస్తుంది.

ఆనందయ్య తన పూజారి పనులకోసం వెళ్ళినపుడల్లా ఒంగోలు నుంచి తెచ్చి అమ్ముతున్న బైండ్‌చేసిన పుస్తకాల గురించి తరచు అడుగుతుండేవాడు. ఒక కొత్త మతం గురించి తెలుసుకోవాలని తహతహలాడే ఆనందయ్య ఈ విషయంలో తప్పుడు ఆలోచనలు చేశాడు. ఆ పుస్తకాలు తీసుకున్నాడు. జాగ్రత్తగా చదివాడు. లోపలి విషయాలను పూర్తిగా తెలుసుకున్నాడు. ఆ తర్వాత ఇవిచెడ్డ పుస్తకాలని ముక్కలు ముక్కలుగా చించెయ్యటం మంచిదన్నాడు. ఆ ప్రాంతాలలో పెంటయ్య అమ్మిన అనేక పుస్తకాలు చింపేశాడు.

ఓ రోజు ఆనందయ్య పెంటయ్యను దోవలో కలిశాడు. ఓ విధమైన వ్యతిరిక్త స్వరంతో అతని గురించి అతని మతం గూర్చి అడిగాడు. ఆనందయ్యికి వాదనలో పెంటయ్య ఏ విధంగానూ చాలదు. అయితే అతనికి విశ్వాసం ఉంది. తన మతంపట్ల పూర్తి నమ్మిక ఉంది. అతను తన సరళమైన భక్తి స్వభావంతో విగ్రహారాధన పాపం అన్నాడు. హిందూ మతంలో మోక్షం లేదన్నాడు. జీసస్ క్రీస్తు సజీవ వాస్తవం అన్నాడు. క్రీస్తు తనలో ఉన్నాడన్న నమ్మిక ఆ సరళ స్వభావుడికి ఇతరులను ప్రభావితం చేయగలగటంలో రహస్యశక్తి.

పెంటయ్య మాలవాడు గనుక మాల పూజారి ఆనందయ్యతో ఇటీవలే స్థాపించిన ఒంగోలు మిషనరీలోని సామాజిక విషయాల గురించి మాట్లాడగలిగాడు. అనేక మంది మాదిగలు అప్పటికే చేరారని అతను విన్నాడు. ఇలా కులాల కలయికతో సాంఘిక సంబంధాలు ఏమవుతాయి? సమానంగా వెలివేయబడినవాళ్లే అయినా మాల మాదిగలు ఒకరికి ఒకరు విడిగా ఉంటారు. వాళ్ళ నూతులు వేరు. కలిసి తినరు. వాళ్ళ మధ్య పెళ్ళిళ్ళు జరగవు.

దైవానికి సంబంధించిన సత్యం తెలుసుకోవటానికి కులవ్యవస్థ అవసరం లేదని ఆనందయ్యని ఒప్పించనక్కరలేదు. చర్మనిష్ఠ శాఖలో అర్ధరాత్రి ఆనంద తాండవాలలో కుల వ్యవస్థను తోసిరాజనటం అతను స్వయంగా చూశాడు. పోతులూరి వీరబ్రహ్మం కులబేధాలు అంతరించిపోయే రోజు వస్తుందని ఉద్బోదించటం అతనికి తెలుసు. దీనికి వాస్తవ పరిష్కారం క్రైస్తవం ఏం చెపుతుందా అని తెలుసుకోవాలనుకున్నాడు. ఒంగోలు మిషన్ ప్రాంగణంలో కులం లేదన్నాడు పెంటయ్య. అందరూ ఒకే నూతి నీళ్ళు తాగుతారన్నాడు. ఒకరితో కలిసి ఒకరు భోంచెయ్యటానికి

సంకోచించరన్నాడు. ఎవరైనా మాల మాదిగల మధ్య పాత బేధాలను పట్టుకు వేళ్ళాడినట్లు తెలిస్తే చీవాట్లు పెడతారన్నాడు. ఆ కొత్త జీవితం గురించి పెంటయ్య ఒక చిన్న అంశను చూపించాడు. ఆనందయ్య ఆలోచనలు అపరిపక్వంగా ఉండటం వల్ల ఏ ఒప్పందానికీ రాలేదు. పెంటయ్య తన దోవన వెళ్ళిపోయాడు.

ఈ సంభాషణ జరిగిన కొద్దిరోజులకే నలుగురు అన్నదమ్ములూ కొంచెం దూరంలో ఉన్న ఓ వూళ్ళో భాగవతం ఆడటానికి వెళ్ళారు. అర్ధమనస్కంగా ఆనందయ్య దీనికి ఒప్పుకున్నాడు. చీకటి పడ్డ వెంటనే మొదలై తెల్లారేవరకూ సాగింది. మంచి వెన్నెల కాస్తోంది. భాగవతం దగ్గర కాగడాలు వెలుగుతున్నాయి. పక్క ఊళ్ళనుంచి జనం వచ్చారు. నేల మీద కూర్చున్నారు. నూర్పిళ్ళు అయిపోయి, నాట్లు వేసే కాలం యింకా రాకపోవటం వల్ల ఖాళీ సమయంలో ఆనందం కోసం అందరూ ఊరి ముందున్నమైదానంలో చేరారు.

ఇరవై మైళ్ళ దూరాన ఉన్న బంధువులు వాళ్ళతో చేరారు. ప్రదర్శనకి పదిమంది నటులు కావాలి. ఆనందయ్యది ముఖ్య పాత్ర. అంకాలు మారుతున్నాయి. పద్యాలు పాడుతున్నాడు. కష్టతరమైన సంస్కృత సమాసాలతో తెలుగు కలగలసిపోయింది. మధ్యమధ్యలో ఆగి అతను అర్థం చెపుతున్నాడు. కృష్ణుడి జీవిత గాథలు నాటకంలో వస్తువు. కృష్ణుడి తల్లి భార్యలూ ముఖ్యపాత్రలు. ఆడవారి వేషాలు వేసి నగలు అలంకరించుకున్నారు. ఆనందయ్య అన్నదమ్ములు. హిందూవులు దృష్టిలో ఇది ఒక మత సంబంధమైన నాటకం. అయినా గందోళీగాడు తప్పడు. అతని పాత్ర నాటకం స్థాయిని తక్కువ స్థాయిని చేసింది.

చిట్టచివరికి కోళ్ళు కూశాయి. చెట్ల మీద పక్షులు కలకలమన్నాయి. చీకటి పొరలు వచ్చి వెలుగురేఖలు వ్యాపిస్తున్నాయి. చిన్నచిన్న నూనె దీపాలు ఆరిపోయాయి. నటుటూ ప్రేక్షకులూ గాఢనిద్రలో మునిగిపోయారు. ఓ పక్కకి వెళ్ళి ఆనందయ్య పెంటయ్య చేతుల్లోపెట్టిన 'జ్ఞానబోధ' పుస్తకాన్ని చదవటంలో మునిగిపోయాడు. అతని చుట్టూ చాలామంది చేరారు. వాళ్ళకి చదివి వినిపించాడు. చదివినదాన్ని వివరించాడు.

మధ్యాహ్నం అయింది. భాగవతం అయాక చెయ్యాల్సిన సంతర్పణ సిద్ధంగా ఉంది. పెద్ద కృష్ణయ్య కృష్ణుడి విగ్రహాలను పూజ చేయాలి. తర్వాత అందరూ తినాలి. నిద్రోయిన వాళ్ళు లేచారు. తమ్ముళ్ళు ఆనందయ్యను పిలవటానికి వెళ్ళారు. 'నేను రాను" అన్నాడు. "ఎందుకు రావు?" అని అడిగారు. అతని జవాబు వాళ్ళ హృదయాలలో గుచ్చుకుంది. "నేను యిప్పుడు కూడా జీసస్ క్రీస్తుని నమ్ముతున్నాను. ఇకపై నాకు విగ్రహాలతో పనిలేదు. ఆహారానికి దగ్గరగా విగ్రహాలు ఉంటే అక్కడ నేను భోంచెయ్యను.".

ఆనందయ్య రాత్రంతా తీవ్రంగా మథనపడ్డాడు. చిట్టచివరికి మలుపు వచ్చింది. అన్నదమ్ములకి కోపం వచ్చింది. తన ఉద్దేశ్యాన్ని అందరి ముందు బయటపెట్టాడు. వాళ్ళు అక్కడికక్కడే అడిగారు. "మాదిగలలో కలిసిపోతావా? "అవును" "వాళ్ళతో తింటావా?" "తింటాను" "అయితే నిన్ను ఇంట్లోకి రానీం" "మీకు అక్కరలేపోతే నేనే రాను"

అంత నిశ్చయంగా మాట్లాడుతున్నపుడు కోపంకి చోటులేదు. వాళ్ళ బాధను చాతనయినట్టుగా దాచుకుని ప్రస్తుతం ఏం చెయ్యాలా అని ఆలోచించారు. రాత్రంతా చాలా కష్టపడ్డాడు. అతను ఏదో ఇంత తినేలా చెయ్యటం వాళ్ళ కర్తవ్యం. "మేం పూజ చేసేముందు నీకు తిండి పంపుతాం. నువ్వు ఆ మతంలో కలిసినా ఆకలితో వెళ్ళగూడదు. అన్నారు. మిగిలిన భోజనం కన్న తన భోజనం మీద ఎక్కువ మంత్రాలు చదువుతారేమోనని అనుమానం వచ్చింది. రాత్రి అతని క్షోభ అతని సహనానికి మించిపోయింది. " ఆ తిండితో నాకు ఎలాంటి పనీ లేదు".

అతను ఎక్కడ తింటాడో తెలుసుకోవాలనుకున్నారు. తన మాల స్నేహితుల యిల్లు చూపించి వాళ్ళు తిండి పెడతారన్నాడు. "కాని అది అంత బాగోదు. మంచి మాంసం కూర పంపుతాం" అన్నారు అన్నదమ్ములు. ఆ తిండి ఆశ ఆనందయ్యని కదిలించలేదు. "మీరు మంచి తిండి పంపినా నేను ముట్టను. మీరిచ్చేదానికన్నా గంజి మేలు." ఇంక లాభం లేదనుకున్నారు. "సరే-నీకిష్టమైనదే తిను" అని గొణిగారు. అతన్ని వదిలేసి వెళ్ళారు.

దేవతలకి పెట్టి ఆతరువాత తమకు పెట్టిన ఆ విందు భోజనం తినటం కన్న ఆ అన్నదమ్ములకి దుఃఖంగా ఉంది. ఆనందయ్య తమని వదిలేస్తే చాలా నష్టాలు ఉన్నాయి. భాగవతంలో ఆనందయ్య పాత్రని పోషించే శక్తి వాళ్ళకి లేదు. భోజనాలయాయి. ఆనందయ్య కోసం చూస్తున్నారు. వచ్చాడు. "మంచి తిండిని పోగొట్టుకున్నావు" అన్నారు. " ఆ తిండి తిని మీరు పాపం చేశారు" అదీ జవాబు.

కాని వాళ్ళకి తమ కర్మ ఎలా ఉందో తెలుసుకోవాలని ఆతృతగా ఉంది. ఆనందయ్య చర్మనిష్ఠ శాఖలో ఉన్నపుడు నిగూఢమైన అర్ధరాత్రి ఆనంద తాండవాలు సంవత్సరానికి రెండుమార్లు మాత్రం ఉండేవి. అవేమిటో వాళ్ళకి తెలుసు. అందువల్ల ఏనాడూ ప్రశ్నించలేదు. ఆనందయ్య భాగవతంలో పాల్గొంటూనే ఉండేవాడు. అతను విశ్వాసం ఏదయినా వాళ్ళు సరిపెట్టుకోగలరు. క్రైస్తవుడు అయాక భాగవతం ఆడతాడా అన్నది ప్రశ్న. దాంతో పెద్దక్రిష్ణయ్య అడిగాడు. "నువ్వు రామానుజ మతంలో ఉన్నప్పుడు భాగవతం ఆడావు. చర్మనిష్టలో ఉన్నపుడు ఆడావు. రాజయోగివయావు. అయినా ఆడావు. నువ్విప్పుడు క్రైస్తవుడివయావు. ఇక ముందు ఆడతావా?" "నేను యింకెన్నడూ ఆడను" అన్నాడు ఆనందయ్య.

అన్నదమ్ములు డబ్బుల విషయం ఎత్తారు. అనేక గ్రామాల్లో ఆడమంటున్నారు. దాదాపు వంద రూపాయల కళ్ళజూడబోతున్నారు. కనీసం ఒక నెలయినా ఉంటాడా? ఇంక ఒక్కరోజు కూడా వాళ్ళతో కలవటానికి ఒప్పుకోలేదు.

వాళ్ళు బెదిరించటానికి ప్రయత్నించారు. "నీ పెళ్ళాం నీ మాట

వినకుండా చేస్తాం" ఆనందయ్య వినిపించుకోలేదు.

మరోమారు అతన్ని బతిమాలారు – ''నువ్వు బాగా చదువుకున్నాడివి. పద్యాలు రాస్తావు. ఇప్పుడు నీకు పిచ్చెక్కింది. నీ బ్రతుకు ఎలా ఈడుస్తావు?'' ఆనందయ్య అలిసిపోయాడు. "నన్నది అడక్కండి దేవుడు దోవ చూపిస్తాడు. ఆయనకి నేను తిండికి తగననిపిస్తే చస్తాను." వాదన, బెదిరింపు, అభ్యర్థన ఎలాంటి ఫలితం ఇవ్వలేదూ. అన్నదమ్ములు మౌనం వహించారు. తుఫానుకు ముందు ప్రశాంతతలా ఉంది. వాళ్ళకి ఆనందయ్య అంటే గొప్ప వాళ్ళ సోదర ప్రేమని ఆ పరిస్థితిలోని కోపతాపాలు దాచలేకపోతున్నాయి. నెమ్మదిగా అన్నారు. "అయితే నువ్వు మాతో ఉండరాదు. " తలూపాడు.

నలుగురూ యిళ్ళకి బయల్దేరారు. యిద్దరు ముందుగా వెళ్ళారు. ఆనందయ్య రాకముందే అతని భార్యతో మాట్లాడి ఒత్తిడి తేవాలనుకున్నారు. అంతకు ఆరునెలల ముందే అతను రాజయోగి అయిన వెంటనే పెళ్ళాడాడు. ఆమెకి పద్నాలుగేళ్ళు. అతను ఎదురుపడితే అన్ని విధాలాకోపం చూపించగలిగిన వయసు. హిందూ స్త్రీలా ఆమె పెడబొబ్బలు పెట్టి ఏడిచింది. "నాకు నువ్వక్కర్లేదు. నేను మా పుట్టింటికి పోతాను". ఆనందయ్య ఇంట్లోకి వచ్చాడు. తల్లిని అన్నం పెట్టొద్దన్నారు. సరే అంది. రహస్యంగా కడుపునిండా తిండిపెట్టింది.

ఆనందయ్య యిప్పుడు వెలివేయబడ్డాడు. అన్నదమ్ములు అతనికి పిచ్చెక్కిందని ఊళ్ళో చెప్పారు. రోజులు గడిచేకొద్దీ పెద్రక్రిష్ణయ్య మనసు బండమారింది. ఇతర గ్రామాలలో మాలలను కలసి చెప్పాడు. " ఆనందయ్య క్రైస్తవంలో చేరాడు. మాదిగలతో తిన్నాడు. అతనికి దెయ్యం పట్టింది. మంచినీళ్ళు అడిగినా యివ్వకండి. ఆనందయ్యని ఎప్పుడూ పలకరించలేదు. అతనో దోవన రావటం కనిపిస్తే యింకో దోవన పోయేవాడు. తల్లిమాత్రం ఆనందయ్య పట్ల ప్రేమను చూపించేది. ఆమె మొదట తల్లి. తర్వాతే హిందువు ఆనందయ్య ఆమెకి కొడుకు. ఏమాత్రం అతని కొత్తమతం యిష్టం లేకపోయినా మునుపటిలాగే వండినదాంట్లో కావలసినంత అతనికి పెట్టాల్సిందేనని పట్టుబట్టింది. ఆమె ఎదురుగా ఉంటే అన్నదమ్ముల కోపాలు అణిగిమణిగి ఉండేవి.

అతనికి అంతకు ముందున్న ఉద్యోగం లేదు. అయినా ఆనందయ్యకి సోమరిగా కూర్చుని తినటం యిష్టంలేదు. వాళ్ళ పశువులకి గడ్డి కోసుకువచ్చేవాడు. ఈ పని ఆ యింటి ఆడవాళ్ళు చేసేవారు. దానికి బదులుగా అన్నం పెట్టమనేవాడు. వాళ్ల ఆస్తుల్లో కావాలనుకుంటే అతను ఎక్కువ భాగం తీసుకోగలడు. అతను ఎంచుకున్న పని అతని హోదాకి తగినది కాదు. ఇవి అన్నదమ్ములకి తెలుసు. అతను లేకుండా వాళ్లు అటూ యిటూ వెళ్ళి పూజలు చేయిస్తుంటే అతని మీద ఎంతగా ఆధారపడిందీ వాళ్ళు గ్రహించారు. ఆనందయ్య పిచ్చి గురించి జనం అడుగుతూంటే రోజురోజుకీ వాళ్ళ బాధ పెరిగిపోతోంది. సరిగ్గా సమయానికి వెంకటయ్య ఆనందయ్యతో చాలా స్నేహంగా ఉండటం గుర్తించారు. ఇద్దరూ తరచూ మాట్లాడుకునేవారు. ఇద్దరి ఆలోచన ఒక్కటే అన్నట్టుండేవారు. తల్లి కూడా ఆనందయ్య వేపు మొగ్గుతున్నట్టుంది.

తల్లీ, ఆనందయ్య, వెంకటయ్యా ఓ వేపూ, తాము ఇద్దరూ ఓ వేపూ అయిపోయినట్లు కృష్ణయ్యలు ఇద్దరికీ తెలిసింది. కుటుంబం సంపాదన అంతా వాళ్ళిద్దరే చూసుకుంటున్నారు. వాళ్ళు భరించలేకపోయారు. ఇద్దరూ కలిసి గొడవకి దిగారు. వాళ్ళ నేరాలేమిటంటే గురువులుగా ఆనందయ్య, వెంకటయ్య వాళ్ళపని చెయ్యటం లేదు. అన్నదమ్ములు భాగవతాన్ని ఆడలేకపోతున్నారు. క్రైస్తవ మత ప్రచారం తప్ప యింకే పనీ చెయ్యటం లేదు. వాళ్ళెలా బ్రతకదల్చుకున్నదీ తేల్చమన్నారు. వాళ్ళ బాధ వాళ్ళది. అయతే రెండో వైపు తము నహించగలిగినదంతా సహించామనుకుంటున్నారు. బహిరంగంగా గొడవకి దిగటంతో ఇద్దరూ క్రిష్ణయ్యలు హద్దు దాటారన్నారు. వేంం వెళ్ళిపోవాలనుకుంటున్నాం. అన్నారు. వెంకటయ్య భార్య అప్పటికే మోరంపూడిలో ఉంది. ఆనందయ్య భార్య అప్పటికే కోపం కట్టిపెట్టేసింది. ఆమె పుట్టిల్లు. అక్కడే ఉండటం వల్ల వాళ్ళతో వెళ్లిపోటానికి సిద్దమయింది. ఆ విధంగా క్రిష్ణయ్యలు ఇద్దరికీ భూమి వదిలేసి వాళ్ళు తప్పుకున్నారు.

ఆనందయ్య, వెంకటయ్య పాత జీవితాన్ని వదిలేశారు. వాళ్ళు అడుగుపెట్టాలనుకుంటే కొత్త జీవితం ఎదురుగా ఉంది. భార్యలని మోరంపూడిలో వదిలేసి మిషనరీని చూడటానికి ఒంగోలు ప్రయాణమయ్యారు. అతనితోటి, ఆయన బోధకులు కొంతమంది తోటి మాట్లాడారు. ఇతరుల అనుభవాల నుంచి లబ్ది పొందారు. తామిద్దరం ప్రస్తుతం బాప్టిజం తీసుకోలేమని వాళ్ళ యింటిలో తతిమ్మా వాళ్ళని ముందుగా కలుపుకోకపోతే వారి మనసులు మరింత బండమారిపోతాయని మిషనరీతో చెప్పారు. ఆయన దాన్ని గౌరవించాడు. బలపడిన విశ్వాసంతో, ఇనుమడించిన ధైర్యంతో, ఇంటిదగ్గర తమని ఎలా స్వీకరిస్తారో తెలిసికూడా ఇంటివేపు మళ్ళారు. వాళ్ళు అంతకుముందే బాప్టిజం తీసుకున్నారని వదంతులు వ్యాపించాయి. అనేకచోట్ల ఇద్దరు క్రిష్ణయ్యలూ వాళ్ళిద్దరూ గురువులుగా తగరని చెప్పారు. ఏదీ ఆనందయ్య, వెంకటయ్యలను చలింపజేయలేదు. ఒక పథకం ప్రకారం ముందుకు వెళ్ళారు. ప్రచారానికి చుట్టుపక్కల ఊళ్ళకి వెళ్ళారు. అనేక రోజులు దూరంగా ఉన్నారు. వెళ్ళినచోట తిండికి లోటులేదు. బాప్టిజం తీసుకోకుండానే క్రైస్తవ బోధకులు అయ్యారు.

"వాళ్ళు మరింత దైవం వేపు మళ్ళుతున్నారు. వాళ్ళ పుస్తకాలను తీసేసుకుందాం!" అనుకున్నారు కృష్ణయ్యలు. దొరికిన పుస్తకమాల్లా దాస్తున్నారు. వాళ్ళలోని తరగని ఆధ్యాత్మిక శక్తి ఇప్పుడు కనపడకుండాపోతున్న పుస్తకాలకు మించినది. ఆనందయ్యను ఆ పుస్తకాలు చదవమని అడగటానికి జనం రావటానికి ఎంతో కాలం

పట్టలేదు. ఇద్దరు కృష్ణులు అసూయతో మండిపోయారు. పక్కనే కూర్చుని రామాయణాన్నో భాగవతాన్నో తీసుకుని ఆనందయ్యను వినటానికి వచ్చిన వాళ్ళని తమవేపు రమ్మని తమ దేవుళ్ళ అద్భుత గాథలు వినమనీ పిలవసాగారు.

నంబూరి వారి యిల్లు రెండు మతాలకు యుద్ధభూమి అయిపోయింది. ఇద్దరు కృష్ణయ్యలకూ తాము పట్టు కోల్పోతున్నామని తెలుసు. అయిన వాళ్ళు చేయగలిగిందంతా చేశారు. సంప్రదాయకత్వం యిచ్చే సదుపాయాలన్నీ వారు అనుభవిస్తున్నారు. గతం వారివేపు ఉంది. వాళ్ళ విశ్వాసాలకి వాళ్ళ తంతులకి వందలాది సంవత్సరాల వాడుక ఉంది. ఆనందయ్యా వెంకటయ్య కొత్తని సృష్టిస్తున్నారు. మత విరోధులు. వాళ్ళ కళ్ళ ఎదుట ఉన్నది సామాజిక సంబంధాలలో కొత్త తరంగం. గత విశ్వాసాల పతనం. ఏమైనా యిప్పుడు వారిద్దరూ సాత్విక స్వభావులు. ఒకప్పుడు అందరూ గౌరవించి భయపడే ఆనందయ్యా తను వస్తే చూసి చూడనట్టు ఊరుకుంటున్నారని గ్రహించి మౌనంగా ఉంటున్నాడు. క్రైస్తవుడే అయినా ఆనందయ్యా నీకు అన్నగారు, నీకన్నా తెలిసినవాడు యీ విషయం మరచిపోకు అని తల్లి చిన్న కృష్ణయ్యకు సందర్భం వచ్చినపుడు చెప్పేది.

నెలలు గడిచాయి. ఆనందయ్యా వెంకటయ్యా మొహాలు కళకళలాడాయి. దానికి కారణం ఒంగోలు మిషనరీ రాక. వాళ్ళ ఊరికి దగ్గర తోపులో మకాం వేస్తున్నాడు. ఆ రోజుల్లో ముప్పై ఏళ్ళ క్రితం మిషనరీకి చెప్పేది వినటానికి రమ్మని కబుర్లు పంపనక్కరలేదు. మాటచాలు . ఆ నోటా ఆ నోటా పాకిపోతుంది. ఊరి నుంచి ఊరికి క్షణాలలో వ్యాపించింది. బళ్ళమీంచి దించి, డేరా వేసిన దగ్గర నుంచి ఆనందయ్యా వెంకటయ్యా ఇంటి దగ్గర కనిపించటం మానేశారు. పెద క్రిష్ణయ్య భార్యతో కలిసి తల్లి వెళ్ళి హృదయపూర్వకంగా వింది. జీసస్ క్రీస్తు గురించి మిషనరీ చెప్పిందంతా నమ్మారు. అయితే వాళ్ళ నమ్మకం గురించి అడిగిన వాళ్ళని తప్పించుకున్నారు. ఇంటికి వెళ్ళి మౌనంగా ఉండిపోయారు. తనకీ తన పిల్లలకీ మధ్య గొడవలు లేపేదేన్నయినా ఆ తల్లి భరించలేదు. పెద్ద కృష్ణయ్య భార్య భర్తకి భయపడింది.

ఇద్దరు కృష్ణయ్యలూ అనుకున్నారు. "అందరూ వెళ్తున్నారు. మనమూ వెళ్దాం." ఒంటరిగా, నిర్లక్ష్యంగా ఓ పక్కన నించున్నారు. సోదరుడు ఆనందయ్యతో తాము ఎలా ప్రవర్తించిందీ అందరికి తెలుసు గనుక ఆ పరిస్థితుల్లో ఉదాసీనంగా ఊరుకోవటమే మంచిదని భావించారు. కాని ఆనందయ్యా మాత్రం రాజీ ధోరణిలో ఉన్నాడు. సరయిన సమయం చూసి ఆనందయ్యా మిషనరీతో చెప్పాడు. "వాళ్ళేనా అన్నదమ్ములు" మిషనరీ వాళ్ళతో దయగా మాట్లాడారు. "మీరు క్రీస్తుని ఎందుకు నమ్మరు?" అన్నదమ్ముల జవాబు వాళ్ళ మనసులని క్రీస్తు యింకా స్పర్శించలేదని సూచించింది. "మా పొట్టలెలా గడుస్తాయి? డేరా వేసినచోట చెట్ల మీద పక్షులలని చూపించు మిషనరీ. "దేవుడు ఆకాశంలో పక్షులకీ నీటిలో చేపలకీ తిండిపెట్టడం లేదా? అని అడిగాడు.

వాళ్ళు ఒప్పుకోలేదు గాని, ఇద్దరు కృష్ణయ్యలూ మెత్తబడ్డ మనసుతో కొంతకాలంగా వాళ్ళు ఎరగని అర్ధభావనలతో ఇంటికి వెళ్లారు. పెద్ద క్రిష్ణయ్య దొర గురించి ఆలోచించాడు. అంతకు ముందెప్పుడూ అలాంటి మనిషి చూడలేదు. తన దేశంలోనే ఉండి తిండికి గాని డబ్బుకి గాని ఈ దొరకి లోటు ఉండేది కాదని అతను ఖచ్చితంగా అనుకున్నాడు. తన కడుపు నిండితే చాలని ఈ దొర అనుకోకుండా, ఈ మతాన్ని బోధించటానికి వచ్చాడంటేనే అందులో ఏదో విలువ ఉంది. చిన్న క్రిష్ణయ్యతో తన ఆలోచనలేవీ పంచుకోలేదు.

మిషనరీని అతని బృందాన్ని విడిచిపెట్టలేకపోయారు. ఆనందయ్యా, వెంకటయ్యా. ఆ తరువాత మకాంకి వాళ్లతో బాటే వెళ్ళారు. మిషనరీ చెప్పే మాటలు వేటినీ వాళ్ళు వదులుకోలేకపోయారు. చిట్టచివరికి ఇంటికి వచ్చారు. కొంతమంది ఊళ్ళో వాళ్లతో కలిసి చిన్న కృష్ణయ్య ఎద్దేవా మొదలెట్టాడు. "తిరిగి ఎందుకు వచ్చారు? అన్నాడు. మీ గురువు మిమ్మల్ని నేరుగా స్వర్గానికి తీసుకెళ్ళలేదా? పెద క్రిష్ణయ్య ఏమీ అనలేదు. వంటలో మునిగిపోయింది తల్లి. అన్నగారిని ఎకసెక్కం చెయ్యటం తగదని తల్లి చిన్నక్రిష్ణయ్యకు నచ్చజెప్పింది. "నీకూ అదే పిచ్చిపట్టిందా?" అని అడిగాడు. వెళ్ళినచోటల్లా ఊరివాళ్ళు ఆనందయ్యని అనేక ప్రశ్నలు వేశారు. దొర, అతని గుర్రం, అతని సేవకులు, అతని డేరా, జీవనవిధానం, మాటలూ, చేతలూ గురించి అడిగారు. దొర అక్కడ ఉన్న కొద్దికాలమూ ఆ ప్రాంతంలో తన పరువు ప్రతిష్టలను పెంచాయని ఆనందయ్యా కనిపెట్టాడు. దాన్ని ఉపయోగించుకోలేనంత మందమతి కాదు ఆనందయ్యా.

ఈమధ్యలో పెదక్రిష్ణయ్యకి ఒక అనుభవం కలిగింది. అది అతనికి చాలా ప్రముఖమైనదిగా అనిపించింది. మిషనరీ యాత్రకి రాకముందు ఇది జరిగింది. దగ్గరలో ఓ ఊళ్ళో ఒకతను చనిపోయాడు. పన్నెండో రోజు కర్మలు చెయ్యడానికి ఇంటిని శుద్ధి చేయడానికి పిలిచారు. చిన్నక్రిష్ణయ్యతో కలిసివెళ్ళాడు. శాస్త్రోక్తంగా పెదక్రిష్ణయ్య స్నానం చేశాడు. కుటుంబమంతా ఎదురుగా కూర్చుంది. పెద్దపీటమీద గుడ్డపరిచాడు. బియ్యంపోశాడు. దానిమీద విష్ణువు పూజకి విగ్రహాలు ఉంచాడు. పూజ చేశాడు. కోళ్ళు, గొర్రెలూ కోసి చేసిన కూరలు, పప్పు, అన్నం, ఓ కుండెడు సారాయి విగ్రహాలకి నైవేద్యం పెట్టాడు. యదావిధిగా మంత్రాలు చదివాడు. అగరువత్తులు వెలుగుతున్నాయి. ఆ రాత్రి అందరూ పడుకునే వరకూ తింటున్నారు. తాగుతున్నారు.

తెల్లారేసరికి ఒకరి తర్వాత ఒకరు లేచారు. బియ్యం మీద ఉంచిన విగ్రహాల దగ్గరికి ముగింపు తంతులు పూర్తి చేయటానికి వెళ్ళాడు. పెద కృష్ణయ్య. ఆశ్చర్యం తొమ్మిది అంగుళాల పొడవున వెండి, బంగారం రాగి కలిపి చేసిన విగ్రహం మాయమైపోయింది. అన్నిటిలోకి అదే పెద్దది. అది వెంకటేశ్వరుడి విగ్రహం. తతిమ్మా

తొమ్మిది విగ్రహాలతో కలిసి ఒక తరం మరో తరానికి అందిస్తున్నది. కుటుంబ పెద్దని పిలిచి అడిగాడు పెదక్రిష్ణయ్య. "ఇదేంటి" పెద్ద విగ్రహం కనపట్టం లేదు! అన్ని చోట్లా చూశారు. ఇంటి చుట్టుపక్కలాలేదు. దూరంగా వెదికారు. ఇంటికి దగ్గరలోనే చెత్తలో దొరికింది. ఆ రాత్రి ఓ కుక్క వచ్చింది. అందరూ కడుపు నిండా తిని గాడ నిద్రలో ఉన్నారు. తినేదేమోననుకుని పళ్ళ గరుచుకుని పట్టుకుపోయింది కుక్క.

ఇంటిల్లిపాదీ వణికిపోయారు. ''స్వామికి కోపం వచ్చి ఉంటుంది. మన మీద పడే కీడుని తప్పించడు" అనుకున్నారు. చింతపండు నీళ్ళు తయారు చేశారు. పెద్దక్రిష్ణయ్య విగ్రహాన్ని తోమి కడిగాడు. దానికి విస్తారమైన పూజ చేశాడు. కర్పూరం బాగా వెలిగించారు. అనేక మంత్రాలు చదివాడు. జరిగిన అవమానానికి వెంకటేశ్వరుడు క్షమిస్తాడని అనుకున్నారు.

ఇద్దరు కృష్ణయ్యలూ ఇంటికి వస్తున్నారు. భుజాన బియ్యపు మూట ఉంది. మన మీద పడే కీడుని తప్పించడు". అనుకున్నారు. చింతపండు నీళ్ళు తయారుచేశారు. పెదక్రిష్ణయ్య విగ్రహాన్ని తోమి కడిగాడు. దానికి విస్తారమైన పూజ చేశాడు. కర్పూరం బాగా వెలిగించాడు. అనేక మంత్రాలు చదివాడు. జరిగిన అవమానానికి వెంకటేశ్వరుడు క్షమిస్తాడని అనుకున్నారు.

ఇద్దరు కృష్ణయ్యలూ ఇంటికి వస్తున్నారు. భుజాన బియ్యపు మూట ఉంది. పెద్ద కృష్ణయ్య లోపల్లోపల అనేక ఆలోచనలు. "పూజలు చేసే స్వామిని కుక్క తన పళ్ళతో కొరికి తీసుకెళ్ళగలదా? మేం ఒక దేముడికి తిండిపెట్టాం. ఇదిసరిపోదని ఆ దేముడు చెప్పలేదు. నన్ను తీసుకెళ్ళవద్దని కుక్కతో చెప్పలేదు. అలాంటి దేముడు నన్నేం రక్షిస్తాడు? ఇదంతా శుద్ధ భ్రమ."

ఈ అనుభవం తర్వాత పెద్ద కృష్ణయ్యలో మార్పు వచ్చింది. వెంకటేశ్వరుడి విగ్రహాన్ని పళ్ళ గరచుకుని పోయిన కుక్క విగ్రహాల మీద అతని నమ్మకాలని చెల్లాచెదురు చేసింది. మనసులోని ధృఢత్వాన్ని అతని మనో నిశ్చయాన్ని అతని బుద్ధి అంగీకరించటం లేదన్న వాస్తవాన్ని అతను బయటపడనివ్వలేదు. లోపల అంతర్యుద్ధం జరుగుతోంది. మిషనరీ రాక కేవలం దాన్ని తూర్యస్థాయికి చేర్చింది. ఏది ఏమైనా అతను లొంగిపోదలుచుకోలేదు. పౌరోహిత్య విధులు యింక చెయ్యలేనని తేల్చుకునే వరకూ అవి చేసి తీరతాడు. ఇలా అతను సర్ది చెప్పుకున్నాడు.

పొరుగూరిలో ఏదో ఇంటిలో తంతులకి ఇద్దరు క్రిష్ణయ్యలనీ పిలిచారు. దోవలో ఇద్దరూ మాట్లాడుకున్నారు. " ఈ క్రైస్తవ మతం గురించి నువ్వేంటనుకుంటున్నావు? ఇది మంచిదా చెడ్డదా?" పెద్ద క్రిష్ణయ్య అడిగాడు. "నన్నెందుకు అడుగుతావు? నీకు నువ్వు చెప్పుకో?" అన్నాడు తమ్ముడు. అది నిజమైన మతమన్న తన భావాన్ని వ్యక్తం చేశాడు. "మనం ఆనందయ్యనీ వెంకటయ్యనీ వేళాకోళం చేస్తున్నాం. కాని మనం చేస్తున్నది తప్పు. వాళ్ళు చేస్తున్నది ఒప్పు" అన్నాడు. ఒక విచిత్రమైన మనస్థితిలో అతను పూజ చేయటానికి వెళ్తున్నాడు. ఒక్కొక్క విగ్రహాన్ని తీసి వాటి స్థలంలో ఉంచుతూ చిన్న కృష్ణయ్యను చూసి ఒక తిరస్కారపూరితమైన నవ్వు నవ్వాడు.

చుట్టూ చేరిన కుటుంబం తప్పుపట్టింది. "మీరు భక్తిశ్రద్ధలతో పూజలు చేయకపోవటం వల్ల మాకు చాలా నిస్త్రాణగా ఉంది. ఆ తరువాత డాబు చెయ్యబోయాడు. కాని చేతులు వణికాయి. మనిషి పట్టు దప్పాడు. కొంచెం కూడా ముందుకు వెళ్ళలేకపోయాడు. అంతకు ముందెప్పుడూ అలా జరగకపోవడం వల్ల ఏం జరుగుతుందా అని సందేహించాడు. సగం మంత్రాలు కూడా చదివలేకపోయాడు. అలవాటుకన్న ముందే యింటికి బయల్దేరాడు. రాత్రికి ఉండమన్నారు ఊరివాళ్ళు. కాని ఒప్పుకోలేదు. చిన్న క్రిష్ణయ్యకి చాలా విచారంగా ఉంది. ఇంటికి వెళ్తున్నపుడు అన్నాడు. "అన్నయ్యా! నువ్వు కూడా ఆ మతంలోకి పోతున్నట్టున్నావు. అపుడు నేను యింకో దేశం పోవాలి. భయపడకు వాళ్ళిద్దరిలాగే మనమూ కలిసే ఉందాం" అని ఓదార్చాడు.

ఆ తర్వాత రాత్రి అనుభవం గురించి పెద కృష్ణయ్య చెపుతుంటాడు. నా మనసులోకి ఇద్దరు ప్రవేశించారు. తెల్లవారీ దాకా పెద్ద యుద్ధం జరిగింది. మంచి ఆలోచనలు వచ్చాయి. చెడ్డ ఆలోచనలు వచ్చాయి. 'నువ్వు క్రీస్తుని విశ్వసిస్తే నీకు ఆశీర్వాదం దొరుకుతుంది. అంది ఒక గొంతు. ''నీకేం దొరుకుతుంది? నీ పూర్వీకులుకి స్వర్గం దక్కలేదా? ఈ మతం నించి నువ్వు ఏం ఆశిస్తున్నావు?" అంది మరో గొంతు. రాత్రంతా నిద్ర లేదు. నేను ప్రార్థించలేకపోయాను. నాలో నేను మాత్రం అనుకున్నాను. " ఓ దైవమా! నా పాపాలు తొలగించు. స్వర్గాన్ని ప్రసాదించు." తెల్లారేక ఇంటి చూరులో ఆనందయ్య ఏమైనా పుస్తకాలు ఉంచాడా అని చూశాను. తీసుకుని చదివాను. శాంతి కలిగింది.

పెద కృష్ణయ్య గందరగోళం ముగిసింది. కాని ఈ మధ్యలో ఆనందయ్య ఏడి? ఆశ కోల్పోతే హృదయం రోగగ్రస్తమౌతుంది. సుదీర్ఘ నిరీక్షణలో అలసట, సహనభారమూ అతని శరీర ఆరోగ్యాన్ని దెబ్బకొట్టినట్టున్నాయి. అనారోగ్యంగా ఉన్నాడు. సమీప గ్రామంలోని కొందరు మిత్రులతో ఉన్నాడు ఆనందయ్య. వారు కూడా అతని ద్వారా క్రీస్తుని నమ్ముతున్నారు. గాని ఇంకా బాప్టిజం తీసుకోలేదు. " ఆనందయ్య ఎక్కడున్నాడు" అని తల్లిని అడిగాడు. చెప్పింది.. ఆమె గొంతులోని మౌన తిరస్కారం అతనికి గుచ్చుకొంది.

ఆనందయ్య వచ్చే దోవలో బయల్దేరాడు. కొంచెం దూరంలో తన వాళ్ళతో కలిసి వస్తుండటం చూశాడు. ఆనందయ్య వచ్చే దోవను తరచుగా వదిలేసే పెద్ద కృష్ణయ్య ఇప్పుడు అతనివేపు నడిచాడు. పలకరించాడు. ఆనందయ్య కదలకుండా నిలబడిపోయాడు. అతనివేపు నడిచాడు. పలకరించాడు.

ఆనందయ్య కదలకుండా నిలబడిపోయాడు. అతనివేపు చూశాడు. ఆశ్చర్యం! అతని చూపులో కఠినత్వం లేదు. అతనిని కావలించుకుని అడిగాడు. "అన్నయ్యా! దైవం నీ మనసుని ఎలా మార్చాడు? ఈ మంచి మార్గంలోకి వచ్చే మంచి బుద్ధిని ఎలా ఇచ్చాడు? ఒకరినొకరు గాఢంగా కావలించుకున్నారు. ఇన్నాళ్ళూ అణచబడ్డ సోదరభావం చిట్టచివరకి నెగ్గింది. ఆపద్దెనిమిది నెలల కాలం గురించి ఈనాడు పెదకృష్ణయ్య అంటాడు. నాలో ఏదో భూతం ఆవహించింది. ఆనందయ్యకి తన అనుభవమంతా చెప్పాడు. వెంకటేశ్వరుడి విగ్రహాన్ని కుక్క ఎత్తుకుపోవటం, పూజ చెయ్యలేక చేతులు వణకటం, గడచిన రాత్రి తన మనసులో ఇద్దరి యుద్ధం గురించి చెపుతూంటే కన్నీళ్ళు ధారగట్టాయి.

ఆనందయ్యకి కూడా చెప్పవలసిన సంగతి కొంత ఉంది. పదిరోజులలోగా పెదకృష్ణయ్య క్రీస్తుని అనుసరిస్తాడని తోటి మిత్రులతో ప్రార్ధనా సమయంలో చెపుతున్నాడు. "అన్నయ్యా! ఎనిమిది రోజులుగా నీకోసం ప్రార్ధిస్తున్నాము. పొద్దుట లేచాక నేను ఉండలేకపోయాను. నీలో మార్పు వచ్చిందేమో చూద్దామని వెంటనే బయలుదేరాను.

కలిసి ఇంటికి వెళ్లారు. ''నీ భార్యని తీసుకురా. చదువుకుందాం. ప్రార్ధిద్దాం'' అన్నాడు. ఆనందయ్య అతను పిలుస్తున్నప్పుడు ఆమె వాకిలి తుడుస్తోంది. వెంటనే తన చీపురు పారేసి ఆనందంగా పరుగెత్తుకు వచ్చింది. తల్లి వచ్చింది. అలాంటి తల్లుల అవ్యాజ్య ప్రేమే కుటుంబాలను కలిపి ఉంచుతుంది. వెంకటయ్య వచ్చాడు. ఇన్ని నెలలు వాళ్ళు అంత బాధపడుతూ కూడా తననెంత సహించిందీ పెదకృష్ణయ్య చూశాడు. వాళ్ళు నేర్చుకున్న క్రైస్తవ గీతాలలో ఒకటి పాడుతూంటే తనూ గొంతు కలపబోయాడు. మాథ్యూ ఏడవ అధ్యాయం ఆనందయ్య చదువుతుంటే విన్నాడు. అతను ప్రార్ధించలేకపోయాడు గాని ఆనందయ్య ప్రార్ధిస్తుంటే పక్కనే మోకరిల్లాడు.

ఆ తర్వాత కుటుంబమంతా మాట్లాడుకుంది. "బంగారపు తాతయ్య ఇటు నుంచే నెలవారీ సమావేశానికి ఒంగోలు వెళతాడు. మనమూ అతనితో వెళ్ళి బాప్టిజం తీసుకుందాం'' అన్నాడు ఆనందయ్య. పెద్దక్రిష్ణయ్య సిద్ధంగా లేడు. "మీరు వెళ్ళండి. నేను చేసిన పూజలకి ఇక్కడా అక్కడా ధాన్యం రావాలి. అదంతా తెచ్చుకుంటాను. ఓ నెల అయాక నేనూ వస్తాను'' అన్నాడు. ఆనందయ్య దీనికి ఒప్పుకోలేదు. అన్నతో వాదించాడు. చిట్టచివరగా ప్రశ్నించాడు. "ఈ ధాన్యం పోగేయటంలో నువ్వు చచ్చావనుకో. నువ్వు ఎక్కడికి వెళతావు?" పెద్దక్రిష్ణయ్య అంగీకరించాడు. ఒక మాల పూజారిగా తనకి రావలసిందంతా వదిలేసాడు. పౌరోహిత్యం నుంచి తప్పుకున్నాడు.

ఇంకా కుటుంబమంతా ఒక్కటవలేదు. చిన క్రిష్ణయ్య చాలా బాధపడ్డాడు. ఆ రాత్రి వేరేగా పడుకున్నాడు. పగలు ఒంటరిగా ఉన్నాడు. అన్నదమ్ములను వదిలేసి ఇతర మాల పూజారులతో కలియాలనుకున్నాడు. కాని అన్నదమ్ములు ప్రేమగా మాట్లాడారు. ఒంగోలు వెళ్ళి బాప్టిజం తీసుకుందామనుకుంటున్నాం. నీ కోపం అంతా వదిలేసి విషయం జాగ్రత్తగా ఆలోచించు. అన్నారు. అతని మనసు మెత్తబడింది. వాళ్ళలో అతనూ ఒక చిన్న శిష్యుడైనాడు.

బంగారపు తాతయ్య అనుచరులతో వచ్చాడు. అంతా వినేవరకూ కూర్చుని విశ్రాంతి తీసుకోలేదు. అతను తన హుందాతనంతో అన్నాడు. " ఇదంతా దేముడు ఇచ్చాడు. నేను దీనికోసం ప్రార్ధించాను."

నలుగురు అన్నదమ్ములూ క్రైస్తవ బోధకులయ్యారు. ముగ్గురు యిల్లు వదిలి మాదిగలు క్రైస్తవులవుతున్న ఉద్యమంలో పనిచేశారు. పెద క్రిష్ణయ్యతోబాటు తన పాత యింటిలో పండు ముదుసలి అయేవరకూ తల్లి జీవించింది. క్రైస్తవం రాక ఆమె బిడ్డల జీవితాలను వింతగా మార్చేసింది. వాళ్ళు మాల పూజారులుగా ఉండిపోయుంటే అందరూ విభిన్నంగా ఉండేవారు. ఆమెకి బాధలేదు. సంతోషం తప్ప. ఎందుకంటే ముక్తి కేవలం క్రీస్తు ద్వారా మాత్రమే లభిస్తుందని ఆమెకి తెలుసు.

# 3. మతద్వేషి-అతని అంతం

కూచిపూడి గ్రామ సంతలో ఓ కొనన చెట్టు నీడలో అనేకమంది శూద్రులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. మామూలుకన్న హెచ్చుగా వాళ్ళు ఉద్రేకంగా ఉన్నారు.

"వాళ్ళకి మన బడి అంత బడి ఉంది. చదువుకుంటే మన పని ఎలా చేస్తారు?" ఇంకొక శూద్రుడు అన్నాడు.

"నాకో ఎద్దుంది. చాలాకాలంగా జబ్బుగా ఉంది. అది చనిపోయింది. మాదిగలను పిలిచాక ఊరి బయటకు తీసుకువెళ్ళారు. చర్మం ఒలిచారు. మిగిలింది కప్పెట్టారు. వాళ్ళు యివ్వాల్సిన చెప్పుల కోసం అడిగాను. మునుపు యిచ్చినంత యివ్వమన్నారు. నేను మీకు మొత్తం ఎద్దుని యిచ్చాను గదా! అన్నాను. మీరు మాంసం ఎందుకు కప్పెట్టారు? అని కూడా అడిగాను. "ఆ కుళ్ళు మళ్ళీ మా వాడలోకి తీసుకెళ్ళం అన్నారు. వాళ్ళని ఏం చెయ్యాలి? తాత తండ్రుల నుంచి వస్తున్న ఆచారాన్ని వదిలేస్తున్నారు." అన్నాడు మరొకడు.

గ్రామ మునసబు, బల్లవంటి దుర్గయ్య నాయుడు, అందాకా మౌనంగా ఉన్నాడు. పక్కనున్న కండువా అందుకున్నాడు. తలకి చుట్టాడు. వెళ్ళటానికన్నట్టు లేచాడు. "బాప్టిజం కోసం పదిమంది ఒంగోలు వెళ్ళారు. రానీండి. వచ్చాక వాళ్ళని పూర్వంలా చేస్తాను. గుణపాఠం చెపుతాను" అన్నాడు.

దుర్గయ్య నాయుడు మహాక్రూరుడు. ఓ మారు ఆరంభించాడంటే అంతు చూడకుండా వదలడు. మహా పట్టుదల మనిషి. అతను లేవటం చూశారు శూద్రులు. వాళ్ళకి అందులో తప్పు కనిపించలేదు. వాళ్ళూ వాళ్ల తాత తండ్రులూ మాదిగలకి రక్షకులమని అన్నం పెడుతున్నామనీ అనుకునేవారు.

"వాళ్ళు మనని అగౌరవించటం లేదు. ఆదివారం రాలేమన్నా వాళ్ళు మన కాళ్ళా వేళ్ళా పడుతున్నారు. మర్నాడు పనికి రానివ్వమని బతిమాలుతున్నారు. సాగదీస్తూ ఒకడు అన్నాడు.

దుర్గయ్య నాయుడు మొహంలోని కోపాన్ని సరిగా పట్టించుకోకుండా ఒకడు అన్నాడు. " ఇదెలా ముగుస్తుంది? మన పనికి మరొకరిని చూకోవాలి."

మునసబు దుర్గయ్య నాయుడు కొన్నాళ్ళు పోయాక క్రైస్తవులైన పది మంది మాదిగ పెద్దలను పిలిచాడు. "మీరు ఒంగోలు వెళ్ళి క్రీస్తు పేరుతో నీటిలో మునిగారు. మీరు మైలపడ్డారు. మీరు యిక్కడ చెరువులో మునిగి ఆ మైలను కడుక్కుంటే తప్ప మిమ్మల్ని ఊళ్ళో అడుగుపెట్టనివ్వం'' అన్నాడు. శూద్రుల ఊరికి మాదిగవాడకీ మధ్యన ఉంది చెరువు. గ్రామకరణం వచ్చాడు. ఏం ఆజ్ఞ యిచ్చినా అమలు చెయ్యటానికి తయారుగా ఉన్నారు వెట్టివాళ్ళు. చాలామంది శూద్రులు ఏం జరుగుతుందో చూద్దామని వచ్చారు. దుర్గయ్య నాయుడు తేలిగ్గా వదలడని వాళ్ళకు తెలుసు. ఆ పదమంది చుట్టాలూ స్నేహితులూ భయాందోళనలతో పరిగెత్తుకుంటూ వచ్చారు.

భయంతో వణికిపోతూ కూడా మునసబు చెప్పినట్టు చెయ్యటానికి క్రైస్తవులు ఒప్పుకోలేదు. వాళ్ళ బోధకుడు తోడుగా నిలబడి ధైర్యం చెప్పాడు. గుంపు అంతా చెరువు వేపు నడిచింది. "వెళ్ళండి. నీటిలో మునగండి. ఒంగోలు మైల వదిలిపోవటం నేను చూడాలి" అన్నాడు దుర్గయ్యనాయుడు. వాళ్ళు ఒక్క అంగుళం కదలలేదు. వెట్టివాళ్ళని పిలిచి కర్రలు మెడలమీద పెట్టి నీటిలోకి తోసెయ్యమని అరిచాడు. వాళ్ళు ఏడుస్తున్నారు. వద్దువద్దంటున్నారు. న్యాయం కాదంటున్నారు. "ముంచెయ్యండి! మైల వదిలిపోవాలి అరిచాడు. అందరూ బలవంతంగా వాళ్ళని నీట్లోకి తోసేసారు. అవమానాలకు క్రౌర్యం తోడయింది.

మునసబుకి అది చాలలేదు. అంతకు ముందు పూజలను క్రైస్తవులచేత మొదలెట్టించాలి. ఆ చెరువు గట్టున పోలేరమ్మ రాతి బొమ్మ ఉంది. అరుపులు కేకల మధ్య ఓ గేదెని మేకని తీసుకువచ్చారు. విగ్రహం ముందు నిలబెట్టారు. వెట్టివాళ్ళు నరికారు. వెచ్చటి రక్తం విగ్రహాన్ని తడిపింది. రక్తదాహం ఎప్పటికీ తీరని ఆ దేవత చాలా సంతోషిస్తుందని అనుకున్నారు. క్రైస్తవులని బలవంతంగా విగ్రహానికి మొక్కించారు. కొంచెం రక్తం తీసి నుదుట బొట్టు పెట్టారు.

రాత్రంతా భయానకంగా గడచింది. వాద్యాలతో పోలేరమ్మ దేవత గాథలని గాయకులు పాడారు. సారా మత్తులో జనం విగ్రహం చుట్టూ ఆడారు. క్రైస్తవులని కూడా ఆడమన్నారు. లొంగిపోయారు. కాదంటే చావు తప్పదని వారికి తెలుసు. దొంగతనంలో ఇరికించి తాసిల్దారు ముందుకి లాక్కెళతానని మునసబు బెదిరించాడు. తము నేరం చెయ్యలేదని రుజువు చేసుకోటం కష్టం, అసంభవం అని వారికి తెలుసు.

మాదిగవాడ నుంచి క్రైస్తవం తుడిచిపెట్టుకుపోయిందని శూద్రులు భావించారు. వాళ్ళు వాదించారు. "వాళ్ళలో ఎవరైనా కులాన్ని పోగొట్టుకుంటే పూజారి పూజలన్నీ చేసి నాలుక మీద బంగారం తీగతో కాలిస్తే అంతకుముందు చేసిన అపరాధాలు తొలగిపోతాయి గదా!" కులంలో వాళ్ళకి వర్తించే విధానాలు కులం నుంచి వెలివేయబడ్డ వాళ్లకి వర్తించటం అన్న ప్రశ్నే లేదు. అయితే ఇప్పుడు తీసుకున్న చర్యలు తప్పకుండా కఠినమైనవి. అలాంటిచోట వాదనలు సాగవు. క్రైస్తవులు నిరంతరం భయాందోళనలతో ఉంటున్నారు. తమ మత విశ్వాసాలు అనవసరంగా ప్రదర్శించకుండా జాగ్రత్త పడుతున్నారు. ఒంగోలు మిషనరీకి తమ మీద జరిగిన క్రూరమైన దాడి గురించి చెప్పుకున్నారు. వాళ్ళు గనుక ఎదురించితే నిలబడలేరని అతనికి తెలుసు. దాంతో

ప్రశాంతంగా ఉండమని, ప్రార్థించమని, దేముడిని నమ్మమని, ఆయనే సాయం చేస్తాడని సలహా చెప్పాడు మిషనరీ. అనేక నెలలు గడిచాయి. మిషనరీ వస్తున్నాడని వార్త వ్యాపించింది. బస చేసిన దగ్గరల్లా మునసబు కరణాలకు కబురు పంపేవాడు. వాళ్ళతో మర్యాదగా ఉండేవాడు. జీసస్ క్రీస్తు గురించి ఆయన మానవజాతికి యిచ్చిన ముక్తి మార్గం గురించి ప్రజలకు చెబుతున్నదీ వినమని, సభలో ఉండమని కోరేవాడు. బదులుగా గ్రామ ఉద్యోగులు సాధారణంగా ఆయనతో అన్ని విధాలా మర్యాదగా ఉండేవారు. అయితే కొన్ని సందర్భాలు లేకపోలేదు. గ్రామాధికారులతో మిషనరీకి మాదిగల క్షేమం తమకు చాలా ముఖ్యమైనదని నొక్కి చెప్పటం అవసరమయ్యేది.

పక్క ఊరిలో దొర మకాం చేసినపుడు ఏం జరిగిందీ కూచిపూడి దగ్గర తోపులో డేరా వెయ్యకముందే ఊరందరికీ తెలుసు. బ్రాహ్మణులందరూ గుంపుగా వచ్చారు. న్యాయం చెయ్యమన్నారు. కొందరు క్రైస్తవులు దూరం నుంచి దొర బసకి వెళ్తూ వాళ్ళ వీధిలోంచి నడిచారుట. ఓ బ్రాహ్మణుడు నడుస్తూ ఉంటే దోవ పక్కకి తప్పుకుని దూరంగా నిలబడటం మాదిగలపురాతన ఆచారం. ఎందుకంటే మాదిగల గాలి తగిలి బ్రాహ్మడు కలుషితమైపోతాడని భావించబడేది. తమ పాత పద్ధతులలోని ఈ నీచత్వాన్నించి క్రైస్తవులు తొందరగా బయటపడుతున్నారు. ఆరోజు బ్రాహ్మణులు దారి వదలమన్నపుడు, వాళ్ళు ముందుకు వెళ్ళకుండా అడ్డుకున్నపుడు ఒక క్రైస్తవ వనిత అనుకోకుండా ఒక బ్రాహ్మడిని ముట్టుకోవడం జరిగింది. ఆ కొద్దిపాటి బ్రాహ్మణ సమాజానికే దానితో చాలా అవమానమైపోయింది. మిషనరీని కలపటం వల్ల వాళ్ళకి ఎలాంటి ఫలితమూ దక్కలేదు. "బజారు ప్రజలందరిదీ. తమని ఎవరూ ముట్టుకోకూడదంటే వాళ్ళే పక్కకి తప్పుకోవాలి" అన్నాడు మిషనరీ. పాత సాంఘిక సంబంధాల మీద వాస్తవానికి ఇది తిరుగుబాటు. ఒక మాదిగ వెళ్తుంటే బ్రాహ్మణుడు పక్కన నించుని దారి యివ్వాలని చెప్పటంతో సమానం.

దాంతో మిషనరీ వచ్చేసరికి కూచిపూడిలో ఉద్రిక్తంగా ఉంది. అతను ఉదయాన్నే మాదిగలను కలిశాడు. మధ్యాహ్నం మునసబు దుర్గయ్యనాయుడిని తన గుడారానికి ఆహ్వానించాడు. మిషనరీనాయుడిని మర్యాదపూర్వకంగా చూశాడు. కూర్చోడానికి కుర్చీ యిచ్చాడు. మాట్లాడాడు. చాలాసేపు నచ్చజెప్పాడు. బయట ఉన్నవాళ్ళు డేరా గుమ్మంలోంచి చూస్తున్నారు. లోపల ఏ గొడవా లేకపోవడంతో నిరుత్సాహపడ్డారు. కూచిపూడి బోధకుడు, ఇతర బోధకులూ ఆయనతో బాటే డేరాలో కూర్చున్నారు.

ఆంగ్ల ప్రభుత్వ సమదృష్టికి వ్యతిరేకంగా మునసబు అధికార దుర్వినియోగం చేస్తున్నాడని తెలియజెప్పడానికి మిషనరీ ప్రయత్నిస్తున్నట్లుంది. దొర ఈ పద్ధతిలో మాట్లాడాడు. "రాణి మనకి తల్లి. నువ్వు ఆవిడ కూలిని తింటున్నావు. అందువల్ల ఆవిడ ప్రజలందరినీ నువ్వు ఒకేలా చూసి తీరాలి. ఆంగ్ల చట్టం ప్రకారం ఈ క్రైస్తవుల మీద మతద్వేషం చూపించే హక్కు నీకు లేదు. నువ్వు వాళ్ళని పెట్టిన కష్టాల మీద అనేక ఉత్తరాలు నాకు అందాయి. నువ్వు తప్పు చేస్తున్నావు. నువ్వు చేస్తున్నది దేవుడు చూస్తున్నాడు. ఒక క్రైస్తవునిగా, ఈ దేశ పరిపాలకుల అభీష్టాలకు వ్యతిరేకంగా పనిచేస్తున్నావని తెలిసిన మనిషిగా, నేను నిన్ను ఇదంతా ఆపమని చెపుతున్నాను." దుర్గయ్యనాయుడు ధనవంతుడు. సుఖంగా బ్రతికినవాడు. భారీ మనిషి డేరాలోకి ప్రవేశిస్తున్నపుడు బిగుసుకుపోయినట్లు కనిపించాడు. మిషనరీ యింత దూరం ప్రయాణం చేసి తన పనులను పరిశీలించడానికి వచ్చి ఏమంటాడోనని కొంత ఆదుర్దాగా ఉన్నాడు. తనకి కేవలం నచ్చజెపుతున్నారనిపించగానే అక్కడ కూర్చున్న వాళ్ళ మాటల్లో చెప్పాలంటే. 'కప్పలా ఊపిరి పీల్చుకున్నాడు' చివరకి క్రైస్తవులని బాధపెట్టనని దయగా చూసుకుంటానని ఒప్పుకున్నాడు.

మిషనరీ ఆ రాత్రికి వెళ్ళిపోతారన్న భావనలో ఉన్నాడు నాయుడు. తనూ ఇతరులూ కలిసి కూచిపూడి క్రైస్తవులని తిరిగి విగ్రహారాధనలోకి తెచ్చామని, మిషనరీ వెళ్ళిపోయాక అంతా మునుపటిలాగే ఉంటుందని అనుకున్నాడు. పోటీలో తనే ముందున్నట్టు రుజువయినట్టు ఖచ్చితంగా కనిపిస్తోందనుకున్నాడు. అతను మిషనరీ డేరాని వదిలి రాగానే ముప్పై మంది వెళ్ళి బాప్టిజం అడిగారు. దొర వాళ్ళని నిరుత్సాహపరిచాడు. ఈ ఊళ్ళో నిలబడాలంటే మీకింకా గట్టి నమ్మకం ఉండాలి అన్నాడు. కాని వాళ్ళు ఏం జరిగినా సరే ఎదుర్కొంటామని బాప్టిజం యిమ్మన్నారు. ఇదంతా తెలిసినపుడు మునసబు కోపంతో మండిపోయాడు.

తెల్లవారు జామున మునసబు వెట్టివాళ్ళనీ తన సేవకులనీ పోగుచేసి చెరువుదాటి మాదిగవాడవైపు నడిచారు. కొంతదూరంలో నిలబడ్డారు. బాప్టిజం కోరిన వాళ్ళలో ముఖ్యమైనవాడిని వెట్టివాళ్ళు వెళ్ళి తీసుకువచ్చారు. "దొర నిన్న రాత్రి వెళ్ళిపోవాలి. మీరు ఆపారు. పరిగెత్తిపోయారా సరే లేకపోతే చంపేస్తాను" అన్నాడు కోపంగా. అతని మొహంలోని తెగింపు చూసేసరికి వాళ్ళు వణికిపోయారు. అతని కోపానికి దొరక్కూడదని పొలాలలో అడ్డబడి పరుగెత్తారు.

పరిస్థితి అదుపు చేయటానికి దుర్గయ్య నాయుడు స్వయంగా నిలబడ్డాడు. మిషనరీ డేరాకీ మాదిగవాడకీ మధ్య చెరువు గట్టున చెట్ల కింద నిలబడ్డాడు. పదిమంది ప్రముఖ శూద్రులు పెద్ద పెద్ద బడితలతో అతని చుట్టూ నిలబడ్డారు. మిషనరీ చెరువువైపు వచ్చేసరికి సూర్యోదయం అయింది. కొందరు మాదిగలు పారిపోయారని విన్నాడు. దుర్గయ్యనాయుడు అక్కడే నిలబడి డేరా వైపు వస్తున్న వాళ్ళందరినీ కనిపెట్టడం చూశాడు.

అంతకు ముందు రోజు జరుగుతుందనుకున్న గొడవ ఇప్పుడు జరిగింది. ఇద్దరూ అసాధారణమైన శక్తుమంతులు. ఒకరు క్రైస్తవ బోధకులద్వారా బానిసత్వాన్ని అణిచెయ్యడానికి తొలి అడుగులు

వేస్తూన్న వ్యక్తుల హక్కులను పరిరక్షించటంలో శక్తిమంతుడు. సత్వా పూర్వీకులను అణచిపెట్టి ఉంచినట్టే వాళ్ళనీ సాంప్రదాయపు ఉక్కు పిడికిలిలో పట్టి ఉంచటంలో శక్తిమంతుడు మరొకరు. క్రైస్తవులు తమ దొర చుట్టూ చేరారు. అతని ఇద్దరు విశ్వాసపాత్రులైన సేవకులు, బండివాళ్ళు, లస్కర్స్ కూడా వచ్చారు. శూద్రులు అనేకమంది సమస్య ఏమవుతుందా అని చూడటానికి వచ్చారు.

అప్పటి నుంచి అనేకమార్లు దొర దుర్గయ్య నాయుడికి ఆ ఉదయం ఏం చెప్పాడో చెప్పమని కూచిపూడి భోధకుడిని అడిగేవారు. అతను మరిచిపోతే వెనక నుంచి గుర్తు చేయటానికి చాలామంది సిద్ధంగా ఉండేవారు. ప్రజల జ్ఞాపకాలలో ఈనాటికీ మిగిలిపోయిన మిషనరీ మాటలు ఇవి.''నేను నిన్న రాత్రి నిద్రోయానని నువ్వనుకుంటే అది పొరపాటు. కొన్ని నిముషాలు నిద్రోయాక లేచి కూర్చున్నాను. నీ గురించే ఆలోచించాను. నిన్న నీతో దయగా మాట్లాడాను. నువ్వన్న మాటను ఈ ఉదయం జవదాటావు. చేసిన పాపపు పనులకు ఆంగ్లేయ ప్రభుత్వం శిక్షిస్తుందని నీకు తెలియదా? నువ్వు కప్పలాంటాడవి. ఎద్దంత అవుదామని గాలి కొడితే పగిలిపోయిందా కప్ప. నువ్వు నీ ఉద్యోగం పోగొట్టుకోవచ్చు''

మునసబు నిర్లక్ష్యంగా అన్నాడు. "పోతే నాకేం నష్టం''?

దాంతో దొర కోపానికి హద్దు లేకపోయింది. అతని కళ్ళు నిప్పులు కక్కాయి. "జైలుకి వెళ్తే నీకు తెలిసొస్తుంది. ఒక నేరస్తుడిగా తట్టలతో రాళ్ళు మోస్తావు. రోడ్డు పనిచేస్తావు. ఆంగ్ల ప్రభుత్వం నిన్ను లేకుండా చేసి పారేయకపోయినా నువ్వు ఈ పాపపు పనులు మానకపోతే దేముడు నిన్ను తుడిచేస్తాడు. గద్దకోళ్ళను తన్నుకుపోయినట్టు నువ్వు క్రైస్తవులను నాశనం చేస్తున్నావు. నేను ఫాదర్ని. పాములా నాకు రెండు నాలుకలు లేవు. సత్యం చెబుతున్నాను. దేముడు చనిపోలేదు. ఇప్పుడు నువ్వు ఆపకపోతే కొన్ని నెలల్లో నువ్వు గ్రహించేటట్టు చేస్తాడు''

శూద్రులకి భయం పుట్టింది. దుర్గయ్యనాయుడితో అన్నారు. " ఈ క్రైస్తవులని బాధపెట్టి ఏం ప్రయోజనం? వాళ్ళ మానాన వాళ్ళని వదిలెయ్యలేవా?'' మాదిగవాడలో ఒక నుయ్యి ఉంది. మిషనరీ వెనుకే అందరూ అక్కడికి వెళ్ళారు. మునసబు ఆ నూతిలో తుమ్మచెట్లు తోయించాడని దొర విన్నాడు. ఆ చెట్ల వాసనతో నీళ్ళు తాగటానికి పనికి రాకుండా పోయాయి. దుర్గయ్యనాయుడిని వెట్టి వాళ్ళ చేత ఆ చెట్లని తీయించెయ్యమని అభ్యర్ధించాడు. అవి తీసేసేవరకూ అక్కడే నిలబడ్డారు. ఆతరువాత చెరువు దగ్గరికి వెళ్ళాడు. పోలేరమ్మ విగ్రహాన్ని చూశాడు. ఆ అవమానకరమైన దృశ్యాన్ని వివరించితే విన్నాడు. చాలా బాధపడ్డాడు. ఒక ఏడాదిపాటు క్రైస్తవులని సహించమని కోరాడు. వాళ్ళలోని విశ్వాసాన్ని ఆ ప్రాంతమంతా చూడనీయమన్నాడు. ఈ మధ్యలో దేముడు దుర్గయ్య నాయుడిని మారుస్తాడు. లేకపోతే దేముడు ఏదోలా జరిగినదానిని సరిదిద్దుతాడు. దాంతో వాళ్ళకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభిస్తాయి. అని చెప్పాడు. ఆ పగలంతా ఉన్నాడు. సాయంత్రం గుర్రం మీద ఎక్కి కొడలూరు గ్రామంలో తరవాతి మకాంకి బయల్దేరాడు. డేరా వెళ్ళిపోయాడు. అతను ఉన్న తోపు ఖాళీ అయిపోయింది.

మాదిగలకి ధైర్యం లేకపోలేదు. వాళ్ళ నరాలలో ఎన్నో తరాల క్రితం వీరుల నెత్తురు ప్రవహించిందని రుజువు చేస్తూ ధైర్యంగా ప్రవర్తించారు. దుర్గయ్య నాయుడి ముందు పారిపోయిన వాళ్ళు ఓ రోజు పదిహేను మైళ్ళలోని కొడలూరికి నడిచివెళ్ళి అక్కడ బాప్టిజం తీసుకుందామని నిర్ణయించుకున్నారు. వాళ్ళు పద్దెనిమిది మంది. వాళ్ళని చూసినపుడు మిషనరీ సంకోచించాడు. ఏం జరిగినా నిలబడటానికి సిద్ధంగా ఉన్నామని వాళ్ళు ధృఢంగా చెప్పటంతో కాదనలేకపోయాడు.

దుర్గయ్య నాయుడికి ఒక్క విషయం స్పష్టంగా తెలిసింది. చెరువు నీళ్ళతో క్రైస్తవ మతాన్ని కడిగెయ్యలేం. ఇష్టం లేని వాళ్ళ చేత గేదెల మేకల రక్తంతో బలవంతంగా పోలేరమ్మ పూజలు చేయించలేం. అతను మళ్ళీ ఆ ప్రయోగం చెయ్యలేదు. శూద్రులకి, తమకి మధ్యనున్న పాత సంబంధాలు క్రైస్తవులు వదులుకున్నారు గనుక ఈ కొత్త పాలనలో శూద్రుడికి వాళ్ళ వల్ల ఎలాంటి అవసరమూ లేదని నిరూపించటానికి నిశ్చయించుకున్నాడు. గ్రామంలో శూద్రుల భాగం నుంచి మాదిగలకు ఎలాంటి సంబంధమూ లేకుండా చేశాడు. మామూలు రోడ్ల మీద నడిస్తే వెట్టి వారు అడ్డుకున్నారు. గ్రామ సంతలోకి రాబోతే పొమ్మన్నారు. కాదన్న వాళ్ళని చితకగొట్టారు. ఎవరూ పనిలోకి తీసుకోలేదు. తినటానికి ఏమీ లేకపోయింది.

కొందరు శూద్రులు దుర్గయ్య నాయుడికి నచ్చజెప్పారు. కాని అతను శపథం చేశాడు. బండెడు రూపాయలు ఖర్చయినా సరే కూచిపూడిలో ఒక్క క్రైస్తవుడు కూడా లేకుండాపోయే వరకూ నేను నిద్రపోను.

రెండు నెలల తర్వాత మిషనరీ ఒంగోలు చేరాడు. తొలి రోజుల పద్ధతి ప్రకారం అతను ఆసారి సుదీర్ఘమైన పర్యటన చేశాడు. ఈ రోజులలో పది మిషన్ స్థలాల పర్యవేక్షణలో ఉండే స్థలమంతా ఆయన ఆ రోజులలో తన స్థలంగా భావించేవాడు. క్రైస్తవులు ఉన్న 98 గ్రామాలను చూశాడు. 27 స్థలాలలో మకాం వేశాడు. 1067 భక్తులకు బాప్టిజం యిచ్చాడు. మిషన్ కాంపౌండ్లోకి వచ్చి పోయే వందలాదిమంది కూచిపూడి మత ద్వేషంలోని ఇటీవల పరిణామాల గురించి మాట్లాడుకోవటం మిషనరీ గ్రహించాడు.

నెలవారీ సమావేశంలో అందరూ ఆ మతద్వేషం వివరాలు వినాలనుకున్నారు. దాదాపు వెయ్యి మంది ప్రేక్షకులు ఆదివారం ఉదయం ప్రార్ధనా సమావేశంలో గూమిగూడారు. కూచిపూడి క్రైస్తవులు ఓ పది మందీ, బోధకుడూ ఆ కథ చెప్పటానికి అందరి ముందూ నించున్నాడు. కన్నీళ్ళతో మనసులో ఉన్న

బాధంతా చెప్పారు. ఇంక భరించలేమన్నట్టు కనిపించారు. చాలామంది ఆకులు అలములూ తింటున్నారు. ఎదురుగా ఉన్న ఆకలికి వణికిపోతున్నారు.

అనేకమంది పాత బోధకులకి దేముడు చెయ్యి విపరీతమైన శక్తితో కదులుతుందని, విశ్వాసంతో జరిపే ప్రార్థన వృధా పోదని అనుభవరీత్యా తెలుసు. ఏదో ఊహాతీతమైనది జరగాలన్నట్టు భక్తితో ప్రార్థనలు చేశారు. కూచిపూడి మునసబు ఒక ఊరి క్రైస్తవులను ఆకలి మంటలలోకి నెట్టగలిగితే అన్నిచోట్లా శూద్రులు తమ మనసు రాయి చేసుకుని క్రైస్తవులను అలాంటి ఆపదలోకి గెంటారా? అది అందరి సమస్యగా అర్థం చేసుకున్నారు. చందాలు వసూలు చేశారు. బాధితులకి కుటుంబానికి ఒక రూపాయి చొప్పున యిరవై ఏడు రూపాయలు పంపారు. వాళ్ళకోసం బజారు మూసేస్తే ఆ డబ్బేం చేసుకుంటారు?

ఆ ప్రాంతంలో బోధకులు ఎవరినో ఒకరిని నియమించి క్రైస్తవులున్న గ్రామాలకి వెళ్ళి ధాన్యం పోగు చేయించమని అడిగారు. అందులో ఒకతన్ని నియమించారు. అతను పోగుచేసిన రెండు బళ్ళ ధాన్యంతో కూచిపూడి వచ్చాడు. ఒక కొత్త ఆదర్శం తాలూకు ప్రయోగం వేలాది నేత్రాల ముందు ప్రదర్శించబడింది. అణచివేయబడిన మాదిగలు సహోదర ప్రేమతో ఒకరికి ఒకరు తోడయ్యారు!

ఏప్రిల్ 30వ తారీఖున కూచిపూడి వెట్టి వాళ్ళు మునసబు బల్లవంటి దుర్గయ్య నాయుడు చితికి నిప్పంటించారు. అగ్ని అతని దేహాన్ని భస్మం చేసింది. మతద్వేషి చనిపోయాడు. ఒంగోలుకి లేఖ పంపారు. నువ్వు లొంగకపోతే దేముడు నిన్ను లేకుండా చేస్తాడని దుర్గయ్య నాయుడిని ఆ దైవం ముందుగా హెచ్చరించలేదా? అనుకున్నాడు మిషనరీ. ఊరూరా వార్త పాకిపోయింది. బరువులు పట్టుకుని వెళ్ళే వెట్టివాళ్ళు దుర్గయ్య నాయుడి మరణం గురించి వార్తలు మోశారు.

ఆ ఉదయం పూట జనవరి 30వ తారీఖున మిషనరీకి దుర్గయ్యనాయుడికీ మధ్య నడిచిన సంభాషణను అనేకమంది గుర్తు చేసుకున్నారు. "క్రైస్తవులను నువ్వు ద్వేషించటం మానుకోకపోతే మూడు నెలల్లో నిన్ను దేముడు చంపేస్తాడ"ని ఆయన చెప్పలేదా? సరిగ్గా మూడు నెలల తర్వాత అదే రోజున చనిపోయాడు. కోపంలో మిషనరీ తన చేతిని దుర్గయ్య నాయుడి భుజం మీద వేశాడు. సర్వశక్తిమంతుని తీర్పుని గురించి హెచ్చరించాడు. అది మేం చూశాం అన్నారు కొందరు. అదే భుజం మీద ఆ చోటే కాన్సరు వచ్చిందట. వైద్యుల శక్తికి లొంగలేదు. విపరీతమైన బాధపెట్టింది. నిశ్శబ్దంగా భరించాడు. క్రైస్తవులను ధ్వంసం చేస్తానని శపథం చేసిన శక్తి మట్టిలో కలిసిపోయింది. ఆ విధంగా చావు దానికి అంతమయింది. అందరిలోనూ భయం వ్యాపించింది. హృదయాలో క్రైస్తవులంటే ద్వేషమున్నవాళ్ళు ఏదైనా హాని చేయటానికి ప్రయత్నించే చేతులు వణికాయి. కాని క్రీస్తు నామాన్ని ధరించిన వారందరూ, ఆనందాశ్చర్యాలలో కూడా హుందాగా మౌనం వహించినా ధైర్యం వచ్చింది ఎందుకంటే వినేందుకు చెవులూ, చూసేందుకు కనులూ మాత్రం ఉన్నవాడు తమ దేవుడు కాదని, అతన్ని విశ్వసించేవారికోసం యుద్ధం కూడా చూస్తాడని వారు స్వయంగా చూశారు.

కూచిపూడి మాదిగవాడలో ఇప్పుడు శాంతి ఏర్పడింది. ఆఖరు రోజులలో శూద్రులు కూడా దుర్గయ్యనాయుడికి దూరమయ్యారు. "నీకు తగిన శాస్త్రి జరిగింది. క్రైస్తవుల మీద చెయ్యి ఎందుకు ఎత్తావు?" అన్నారు. ఇప్పుడు క్రైస్తవులని పనులకు రమ్మన్నారు. దయగా చూశారు. కాని దుర్గయ్య నాయుడి యింటిలో విషాదం వ్యాపించింది. మిషనరీ పెట్టిన శాపం తగిలిందని అందరూ సామాన్యంగా అనేవారు. నాయుడి భార్య కోటప్పకొండ వెళ్ళి కోటప్పస్వామిని వేడుకుంది. తన కుటుంబం మీంచి శాపం తొలగిపోవాలని కోరుకుంది. ఇంటికొచ్చి కలరాతో జబ్బుపడింది. బోధకుడిని పిలిచి మందు యిప్పించమని పట్టుపట్టింది. శాపబలం తగ్గుతుందని ఆశపడింది. ఆమె చనిపోయింది. ఇద్దరు కొడుకులు పెద్దవాళ్ళయ్యారు. కుటుంబ పెద్దలయ్యారు. కాని యింట్లోనూ చావులే. పశువుల్లోనూ చావులే. "ఇదంతా ఫాదర్ దొర శాపం" అనుకున్నారు జనం.

పదిహేను ఏళ్ళు గడిచాయి. చెరువుకి ఎదురుగా క్రైస్తవుల వాడకి దగ్గరగా మిషనరి వచ్చి తోపులో మకాం చేశాడు. దుర్గయ్య నాయుడి కొడుకులు దగ్గరకి వెళ్ళటానికి కూడా భయపడ్డారు. తండ్రి చేసిన పాపాన్ని అతని చావునీ గుర్తుచేసుకున్నారు. బోధకుడు వాళ్ళని భయపడవద్దని చెప్పాడు. మీరు క్రైస్తవుల మీద దయగానే ఉంటున్నారు కదా?" అని ధైర్యం చెప్పాడు. 'మేమూ చనిపోతాం' అన్నారు వాళ్ళు.

వాళ్ళ మేనమామ అన్నాడు. " ఇలా ఏళ్ళకి ఏళ్ళు గడవాలా? మిషనరీ శాపాన్ని తొలగించాలి. " ఒక బోధకుడి దగ్గరకు వెళ్ళాడు. మిషనరీని దుర్గయ్య నాయుడి ఇంటికి వచ్చి ప్రార్థించమని కోరాడు. దానితో ఆ కుటుంబం మీద శాపం తొలగిపోతుందన్నాడు. బోధకుడు ఆ అభ్యర్థనతో డేరాలోకి వెళ్ళాడు. "వాళ్లు క్రైస్తవుల పట్ల దయగా ఉంటున్నారా?" అడిగాడు మిషనరి. బోధకుడు అతనిని నమ్మబరిచాడు. "నా గుర్రానికి జీను తగిలించండి" అన్నాడు మిషనరీ.

దుర్గయ్య నాయుడి యింటికి పరుగెత్తాడు. మేనమామ. కుటుంబమంతా పోగయింది. మిషనరీ కోసం కుర్చీ వేశారు. బెల్లం పళ్ళూ అతనికివ్వటానికి టేబులు మీద పెట్టారు. మిషనరీ ఇద్దరు బోధకులతో వచ్చాడు. ఇంట్లోకి సగౌరవంగా తీసుకువచ్చారు. పిల్లలని ఎత్తుకుని ఆడాళ్ళు ఓ పక్కన నిలబడ్డారు.

"పాపకర్మలు ఇక్కడ నుంచి పోయాయా?" అని అడిగాడు. "అంతా పోయింది" అన్నారు.

"అయితే నిజమైన దేముడిని మీరు ఎందుకు నమ్మరు?"

అనేకమంది నమ్ముతున్నామన్నారు.

ఓ విధంగా కుటుంబానికి పెద్ద అయిన మేనమామ మాట్లాడాడు. "మీ దేముని దయ మా కుటుంబంమీద పడాలి. మీ దేముడు మీ ప్రార్థన వింటాడు. మీరు ఈ స్థలంలోనే మమ్మల్ని దయగా చూడమని ప్రార్థిస్తే మేం తిరిగి సంతోషమయమైన కుటుంబం అవుతామని మేం నమ్ముతున్నాం"

ఈ కుటుంబానికి పాత నిబంధన (Old testment) గురించి తెలియదు. యెహోవా ఏర్పర్చిన న్యాయం ప్రకారం తండ్రుల పాపాలు కొడుకులకు చుట్టుకుంటాయి. ఆ న్యాయం ముందు ఆ కుటుంబం తలవంచింది. మిషనరీ ఆయన బోధకులు ఇద్దరూ "నిన్ను ద్వేషించే వాడిని నీవు దీవించు" అన్న కొత్త నిబంధన సూత్రానికి ప్రాతినిధ్యం వహించారు. ఆ కుటుంబంకి శాంతి ప్రసాదించమని మిషనరీ ప్రార్థించాడు. ఆ ఇంటిమీద అలముకున్న విషాద మేఘాలు తొలగిపోయాయి. పళ్ళూ పంచదారా కానుకలు స్వీకరించమని తన బోధకులకి సౌంజ్ఞ చేశాడు. అందరి కృతజ్ఞతాభివందనాల మధ్య గుర్రం ఎక్కి తన బసకి బయల్దేరాడు.

కూచిపూడి చెరువు గట్టున పోలేరమ్మ విగ్రహం మరెన్నడూ నిలవలేదు. మిషనరీ బళ్ళ మీద మూట గట్టిపడేశారు. ఒంగోలుకి తీసుకెళ్ళారు. మిషన్ ప్రాంగణంలో గత చిహ్నంగా మిగిలింది.

# 1.ఒక గొప్ప సంక్షోభం

1876-78 ల మధ్య కరువులో జీవించిన అనేక మంది నాకు తెలుసు. ఆ రోజులోని పిల్లలో చాలామందికి సరైన ఎదుగుదల లేకపోయింది. కొందరి ముఖాలమీదకి అకాల వృద్ధాప్యం వచ్చేసింది. అయితే ముసలివాళ్ళు ఒక కరువుని గుర్తు చేసుకొనేవారు. బహుశ అందులోఅసాధారణమైన భయానక దృశ్యాలు ఉండి ఉండొచ్చు. ఎందుకంటే ఆ కరువులో మనుషులు మనుషులను తినేవారు అని అందరూ అనేవారు. నాకది నమ్మబుద్ధయేది కాదు. 1876-78ల మధ్య వేలాది మంది మరణించినా, ఆకలి కరాళ నృత్యం మనుషులని భీతావహం చేసినా ఎలాంటి నరమాంస భక్షణా చిహ్నాలనీ తను చూడలేదని నా భర్త చెప్పేవారు. దాంతో 1836 కరువు మనుషుల్ని తిన్న కరువుగా ఎవరైనా నాతో అంటే అది చూసిన వాళ్ళెవరైనా నీకు తెలుసా అని అడిగేదాన్ని. ఒకామె నాతో చెప్పింది. ఆమె తల్లి పొరుగింటి మనిషి, ఒక ఆడమనిషి తన బిడ్డను కుండలో పెట్టి ఉడకబెట్టడం చూశానని చెప్పిందట. ఇది నాతో చెబుతున్నప్పుడు ఆమె గొంతు చిన్నదయిపోయింది. ఇది చెప్పటానికి కూడా వీల్లేనంత భయానకమైనది.

మాదిగలలో అధికశాతం ఏడాది పొడవునా ఆకలితో మాడారు. పంటలు పోయిన మొదటిసారే వాళ్ళ గడపలో ఆకలి ప్రవేశించింది. విత్తనం మొక్కవటానికి తగిన తడిని యివ్వకుండానే మరో వానాకాలం గడిచిపోయేసరికి వారి కష్టం ఇనుమడించింది. మాదిగలు శూద్రుల సహాయం కోసం వెళ్ళారు గాని పంచుకోవటానికి వాళ్ళ దగ్గర ఎలాంటి పంటా లేకపోయింది. వాళ్ళకే తిండానికి లేదు. బంగారమూ వెండీ తిండి కోసం అమ్మకోడం ఆరంభించారు. కాని ఆకలిదప్పులతో పశువులు చనిపోతున్నాయి. ఆకలితో బక్కచిక్కిన ఆ పశువుల దుమ్ములని అంటుకొని ఉన్న మాంసంతో మాదిగలకి అప్పుడప్పుడు తిండి దొరికేది. కలబంద మొక్కల ఎర్రటి పళ్ళు తిండి అయ్యాయి. చాలామంది ఆకులూ అలములూ తినసాగారు.

"బొర్డు, సన్నటి సీసా, లోపలి మట్టి" దగ్గరికి నిత్యం ఒంగోలు మిషనరీ రాక అతననుభవిస్తున్న ఆందోళనకి గుర్తు, దగ్గరవుతున్న కల్లోలాన్ని ఎదుర్కొనేందుకు అతను అనేక పద్ధతులను యోచించాడు. ఒంగోలుకి అతను వచ్చి పదేళ్ళయింది. అతను తన వాళ్ళని 3269 మంది క్రైస్తవులుగా లెక్కించాడు. దాదాపు అందరూ మాదిగలే. పంటలు సమృద్ధిగా ఉన్నపుడే వాళ్ళు ఎంత పేదవాళ్ళో దిక్కులేనివాళ్ళో అతనికి క్షుణ్ణంగా తెలుసు. అంతగా అతను వాళ్ళలో ఒకటయిపోయాడు. నానాటికి ఆ మిషన్ కాంపౌండ్‌లో పెరుగుతున్న శుష్కదేహాలు అతను వరండాలో కనిపించినపుడల్లా మేం చచ్చిపోతున్నాం. చచ్చిపోతున్నాం. అని అరవటం అతనిని ఏదో ఒకటి చేయమని వెన్నాడుతోంది.

బోధకులు అరిగిపోయిన వాగ్దానాలతో వచ్చి వెళుతున్నారు. మిషన్ బంగ్లాలో జరుగుతున్నది వాళ్ళకి కొంత తెలుసు. అమెరికాకి సహాయార్థం నివేదికలు పంపారు. మద్రాసులోని ప్రభుత్వంతో లేఖలు నడుపుతున్నారు. చిట్టచివరగా వాళ్ళని ఓ కబురుతో పంపించారు. తవ్వకానికి మిషనరీ ఒక కాంట్రాక్ట్ తీసుకుంది. రాజుపాలెంకి వస్తే కూలి సంపాదించుకుని తగినంత తిండి తెచ్చుకోవచ్చు. ఆంగ్ల ప్రభుత్వం అనేక సహాయ చర్యలు చేపట్టింది. మద్రాసు నుంచి ఉత్తరంగా బెజవాడ వరకూ తూర్పు తీరంలో బకింగ్‌హామ్ కాలవ నిర్మాణం ద్వారా పెద్ద ఎత్తున సహాయ చర్యలు ఆరంభించింది. ఈ కాలవలో మూడు మైళ్ళ భాగం తవ్వటానికి ఒంగోలు మిషనరీ కాంట్రాక్ట్ తీసుకుంది. ఒంగోలుకి పదిమైళ్ళు తూర్పున సముద్రం ఒడ్డుకి దగ్గరగా రాజుపాలెంలో సహాయ శిబిరం ఏర్పాటయింది.

ఇరవై మంది కూలీలను తోడు తీసుకుని ప్రీచర్స్‌లో ఒకరిని కాంప్ నిర్మించటానికి ముందుగా పంపారు. గుడిసెల వరస ఎక్కడ వెయ్యాలో వీధులని ఎక్కడ వెయ్యాలో మిషనరీ వచ్చి చూపించాడు. వెదుళ్ళు, తాటిచెట్లు సముద్రపు ఒడ్డున విస్తారంగా ఉన్నాయి. గ్రామస్థులతో తాటాకులు, వెదురు వాసం కోసం మాట్లాడటానికి పంపారు. అంత లోతు లేకుండా నీటిమట్టం పైకి ఉండటం వల్ల నూతులు తవ్వారు. చుట్టుపక్కల కుమ్మర్లకి కుండల కోసం బయానా ఇచ్చారు. ఓ రాగి డబ్బుకి కుండలు కొనుక్కుని, ఎక్కడ పడితే అక్కడ దొరికే పుల్లలు ఎండుటాకులతో నిప్పు చేసుకుని ఆకలితో మాడుతున్న జనం వంట చేసుకోటానికి ఏర్పాట్లు జరిగాయి.

అనుకున్న సమయానికి అనేక మంది క్షుధార్తులతో దూరదూరాల నుంచి ఫ్రీచర్స్ ఒంగోలుకి వచ్చారు. బస్తాలతో కోమట్లని రాజుపాలెంకి ముందే పంపాడు మిషనరీ. అక్కడ ఉన్న ఫీచర్‌కి ఒంగోలుకి వచ్చారు. బియ్యం బస్తాలతో కోమట్లని రాజుపాలెంకి ముందే పంపాడు మిషనరీ. అక్కడ ఉన్న ఫ్రీచర్‌కి మధ్యాహ్నానికి చాలామంది జనం వస్తారు. తయారుగా ఉండమని కబురంపాడు. రెండు గంటలలో జనం రావటం మొదలెట్టారు. అక్కడున్న బోధకునికి అతని సహాయకులకీ వస్తున్న జన సమూహం ఒక పెద్ద సముద్రతరంగం వస్తున్నట్లు కనిపించింది. గుడిసెలు క్షణాల్లో నిండిపోయాయి. కుటుంబాలకి మొదట అవకాశం యిచ్చారు. జాగా లేనివాళ్ళు చెట్ల క్రింద పడుకున్నారు.

ఆ రాత్రి ఫిర్యాదులు తగాదాలు చూడాలి! ప్రతివాళ్ళకీ ఆ రాత్రికి తిండి దొరికేలా ఏర్పాటు చేశాక మిషనరీ కాంప్‌కి వచ్చాడు. అందరినీ క్రమంలో పెట్టడానికి ప్రయత్నించాడు. ఆకలితో మాడిపోతున్న వాళ్ళతో ఎవరు వాదించగలరు? కుండలు

కావాలంటారు. ధాన్యం కోసం కుమ్ములాటలు. ముగ్గురు ప్రీచర్స్ (బోధకులు) గుడిసెల మధ్య అటూయిటూ తిరుగుతూనే ఉన్నారు. తిండి కోసం ఆదుర్దాలో తాటాకులు, వెదుళ్ళు వంటకి ఉపయోగించకుండా చూడవలసి వచ్చింది. ఈ పంటలలో ఏ మాత్రం పొరపాటు జరిగిన గుడిసెలు అంటుకుంటాయి.

పొద్దుటే తవ్వకం మొదలయింది. ముప్పై మంది ప్రీచర్స్ ఓవర్‌సీర్లయారు. సామాన్యమైన గునపాలు, పారలూ పంచారు. మగాళ్ళు తవ్వుతూంటే ఆడవాళ్ళు మట్టిని తట్టలలో ఎత్తారు. ఓ పక్కకి తీసుకెళ్ళి దానిని ఒంపి వస్తున్నారు.

తొలి రోజులలో ప్రీచర్స్ కూడా తవ్వాలని మిషనరీ పట్టుబట్టాడు. "మీరు తిరిగి వచ్చి బొబ్బలెక్కిన చేతులు చూపిస్తే తవ్వడం ఎంత కష్టమో మీకు తెలుసునని నాకు నమ్మకం కలుగుతుంది. అప్పుడే మీరు ఎవరి మీదా నిర్దయగా ఉండరు." ఆకలిగొన్న ప్రజలను పనిచేయించటంలో కొందరు కఠిన వైఖరి తీసుకోవచ్చునని ఆయన భయపడ్డాడు. అనేకమంది ఓవర్‌సీర్లు బొబ్బలెత్తే వరకూ తవ్వి దొరకి చూపించామని; అప్పుడాయన "నువ్వు మంచి ఓవర్‌సీర్‌వవుతావని" అన్నాడని వాళ్ళు చెప్పారు.

ఒంగోలులో కోమటి శెట్లు ఉన్నారు. రాజుపాలెంలో ఈ కాంప్ నుంచి లాభాలు చేసుకోవచ్చుననుకున్నారు. వండీ వండని తిండి గింజలను కాంప్‌లోకి తెచ్చారు. చవక గనక జనం కొన్నారు. రోగాలు పెరిగాయి. మందులు ఇవ్వటానికి వెళుతూంటే మిషనరీ ఆహారం గురించి ఆరా తీశాడు. " ఈ కాంప్‌లోకి పాడయిపోయిన తిండి గింజలను తెచ్చే కోమటిని నాకు చూపించండి" అన్నాడు. ఇద్దరు కోమట్లు కొత్త సరుకుతో వస్తున్నారని ఆయన గుడారానికి కబురు వెళ్ళింది. దొర వాళ్ళ వేపు రావటంతోనే సంచీలు పారేసి భయంతో పరుగుదీశారు. సంచులు తెరిచారు. పండీ పండని ధాన్యం బయటపడింది. స్వయంగా తన కాళ్ళతో ఆ ధాన్యాన్ని ఇసుకలో కుమ్మేసి మరెవరూ తినటానికి కనపడకుండా చేశాడు. ఆ తర్వాత ఆ కాంప్ దుకాణాలలో పరీక్షించి తినదగ్గదే అన్న తిండి గింజలు మాత్రం అమ్మారు.

కూలులు బాగున్నాయి. కొంతకాలం పనిచేసిన వాళ్ళు ఇళ్ళకు వెళ్ళారు. చుట్టాలనీ మిత్రులనీ పంపారు. రోగులని ఎత్తుకుని తీసుకువచ్చాడు. అస్సలు పనిచేయలేని వాళ్ళకి కొంత సహాయం చేశారు. కాంప్‌లో సమృద్ధిగా ఉన్నప్పటికీ ఒక ప్రమాదం పొంచి ఉంది. కొందరు అప్పుడే వచ్చిన వారు ఆకలికి తట్టుకోలేక ఉడికీ ఉడకని అన్నం తిన్నారు. అలాగే పడుకుని చనిపోయారు. అనేకసార్లు అర్ధాకలితో ఉన్నవారు వస్తే వెంటనే తినకుండా ఆపటానికి ప్రీచర్స్ ప్రయత్నించారు. "కంగీ అనేది ఓ రకమైన గంజి లాంటిది తాగటానికి యిచ్చారు. కాని వాళ్ళు వినేవారు కాదు. "ఫరవాలేదు. నన్ను తిననీయండి. ఆకలితో చస్తున్నాను" అనేవారు. బోధకుల సలహాలు తిండి మీద తపనలో కోపం మాత్రం తెప్పించేవి. కొందరు ఎంత బక్కచిక్కిపోయారంటే, ఎంత తిన్నా ఆకలి తీరేది కాదు. తరచుగా తినేవారు. వాళ్ల ఆకలిదేహాలు తట్టుకోలేనంత తినేవారు. ఎక్కడో కదలకుండా పడి ఉంటే వెళ్ళి చూసేసరికి చనిపోయి ఉండేవారు.

మరణాల సంఖ్య చాలా ఎక్కువ. రోజుకి ఎంతమంది చనిపోయేవారో ఎవరికీ తెలీదు. చనిపోయిన వాళ్ళని కప్పెట్టడం బ్రతికున్న వాళ్ళకి చాలా కష్టంగా ఉండేది. వాళ్ళు చెయ్యగలిగిందల్లా మోసుకుని వెళ్ళి పక్కనున్న బొమ్మజొమ్ముడు డొంకలలో పారేయటం. మిగిలిన పని రాబందులు, కుక్కలూ, నక్కలూ చేసేవి. బంధువులలో చనిపోయిన వాళ్ళు ఉండేవారు. ఆ గట్టి నేలలో గొయ్యి తీసి కప్పెట్టడానికి ఎవరూ ఉండేవారు కాదు. బాధ తాలూకు పదునుని అసహాయత్వపు నిరాశ తీసివేసినా ప్రేమ మాత్రం రెపరెపలాడుతూనే ఉండేది. ఇసకలో కొన్ని అడుగులు గొయ్యి తవ్వి మృతదేహాన్ని పూర్తిగా కప్పెట్టేవారు. రాత్రివేళ నక్కల ఊళలు భూతప్రేతాల వికటాట్టహాసాలు దూరానికి వినిపించేవి. తెల్లారాక ఆ వైపుకి వెళ్ళటానికి శ్రద్ధ పెట్టేవారు కాదు. ఆ శిబిరంలో ప్రతి ఒక్కరి గుండె విషాదంగా ఉండేది. కొందరు పూర్తిగా భయంలో ఉండేవారు. శిబిరంలో కలరా ప్రవేశించింది. ప్రతి ముఖంలోనూ మృత్యువు తొంగిచూసేది. కాంప్‌కి వస్తున్న దోవలోనే తన భార్య ఎలా కలరాతో మరణించినదీ బోధకులలో ఒకరు నాకు చెప్పారు. భర్తగాని, అన్నదమ్ములు గాని బాగోగులు చూడడానికి లేని ఆడవాళ్లు ఉండేవారు. తల్లిదండ్రులు లేని పిల్లలు ఉండేవారు. అనాధల పట్ల క్రైస్తవం ఎంత దయ చూపిస్తుందో వారు ఇప్పుడు తెలుసుకుంటున్నారు. రోడ్ల మీద పడి చనిపోయే వారి ఎముకలు రోడ్లకి అటూ యిటూ పడుండేవి. వేడి చాలా తీవ్రంగా ఉండేది. వాళ్ళు తవ్వేచోట నీడ ఉండేది కాదు. "మా మనసులు కృంగిపోయేవి. మా దొర జుత్తు ఆ ఏడే తెల్లబడిపోయింది. " అని బోధకులు చెప్పారు.

ప్రతి ప్రీచర్ కిందా వంద మంది పనిచేసేవారు. వాళ్ళు చేసిన పనికి అతనే బాధ్యుడు. ప్రతిరోజూ సాయంత్రం వాళ్ళు అతని నుంచి కూలి పుచ్చుకునేవారు. చాలామంది వచ్చిపోతున్నా తనకింద పనిచేస్తున్న బృందంతో అతనికి సామీప్యత ఉండేది. పగటిపూట కొంతమంది కొద్ది విశ్రాంతి కోసం అపుడపుడు కూర్చునేవారు. వారితో ప్రీచర్ కలిసి మాట్లాడేవాడు. వాళ్ళు కష్టాలు చెప్పుకునేవారు. కళ్ళలో అనంత విషాదంతో తడిపొడి మాటలతో చెల్లాచెదురైన కుటుంబాల గురించి చనిపోయిన వారి గురించి చెప్పుకునేవాడు. "మేమందరం చనిపోతున్నాం" అన్నది వారి చివరి మాటగా ఉండేది. ఆ సమయంలోనే ఓదార్పు కావాలి. " ఆ బోధకులు చెప్పిన ఓదార్పు మాటలు మరచిపోలేం.

రక్తదాహంతో నిరంతరమూ భూమి మీదకే చూచే భూతాల గురించి ఎవ్వరూ ఆలోచించలేనంతగా ఉన్నాయి ఆ గడ్డురోజులు. తిండి కోసం భూతాలన్నీ కలిసికట్టుగా భూమ్మీద బ్రతికున్న అన్నింటినీ చంపెయ్యటానికి గుమ్మిగూడితే ఎవరు ఆపగలరు?

వాటన్నింటినీ ఎవరు శాంతింపజేయగలరు? మాదిగలలో ఉన్న సంప్రదాయాలు, దేవతలూ వీటిల్లో ఏ ఒక్కటైనా అన్నీ నడిపే హస్తం ఒకటుందని, అదే దయతో మార్గం చూపిస్తుందని వారిని ఓదార్చగలవా? నమ్మించగలవా? ఆశ కల్పించగలవా?

విశ్రాంతి తీసుకుంటున్న వాళ్ళతో కలిసి కూర్చున్నపుడు బోధకులు చెప్పారు. "మా దేముడు కష్టాలను కల్పించడు. ఎందుకంటే ఆయన మానవుల కోసం దాహార్తుడై ఉన్నాడు. ఇవి మన మీదకు రావటాన్ని ఆయన నిరోధించలేదు. ఎందుకంటే మానవులు తప్పులు చేస్తున్నారు. వారికి ముక్తినివ్వని దేవుళ్ళని పూజిస్తున్నారు. మన కోసం మరణించిన ఏసుక్రీస్తు మన కష్టాలన్నీ తన మీద వేసుకున్నాడు. ఆ తర్వాత బోధకులు తమ వద్ద ఎప్పుడూ ఉంచుకొనే కొత్త నిబంధన తీసుకుంటుంటారు. అందులో వాక్యాలు చదువుతారు. అవి జనాల బాధాకృత హృదయాలకు కష్టాలకు చల్లని లేపనం పూసినట్లుంటాయి. "నా వద్దకు రమ్ము" నీ బరువులను బాధలను కొనిరమ్ము. నేను నీకు విశ్రాంతినిచ్చెదను. " ఈ వాక్యాలు మరీ ముఖ్యంగా వారికి సేదదీర్చేవి. ఆ తర్వాత వారు పనికి తిరిగి వెళ్ళేవారు. కొంతసేపయాక అడిగేవారు. "నీ పవిత్ర గ్రంధంలోంచి ఆ పద్యం తిరిగి చదువు" వాళ్ల మతాలలో సంప్రదాయాలలో రామానుజ మతం కానీండి నజరయ్య మతం కానీండి అలాంటి వాఖ్యలు వారు ఎన్నడూ వినలేదు. వాళ్ళ పాత సంప్రదాయాల జ్ఞాపకాలను తవ్విపోస్తుంటే వాళ్ళ ఆలోచనలు స్తంభించిపోయేవి. వారి దుర్భర దుఃఖంలో స్వస్థతా స్పర్శ కోసం జీసస్ క్రీస్తు వైపు మరలారు.

మూడు మైళ్ళ తవ్వకం ఒప్పందం ముగిసింది. ఎనిమిది నెలల పని ముగిసింది. వానలు వచ్చాయి. అనేక మంత్రాలతో విత్తులు నాటారు. కాని అవి నేలమీదే కుళ్లిపోయాయి. తూర్పువైపు వరండాలో దొర నిలబడి వాళ్ళ కుటుంబాలకోసం ఇళ్ళకి తీసుకువెళ్ళటానికి అందించేవాడు. దొరసాని పడమటి వరండాలో ఉండి ఆకలిగొన్న బిడ్డలతో వచ్చే స్త్రీలకు నిత్యం తిండి గింజలు యిచ్చేది. అయినా ఒంగోలులో మిషన్ బంగ్లాకి వచ్చే జన సంఖ్య చాలా ఎక్కువగా ఉండి సరిపోయేది కాదు. నలుగురు క్రైస్తవులు పోలీసులుగా దుస్తులు వేసుకుని పనిచేసేవారు. పని ఒత్తిడి హెచ్చుగా ఉండేది. పంట యింటి నుంచి బంగ్లాకి మధ్యాహ్న భోజనం తెచ్చే సేవకులు వాళ్ళ నెత్తిల మీద పైకి పట్టుకుని పాత్రలను తెస్తూ పరిగెత్తుకుని రావలసి వచ్చేది. ఎక్కడబడితే అక్కడ అన్నార్తులు వాటిని లాగేసుకునేవారు. కాంపౌండ్ చుట్టూ డొంకలలో ప్రతిరోజూ ఉదయం శవాలు దొరికేవి. వాళ్ళు సహాయానికి వచ్చినవారే కాని ఇంక వారికి ఎలాంటి సహాయమూ అక్కరలేదు.

బోధకులు ఊళ్ళ నుంచి వచ్చి విషాదాన్ని ఏకరువు పెట్టేవారు. ముఖ్యంగా వృద్ధులూ చిన్నపిల్లలూ క్రైస్తవులలో చనిపోతున్నారని చెప్పేవారు. మిషనరీ యిక్కడికీ అక్కడికీ సహాయం చెయ్యటానికి వెళ్ళగలిగేవాడు కాదు. కేంద్ర స్థానంలో అతను ఉండితీరాలి. తనకి సహాయకులుగా బోధకులని పంపించవలసి వచ్చేది. క్రైస్తవులకి డబ్బులు యివ్వటానికి వాళ్ళు ఊళ్ళన్నీ తిరిగేవారు. వాళ్ళు దోవలో ఎదురుపడి ఒక భోజనానికి సహాయం చేయమని అడిగితే ఎవ్వరినీ తిరస్కరించటానికి వీల్లేదని ఆజ్ఞలు జారీచేశారు. సాయాన్ని కోరే వారిలో ఆశపోతులు లాక్కునేవాళ్ళూ కూడా వారికి ఎదురయేవారు. చిట్టచివరికి కుటుంబానుబంధాలలో సున్నితత్వం కూడా మొద్దుబారేది. ఒకే కుటుంబంలో వృద్ధులకీ బలహీనులకీ సహాయం అందుతుంటే బలమైనవారు వాళ్ళతో గొడవపడేవారు. వాళ్ళకీ సహాయం అందించినందుకు అసూయపడేవాడు.

మళ్ళీ వానలు వచ్చాయి. ఎడ్లూ, పోతులూ చనిపోయాయి. మనుషులే నాగళ్ళను మెడల మీద వేసుకున్నారు. పంట ఎదుగుతుండగా మిడతల దండు వచ్చి సర్వనాశనం చేసింది. మద్రాసు రేవులోకి ఆహారం నిండిన ఓడలు వచ్చాయి. ప్రభుత్వం ప్రజలని రక్షించటానికి చెయ్యగలిగిందంతా చేసింది. మాన్షన్ హౌస్ ఫండ్ సహాయంతో ఒంగోలులో అడిగిన వాళ్ళకందరికీ జొన్న విత్తనాలను పదిరూపాయలకే బస్తాలు తీసుకువెళ్ళారు. మాదిగలకి రాబోయే పంటలో ఎంతో కొంత యిస్తానని మాట ఇచ్చారు. ఆ కరువులో అనేకమంది ఒంగోలు వచ్చి మిషనరీకి తమ కష్టాలను చెప్పుకున్నారు. సహాయంతో ఓదార్పుతో తిరిగివెళ్ళారు. ఆ తర్వాత సంవత్సరాలలో అనేకమంది ఈ విషయాన్ని గుర్తు చేసుకున్నారు. చివరికి మాదిగలతో సహా సమాజంలోని అట్టడుగు వర్గాల వారిని ఆకలి నుంచి కాపాడేందుకు నిరంతరం సిద్ధంగా ఉంటూ ఒంగోలు పట్టణంలో జరుగుతున్న కార్యక్రమం క్రైస్తవానికి ఉన్న బలాన్ని ప్రదర్శించింది. వేలాదిమంది కళ్ళలో ఆశ్చర్యం నింపింది. ప్రతి ఒక్కరూ "ఇది చాలా మంచి మతం" అన్నారు.

అనేక మాసాల తర్వాత రాగులు పంట తొందరగా వచ్చింది. ఆ తర్వాత వరి తగినంత పండింది. ఒక గొప్ప సంక్షోభం ముగిసింది. దాని తదనంతర ప్రభావం ఏమిటి?

# 2. ఆధునిక పెంతకోస్ట్

కరువు ముగిసాక బోధకులు తమ తమ స్థలాలకు వెళ్లేసరికి అనేకమంది బాప్టిజానికి సిద్ధంగా ఉండటం కనిపించింది. అంతకు ముందు అర్ధమనస్కంగా ఆహ్వానించిన గ్రామాలు పూర్తిగా ద్వారాలు తెరిచాయి. కరువుకు ముందు అనేక ఏళ్ళుగా జీసస్ క్రీస్తు గురించి చెప్పిన వాళ్ళందరూ ఇప్పుడు తమకు క్రీస్తులో నమ్మకం కుదిరిందన్నారు.

ఆ తొలి ఒంగోలు బోధకులందరూ చెప్పుకోదగ్గ బృందం. వారిలో ఎందరో సహజ నాయకులు. కొందరు ఎక్కువ విశ్రాంతి అవసరమైనవారయినా గొప్ప దైవభక్తిపరులు. “వారికి విశ్వాసం ఉంది. దేముడిని ప్రార్థించితే ఆయన వారిని వింటాడు” అనేవారు జనం. చాలామందికి ఇవాంజలిస్ట్ వరం ఉండేది. ఇతరులు వెళ్ళనిచోట్లకి వెళ్ళేవారు. వాళ్ళు ప్రయాణం చేసిన చోటల్లా జనం “మనమీ కొత్త మతంలో చేరటం మనకు మంచిది” అనేవారు. చాలామంది బోధకులు ఫాస్టర్స్‌గా స్థిరపడ్డారు. మధ్యలో ఉన్న ఓ గ్రామాన్ని కేంద్రంగా చేసుకున్నారు. చుట్టూ ఉన్న ప్రాంతాలలో కార్యకలాపాలు నిర్వహించారు.

మిషన్ స్టేషన్‌కి దూరంగా ఉన్నచోట్ల వాళ్ళంత వాళ్ళు పనిచేయగలిగేట్టు తన మనుషులలో బాగా పనిచేసేవాళ్ళను నియమించాడు మిషనరీ. పరిస్థితుల ఒత్తిడుల మధ్య నిలబడే సామర్థ్యం చాలా మంది అభివృద్ధి చేసుకున్నారు. ఉత్సాహ తరంగం గట్టిగా పనిచేసే వాళ్ళతో బాటు అంత శక్తిమంతులు కాని వాళ్ళని కూడా వాళ్ళ శక్తికి మించిన పనులు చేయించింది. ఆ కాలంనాటి ఉత్సాహశక్తి అసాధారణమైనది.

కరువుకి నాలుగేళ్ళ ముందు రామపట్నంలో ఒక థియోలాజికల్ సెమినరీని ప్రారంభించారు. అందులో పనిచేసిన తొలికార్యక్రమంలో అనేకులు ఒంగోలులో ఒక ఏడాది పాటు కలిసి చదువుకున్నారు. వాళ్ళు చదువుకున్నారు. కాని ఆ రోజులు ఎంత విలువైనవో వారికి తెలుసు. దాని గురించి విన్న వాళ్ళెందరో యింకా తెలుసుకోవాలని కబుర్లు పంపేవారు. చాలా కబుర్లు వస్తున్నాయి గనుక మీరు వెళ్ళి తీరాలని మిషనరీ చెప్పిన రోజు సమీపించింది. వారికి తిరగి చదువుకునే సమయం వస్తుందని ఆయన మాట యిచ్చాడు గాని ఆ సమయం మళ్ళీ రాలేదు. వాళ్ళు చెప్పినట్టుగా వెళ్ళి బరువులు ఎత్తుకున్నారు గాని కనీసం ఒక్క సంవత్సరమైనా వాటిని దించుకోలేకపోయారు.

గొప్ప ఆలోచనతో వాక్పటిమతో గాని వారి బోధనలు ఉండేవి కావు. కేవలం క్రీస్తు కథ ఆయనని సిలువ వెయ్యటం మళ్ళీ మళ్ళీ చెప్పేవారు. ఆ ఆదిమ క్రైస్తవ రోజులలో అదే చాలా ఎక్కువగా ఉండేది. క్రీస్తు జీవితం, చావూ కథని ఎంతో హత్తుకునేలా చెప్పటంతో వారి మాటలకి ఆలోచనలకీ క్రీస్తుని కేంద్రబిందువుగా చేసింది. క్రీస్తుని అనుసంధానించే ఒక మృదువైన అంతశ్శక్తి ఒంగోలు తొలి క్రైస్తవులలో ఉండేది. అది చాలామందిలో అరుదు. వాళ్ళందరూ కలిసి కూర్చుని క్రీస్తు వేదనామయ గాథను ఒకరికొకరు చెప్పుకుని కన్నీరు పెట్టుకొనేవారు. “ఆ రోజుల్లో ఆయన (క్రీస్తు) మీద ప్రేమ అటువంటిది” అని నాతో అన్నారు.

ఇప్పుడు వీళ్ళంతా కలిసి మిషనరీకి వచ్చారు. వందలు, వేలాది మంది బాప్టిజంకి సిద్ధంగా ఉన్న విషయం మాట్లాడాలని వచ్చారు. “కరువు ముగిసే వరకూ ఆగండి” అని మిషినరి చెప్పేవాడు. కరువుకి ఒంగోలులో యిచ్చే సహాయం యింక జరగదని ఆయన కబురు పంపించాడు. మరింత సహాయం దొరుకుతుందన్న ఆశతో కొందరు చేరవచ్చని ఆయన భయపడ్డాడు. పదిహేను నెలలుగా ఒక్క బాప్టిజం కూడా జరగలేదు. ఆయనకి తనేం చేస్తున్నదీ తెలుసు. అనేకమంది గుంపులుగా వచ్చి బాప్టిజం అడుగుతుంటే తిరస్కరించాడు. ఒకమారు లాకులు తెరిస్తే ఎవ్వరూ ఆ ప్రవాహాన్ని ఆపలేరని ఆయనకి తెలుసు. బోస్టన్‌లోని మిషన్ సెక్రటరీ నుంచి లేఖ వచ్చింది. “అడిగిన వారికి నువ్వు బాప్టిజం యివ్వటం లేదని వింటున్నాను. నీకిలా చేసే అధికారం ఎవరు యిచ్చారు?”

1878లో జూన్‌లో తన సహాయకులకి లేఖలు రాశాడు మిషనరీ. ఒంగోలుకి ఉత్తరాన పదిమైళ్ళ దూరంలో గుండ్లకమ్మ నది ఒడ్డున చింతల తోపులో ఉన్న రహదారి బంగ్లా వద్దకు రమ్మన్నాడు. కలరా మశూచికం పల్లెటూళ్ళలో ఉండటం వల్ల అవి ఒంగోలులో వ్యాపించకుండా జాగ్రత్తపడ్డాడు. వాళ్లతో అత్యవసర విషయాలు మాట్లాడవలసిన క్రైస్తవులను మాత్రం తీసుకురమ్మన్నాడు. మతం మారాలనుకున్న వారిని వదిలేసి రమ్మన్నాడు. ఆయన ఆజ్ఞలకు విరుద్ధంగా బోధకుల వెనకే మతం మారాలనుకున్న వాళ్ళు వచ్చారు. వెల్లంపల్లికి మిషనరీ వచ్చేసరికి అనేకమంది బాప్టిజం కోసం వచ్చినవాళ్ళు ఎదురయ్యారు.

ఆయన ఒక గోడ ఎక్కాడు. అందరి మొహాలలోకి చూశాడు. వాళ్ళకి యివ్వటానికి తన వద్ద మరేమాత్రం ధనం లేదని చెప్పాడు. యిళ్ళకి తిరిగివెళ్ళమని కోరాడు. “మాకు సహాయం అవసరం లేదు. బొబ్బలెక్కిన చేతులే మా పనికి సాక్ష్యం. మేం పని కొనసాగించాలనుకుంటున్నాం. కనుక మాకు బాప్టిజం యివ్వండి.” వాళ్లు అరిచారు. ఆయన సంకోచించాడు. వాళ్లు మళ్లీ అరిచారు. ఇంక వదిలేశాడు. బోధకులతో మాట్లాడాడు. జనం తరుపున వాళ్ళు కూడా వాళ్ల కోరికను తెలియజెప్పారు. క్రీస్తు చర్చిలో ప్రవేశించాలని ప్రార్థించేవారిని ఆయన తిరస్కరించలేకపోయాడు.

మొదటిరోజు ఒక మర్రిచెట్టు కింద ఇసుకలో అందరూ దగ్గరదగ్గరగా కూర్చున్నారు. అక్కడ అందరి అభిమానాన్ని దోచుకున్న పాటలలో అందరూ గొంతు కలిపారు. ఆశబ్దాల మధ్య

సరైన సమన్వయం లేకపోవచ్చు గాని అందులో పాల్గొన్న వారందరి చిత్తశుద్ధి ద్యోతకమవుతోంది. కరువులో వారందరూ నేర్చుకున్న వాక్యాలు మిషనరీ బోధించాడు. "నా వద్దకు రమ్ము. నీ బరువు బాధలు కొని రమ్ము". గంటన్నరసేపు మాట్లాడాడు. ఎవరూ విసుగెత్తలేదు. వారి కష్టాలను వారితో సహా ఆయనా భరించాడు. కనుక ఒక సంపూర్ణ అనుభవంలో అందరూ భాగం వహించటం గూర్చి మాట్లాడగలిగాడు. గుండ్లకమ్మ నదీతీరాన ఆ ప్రార్ధన ఆ రోజులలో అత్యంత ప్రముఖమైనది.

మరుసటిరోజు పొద్దుటే పెద్ద ఎత్తున ఎవరెవరో తెలుసుకునీ సమావేశం మొదలయింది. బోధకులందరినీ వారి వారి ప్రాంతాలవారీ జనాన్ని విడదీయమన్నాడు. ఒక్కొక్కరూ వాళ్ళ వాళ్ళ ప్రత్యేక రంగానికి చెందిన వాళ్లని తీసుకుని వేరువేరు చెట్ల కిందకి వెళ్ళారు. అలా అనేక గుంపులు ఏర్పడ్డాయి. కొన్నింటిలో వందలమంది ఉంటే కొన్నింటిలో కొందరే ఉన్నారు. ఒక్కో బోధకుడికీ అతని గ్రామంలోని మాదిగ కుల పెద్దలు, ఇతర కుటుంబ పెద్దలూ సహాయపడ్డారు. ఈ ఉద్యమంలో తెగ లక్షణాలు కనబడ్డాయి. ప్రతి సమూహమూ గ్రామాలుగా ఆ తర్వాత కుటుంబాలుగా విభజించారు. అయితే యీ తెగలక్షణం ప్రభావం కొద్దిగ మాత్రమే ఉంది. కొత్త జీవితంలోకి ప్రవేశించాడని వారికి సాక్ష్యంగా నిలబడేవారు లేకపోయారు. ఎవరికి వారే సాక్ష్యం. అందరి పరిస్థితీ అలాగే కనిపిస్తోంది.

వెల్లుంపిల్లిలో ఆరోజులు గురించి పాత బోధకులను నేను అనేక ప్రశ్నలు వేశాను. అందులో ఒకరు అన్నారు. "దాదాపు వంద మందితో నేను ఒకపక్కన ఉన్నాను. దొర నా దగ్గరకు వచ్చి నీకు వీళ్ళందరూ తెలుసా అని అడిగారు. నాకు అందరూ తెలియదు అని చెప్పాను. నాతో కలిపి అందరినీ పర్యవేక్షించాడు. వాళ్ళు గ్రామాలకు ఆయన లోగడ వెళ్ళాడు. నాకు తెలియని వాళ్ళందరినీ ఆయన పంపెయ్యమన్నాడు. కాని వాళ్ళు వెళ్ళలేదు. శిబిరానికి చుట్టుపక్కల ఉండిపోయారు. అయితే నాకు తెలిసిన వాళ్ళ పేర్లే నేను రాశాను" ఇది సాధారణంగా జరిగే పద్ధతి.

ఒక అసిస్టెంటు ప్రీచర్ కథని కొందరు చెప్పారు. ఇప్పటికి కూడా తను చేసిన దానిని పెద్దగా చేసి చెపుతాడు. అప్పుడు కూడా అదే లక్షణాన్ని ప్రదర్శించాడు. కనీసం అయిదు వందల మందిని తనతో తీసుకువచ్చాడు. మిషనరీ వాళ్ళని చూశాడు. ఆ ప్రదేశానికి బాధ్యత వహించే ప్రీచర్‌ని పిలిచాడు. వీరు నిజమైన క్రైస్తవులుగా ఉంటారని నువ్వు ఎంతమందికి జవాబుదారీ వహిస్తావు. అని అడిగాడు. అతనో పది మందిని ఎంచాడు. మిగిలిన వారికి బాధ్యత వహించటానికి అతను సంకోచించాడు. అసిస్టెంట్ ప్రీచర్‌కి అది చాలా చెడ్డరోజు. దొర అతన్ని మందలించి అతన్ని అతనితో వచ్చిన వారినీ పంపేశాడు.

నేను తరచు అడిగే ప్రశ్న ఏంటంటే "ఒక స్త్రీ గాని పురుషుడు గాని క్రైస్తవులు అని నువ్వు ఎలా చెప్పగలవు?" "మేం అనేక రకాలుగా చెప్పగలం. ప్రార్ధిస్తున్నపుడు, పాటలు పాడుతున్నపుడు వారిలో దివ్యజీవితం ఉందని మాకు తెలుసు. సారా మానేసి, గొడవలు వదిలిపెట్టి, చచ్చిన గొడ్డుమాంసం తినటం మానేసి, ఆదివారాలు విశ్రాంతి తీసుకుని వాళ్ళలో మార్పు కనిపిస్తుంది. అది కూడా మాకు తెలుసు" అన్నారు. వెల్లుంపిల్లిలో బాప్టిజం తీసుకున్న వారిలో చాలామంది కరువుకు ముందే నిజమైన క్రీస్తు విశ్వాసులు. ఏదో కారణాల వల్ల ఆగినవారు. ఒక మార్పు వచ్చిందని వారి మాటలను బట్టే ప్రీచర్స్ చెప్పగలిగేవారు. మతం ఇచ్చిన వారికన్నా నిరాకరించిన వారి పట్లే ప్రీచర్స హెచ్చుగా ఆందోళన పడుతున్నట్లు, శ్రద్ధ వహిస్తున్నట్లు కనిపించింది. వందలకొద్దీ జనాన్ని తిరిగి పంపేశారు. ఈ రోజున కూడా ప్రీచర్‌ని కొన్ని గ్రామాలలో అంటూంటారు. "మా జుత్తులు కత్తిరించమని మేం వెల్లంపల్లి వచ్చాం. బాప్టిజం ఇవ్వమన్నాం. యివ్వలేదు. అప్పుడు మీరు అంగీకరించిన వాళ్ళ దగ్గరకే వెళ్ళండి. మీరు మాకు అక్కరలేదు."

1878 జులై రెండవ తారీఖు మొదటిరోజున 614 మంది బాప్టిజంతో ప్రారంభం జరిగింది. తరువాత రోజున 2222 మంది, మూడోరోజున మరో 700 మంది, మూడు రోజులకీ కలిపి మొత్తం 3536. గుండ్లకమ్మ నదిలో నీరు ఆ సమయానికి బాగా లోతుగా ఉంది. ఒక్కోసారి యిద్దరు చొప్పున ఆరుగురు అర్హత పొందిన ప్రీచర్స్ ఈ కార్యక్రమం నిర్వహించారు. ఒక్కొక్కరి పేరూ పిలిచేవారు. ఎలాంటి ఆలస్యమూ అయోమయమూ లేకుండా ఒకరితర్వాత ఒకరుగా వచ్చారు. "నిన్ను తండ్రి నామమున, కుమారుడి నామమున, పవిత్ర ఆత్మనామమున నేను నీకు బాప్టిజం యిచ్చుచున్నాను." అని ప్రీచర్ ఒకరిని ప్రకటించగానే, రెండవ ప్రీచర్ ముందు మరొకరు సిద్ధంగా ఉండేవారు. చర్చి చరిత్రలో అత్యంత పవిత్రమైన పదాలను ఉచ్చరించే వారు బాప్టిజం తీసుకునేవారు. ఆ విధంగా ఒక రోజులో 2222 మంది బాప్టిజం స్నానం చేయించటం సాధ్యపడింది.

మిషనరీ పక్కనే ఉండి సహాయం చేస్తూ మార్గదర్శకత్వం చేశాడు. ఆ రోజుల్లో ఒక్కరికి కూడా ఆయన స్వయంగా బాప్టిజం యివ్వలేదు. ఒక భారతదేశపు నది ఒడ్డున జరిగిన ఈ సంఘటనకి క్రైస్తవ ప్రపంచపు విశ్వాసాలకు మధ్య ఒక లంకెలా నిలబడ్డాడు. తన స్వదేశంలో అనేకమంది హృదయాలు భక్తితోను, సంతోషంతోనూ పొంగిపోతాయని ఆయనకు తెలుసు. అయితే విమర్శకులు కూడా ఉంటారు. క్రైస్తవ బోధనల తాలూకు అత్యంత ప్రాథమిక సమాచారం తప్ప మరేమి నేర్వని జన బాహుళ్యానికి తొందరపడి క్రీస్తు చర్చిలోకి ప్రవేశం కల్పించినందుకు ఆయన్ని తప్పుపట్టారు. ఇంత జనానికి క్రైస్తవ శిక్షణ యివ్వటానికి ఎన్నో సంవత్సరాల కఠిన పరిశ్రమ అవసరం. ఇంకా అనేకమంది వస్తున్నారు. ఏడాది ముగిసేసరికి 9606 మంది ఒంగోలు చర్చిలో చేరారు. మొత్తం సభ్యత్వం 13000 అయింది. ఆతర్వాత

సంవత్సరాలు కూడా ఆ ఏడాది కొనసాగింపే అయాయి. 1890 మరో మారు 1671 మంది ఒకేరోజున బాప్టిజం తీసుకున్న సంఘటన జరిగింది.

అయితే కరువుకీ యీ ప్రజా ఉద్యమానికి సంబంధం ఏమిటి? ఆకలి కరాళ నృత్యం, కరువు భీభత్సం మధ్య రెండేళ్ళు నలిగిపోయిన జనాన్ని మిషనరీ అతని సహాయకులూ కేవలం మాటలలోనే కాకుండా చేతలలో కూడా చూపించిన బోధనలు నిస్సందేహంగా అనేకమందిని దయామయుడూ సర్వోన్నతుడూ అయిన క్రీస్తు వైపుమరల్చాయి. సర్వశక్తిమంతుడైన దేముడు కరువు వంటి సంక్షోభాన్ని కూడా తన పవిత్ర లక్ష్యానికి సాధనం చేసుకోగలడు. అయితే మాదిగలను క్రైస్తవం వైపు తరలించిన పరిస్థితులలో కరువు ఒకటయినప్పటికీ ఇది ఆరోగ్యకరమైన సామాన్యమైన పరిస్థితి కాదు.

ఈ ఉద్యమానికి అనుకూలించిన పరిస్థితులలో ఇవ్వవలసిన దానికన్నా హెచ్చు ప్రాధాన్యతను కరువుకి యిచ్చినట్టు కనిపిస్తుంది. మొదట కరువు రావటం, సహాయ శిబిరం ఏర్పడటం, వేలాదిమంది బాప్టిజం తీసుకోవటం వరసగా జరగటం సత్యమే. ఈ వరస కార్యాకారణ సంబంధాన్ని చూపిస్తుంది. అయితే కరువు లేకపోయినప్పటికీ క్రైస్తవం వైపు తరలటం అనేది ఇంత భారీ ఎత్తుగా జరిగి ఉండేదని నేను నమ్ముతున్నాను. కరువు లేకపోతే గుండ్లకమ్మ నదీ తీరాన ఆ పెంటకోస్టు దినం జరిగి ఉండేది కాదు. కాని ఇదే మతాంతరులు కొద్దికొద్దిగా వచ్చి ఉండేవారు. సాధారణమైన పెరుగుదల జరిగి ఉండేది.

ఒంగోలు మిషనరీ చరిత్రలో కరువు రెండవ అధ్యాయాన్ని హఠాత్తుగా తెరిచింది. నైతిక, ఆధ్యాత్మిక, సహజ ప్రపంచాలలోని అభివృద్ధి సూత్రాలకి ఈ హఠాత్పరిణామాలు నప్పవు. కరువుకు ముందు పదేళ్ళలోనూ బోధకులు అనుకూల పరిస్థితులలో చాలా శ్రమపడ్డారు. మిషనరీ తన సరిహద్దులను పెంచుకుని బలం కూడగట్టుకోగలిగాడు. సామాన్యమైన పెరుగుదల ఉండేది. మిషన్ శ్రద్ధ తీసుకోవటానికి అనుగుణంగా మతమార్పిడి జరిగేది. కరువూ దాని తరువాత పరిణామాలు లెక్కలకి మించినవి. కరువుకు ముందు సంవత్సరాల గురించి అనుభవజ్ఞులైన బోధకులు చెప్పాక నేను వారిని అడిగాను. "కరువు తర్వాత సంవత్సరాలలో సంగతులు చెప్పండి" అన్నాను. దానికి జవాబుగా వాళ్ళు మరో ప్రశ్న వేశారు. ''చెప్పటానికి ఏముంది. వేలాది మంది రాలేదా జరిగినవి చిన్నాచితకా సంఘటనలు కావు గుర్తుంచుకోటానికి వివరాలు చెప్పటానికినూ''

బలిష్టమైన ఉన్నతమైన జాతికి సైతం ఆకలి ఔన్నత్యాలకు తీసుకువెళ్ళగలిగే అనుభవం కాదు. పిడికెడు అన్నం కోసం అవమానితులైన మాదిగలు మరింత దిగజారిపోయారు. వాళ్ళకి ఏ గేదో, మేకో ఉండి వుంటే వాటిని కూడా పోగొట్టుకున్నారు. దుర్భర దారిద్ర్యంతో, రోగాలతో బక్కచిక్కిపోయినా, కరువు ముగిశాక తిరిగి బతికి బట్ట కట్టాలి. అతనిలో ఎంత ధృఢత్వం ఉన్నా ఉన్న దానికి గట్టి దెబ్బ తగిలింది. ఎవరు సాయం చేసినా వారి మీద ఆధారపడటానికి సిద్ధమయ్యాడు. ఈ స్థితిలో మిషన్ అతన్ని దగ్గరకు తీసుకుని అతనికి ధైర్యం చెప్పి మనిషిని చేసింది. ఆ సమయంలో మిషన్ ఎదుర్కొన్న గడ్డు సమస్యలు కరువు నుంచే ఉత్పన్నమయ్యాయని సులువుగా చెప్పవచ్చు.

మిషన్‌లోని పాతవారు తమ వ్యక్తిగతానుభవాలు చెపుతున్నపుడు మత మార్పిడికి తప్పనిసరిగా దారితీసిన వాటినన్నింటినీ నేను శ్రద్ధగా గమనించాను. పాశ్చాత్య బుద్ధికి తప్పనిసరిగా దైవం పట్ల ఎరుక కలిగించిన అడుగులే ఈ మాదిగలకు కూడా ఎరుక కలిగించాయి. వారిపద్ధతిలో వారు పాపం చేశామన్న అంగీకారంతో వచ్చారు. పశ్చాత్తాపం ఉంది. భక్తి విశ్వాసాలు ఉన్నాయి. ఈ ప్రజా ఉద్యమం మొదలయినపుడు ఈ అడుగులు అసంకల్పితంగా వ్యక్తి సమూహంతో కొంతవరకూ కొట్టుకుపోయాడు. మాదిగ సమాజం పునాదులతో సహా కదిలిపోయింది. వ్యక్తి అనుభవం మొత్తంలో మునిగిపోయింది. కరువుకు ముందు పదేళ్ళ లోతైన ధార్మిక జీవితాంశ దీనంతటికీ ముందు ఉంది. రాలిపోవలసినది ఒక్కమారుగా రాలిపోయినట్లయింది.

కాని మాదిగలు రాజయోగి మతంలోని గురువులను వదిలేశారు. రామానుజ మతంలోని విగ్రహాలను మిషనరీకి తరలించారు. శివమతంలోని లింగాలను పాముల విగ్రహాలను బళ్ళకొద్దీ ఒంగోలు మిషన్ కాంపౌండ్‌లోకి తెచ్చారు. మాతంగికుటుంబం, ఆమె ఉపదేశానికి అయిన ఖర్చు పెట్టుకున్న వారితో సహా వచ్చి క్రైస్తవ బోధకుని అనుమతితో మాతంగి కర్రముక్కలు ముక్కలు చేశారు. తట్టను చించేశారు. నత్త గుల్లలు అలంకరించిన ఎల్లమ్మ కుండలు వందలాది మంది ధ్వంసం చేశారు. మాదిగల పాత సంప్రదాయాలన్నీ తుడచిపెట్టేసి మత విప్లవం క్రీస్తు తప్ప వారికి మరేమీ లేకుండా చేసింది.

ఆధ్యాత్మిక జీవితమూ శక్తీ ఆ తరువాత సంవత్సరాలలో స్పష్టంగా కనిపించింది. గొప్ప ధైర్యం, మత ద్వేషాలకు తలొగ్గకుండా భరించటం వంటి లక్షణాలతో ఉన్నతమైన ఉదాహరణలు నెలకొల్పబడ్డాయి. అయితే మానసికమైన నైతికమైన ఎదుగుదల స్తంభించిపోయి ఆధ్యాత్మికమైన అశ్రద్ధ కూడా ప్రబలింది. బంగారపు తాతయ్య ఒకామెను నా దగ్గరకు తెచ్చాడు. ఆమె ఓ అయిదేళ్ళ కుర్రాడిని నడిపించుకుని వచ్చింది. అప్పటికి కరువు ముగిసి అయిదేళ్ళయింది" నాకూ, నా ప్రభువు ఏసుక్రీస్తుకూ నా ప్రాంతంలో ఈమె గౌరవనీయురాలు. క్రైస్తవం తీసుకున్నపుడు ఈమె భర్త ఏమీ అనలేదు. పదహారేళ్ళ బంగారం లాంటి పెద్ద కొడుకు కొన్నాళ్ళకు చనిపోయాడు. భర్త ఈవిడను హింసించటం మొదలుపెట్టాడు. పాత స్వాములకు పూజలు మానినందువల్లనే తన కొడుకు చనిపోయాడని అన్నాడు. ఆ తర్వాత మరో బిడ్డ చనిపోయింది. నువ్వా కొత్త మతం వదిలెయ్యాలని పట్టుపట్టాడు.

జుత్తు పట్టుకుని నేలమీద ఈడిచాడు. చెట్టుకు కట్టి కొట్టాడు. ఇన్ని కష్టాలలోనూ ఆమె విశ్వాసం సడలలేదు. భర్త ఈమెను వదిలి మరొకరితో వెళ్ళిపోయాడు. మీరీమెని స్కూల్లోకి తీసుకోండి" అని చెప్పాడు.

ఈ సంఘటన మొత్తం దృశ్యాన్ని కాంతిమతం చేసే అపూర్వకాంతులలో ఒకటి. ఎవరైనా ఈ కాంతుల వెనక చీకట్లను రకరకాల దుష్టస్వభావాలను పట్టించుకున్నారా? వారి అజ్ఞానాన్ని అధోపతనాన్నీ తెలుసుకున్నారా? కొన్నేళ్ళ క్రితం నేను నాభర్తతో కలిసి గ్రామాలకు వెళ్ళాను. ఒక చింత చెట్టు కింద తన ఎదురుగా కూర్చున్న కొందరు మాదిగలకు ఆయన దైవబోధ చేస్తున్నాడు. ఆ గ్రామానికి చెందిన ఇరవై మంది క్రైస్తవులు తిరిగి విగ్రహారాధన వైపు మరలారు. వారితో ఆయన మాట్లాడుతున్నాడు. ఉదయమే ఆయన ఆ గ్రామానికి వెళ్ళాడు. వారు తిరిగి పూజిస్తున్న స్వాములను చూశాడు. వాళ్ళు తిరిగి తమ జుత్తు పెంచుకున్నారు. స్త్రీలు మురికి బట్టలతో చింపిరి జుత్తులతో దెబ్బలాడుకుంటూ బూతులు తిట్టుకుంటూ ఉన్నారు. చచ్చిన గొడ్డుమాంసం తిరిగి వాడలోకి వచ్చింది. చెప్పటానికి వీల్లేనంత అసహ్యంగా చీదరగా ఉన్నారు.

వాళ్ళ పరిస్థితినంతటినీ మిషనరీ వివరించి ఒక అభ్యర్ధన చేశాడు. " పేదవారికి గురువు అయినందుకు సిగ్గుపడను. ఎందుకంటే రోగులకి చికిత్స చేయుము, పేదలలో సువార్త వినిపించుము అని క్రీస్తు చెప్పాడు. ఒక్కోమారు మీ ఊళ్ళలో మిమ్మల్ని చూస్తే నా మనులో ఒక బాధ మొలకెత్తుతుంది. ఇంత మురికి మనుషులకు గురువుగా దేముడు నన్నెందుకు నియమించాడా అని ప్రశ్నించుకున్నాను. " అంతా ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. అనుకోకుండా ఆడవాళ్ళు తలలు దువ్వుకోవటం మొదలుపెట్టారు.

ఈ భారతీయ పరియా తెగలలో అట్టడుగున ఉన్న వీరి మొహాలు పరిశీలిస్తుంటే ఎలాంటి బోధలకైనా వారెంత మొండిబారినా వారిలో కదలిక లేకుండాపోలేదు. వారి మొహాలలో సిగ్గు నేను చూడగలిగాను. వాళ్ళు వినటానికి సిద్ధంగా ఉన్నారు. వారిలోని ఈ కదలిక వారిలోని ఆధ్యాత్మిక జీవితం ఇంకా మిగిలి ఉందనటానికి నిదర్శనం. ఎందుకంటే ఆత్మలు చనిపోయిన వారు ఏదీ వినలేరు. పశుప్రాయంగా వందలాది సంవత్సరాలు దారితప్పిన వారు పాపం!

ఇలాంటి గ్రామం మిషనరీకి ఒక్కటి కనిపిస్తే తన జనం చూసుకుని ఆయన గర్వపడే గ్రామాలు అనేకం కనిపిస్తాయి. శుభ్రతగా పొందికగా కనిపిస్తూ ఇళ్ళని ఉంచుకుంటూ వాళ్ళు ఆయన్ని కలుసుకోటానికి వచ్చేవారు. కుటుంబ పెద్దలు ఆయన్ని సాదరంగా ఆహ్వానించేవారు. గ్రామంలో ఒక పాఠశాల దానిలో చేతిలో పలకలతో పిల్లలూ ఉండటం ఆ గ్రామం స్థితికి చిహ్నం. మునసబు కరణాలు దొరకు సగౌరవంగా సలాములు చేసే వారు. క్రైస్తవుల ప్రవర్తన ఈ దొరకు ఆయన మతానికీ గౌరవం తెచ్చిపెట్టింది. ఆయన బోధిస్తుంటే జనం వచ్చేవారు. వారిలో శూద్రులు కూడా ఉండేవారు. ఓ పక్కన కూర్చుని శ్రద్ధగా వినేవారు. "మంచి మతం. మనం విందాం" అనుకునేవారు. అలాంటి గ్రామాలలో ఒక విధమైన ఆధ్యాత్మిక శక్తి ఉత్సాహమూ ఉండేవి. ఆఖరుకు ఒక ప్రశ్న కలుగుతుంది. "క్రైస్తవాన్ని తప్పించి భూమ్మీద మరే శక్తి అయినా అతి తక్కువ సమయములో ఒక్క తరంలో మొత్తం ఒక సమాజాన్ని అభివృద్ధి చేయగలదా?"

# 3. ముగింపు

దక్షిణ భారదేశపు ద్రవిడ గ్రామీణ సమాజం శతాబ్దాలుగా ఎలాంటి సంస్థాగత మార్పులు లేకుండా ఉంది. పరస్పర సహాయం పద్ధతిన గ్రామీణుల చిన్నిచిన్ని అవసరాలు తీరుతుండేవి. వాళ్ళ స్థితితో తృప్తిపడి, పారిశ్రామికంగా సామాజికంగా మార్పులు లేకుండా జీవించారు. ముందుకు పోవాలన్న పోటీ ప్రభావం మచ్చుకైనా లేకుండా పోయింది. ఈ మధ్యకాలంలో విచ్ఛిన్నకర శక్తులు విజృంభించాయి. ప్రాచీన ద్రవిడ వ్యవస్థలు కొత్త పద్ధతిలో సామాజిక జీవితానికి దారి యిస్తున్నాయి.

పూర్వం రోజులలో భూమి సమాజానిది. వృత్తి పనివారి బృందాలు గ్రామానికి సేవ చేసేవి. బదులుగా తమ వంతు పంట తీసుకునేవి. లేకపోతే మరో రూపంలో ఫలం పొందేవారు. పాలించే రాజుకి శిస్తు కట్టడం మొత్తం గ్రామం బాధ్యత. ప్రస్తుతం ఉన్న ఆంగ్లప్రభుత్వం శిస్తుకోసం వ్యక్తిగతంగా రైతుతో వ్యవహరిస్తుంది. పన్నులు నాణేల రూపంలో చెల్లిస్తున్నారు. దాంతో పరస్పర సేవా పద్ధతి జనాదరణ కోల్పోయింది. ఎందుకంటే ప్రతివారూ తన సేవలకు ధనం విలువ గుర్తించటం నేర్చారు. ఉమ్మడి భూకమతాలకు బదులుగా వ్యక్తిగత ఆస్తి రాసాగింది. గ్రామీణ సమాజంలో కలిసి ఉండక తప్పనిసరి పరిస్థితిని అరాచకత్వం చిన్ని చిన్ని యుద్ధాలూ ఇంతకుమూర్వం కల్పించేవి. వర్తమానకాలంలోని శాంతీ సమృద్ధీ అంతర్గత వైరాలకు అవకాశమిచ్చింది. పోటీ, ఒకరిని ఒకరు మించాలన్న కోరికా ఏర్పడ్డాయి. పాత పద్ధతిలోని ఉమ్మడి అవసరాలు వ్యక్తిగత అవసరాలకు దోవయిస్తున్నాయి. ప్రతీది విచ్ఛిన్నమవుతోంది.

మాదిగలు కూడా ఈ మార్పులకు లోనయారు. వాళ్ళు కూడా ప్రభుత్వానికి పన్నులు చెల్లించటానికి వ్యక్తిగతంగా బాధ్యులు. కనుక జీతాలు నాణెం రూపంలో చెల్లించే ఉద్యోగాలు కోరుతున్నారు. పూర్వంలా శూద్రుల మీద ఆధారపడటం నిదానంగా తొలగిపోతుంది. ఒక తెగగా వారు చేసిన దాస్యం ఒక నిర్ణయింపబడిన కూలికి చేసే వ్యక్తిగత సేవగా నెమ్మదిగా మార్పు చెందుతోంది. ఒకప్పుడు కరణాలకు కూలి నాలి లేకుండా పనిచేసిన వెట్టివారు ఈనాడు గ్రామపరిపాలనకు తప్పనిసరి సహాయకులుగా చూడబడటం లేదు. వారి సంఖ్య క్రమంగా తగ్గిపోతోంది. వారి చిన్ని చిన్న భూములు ప్రభుత్వానికి చేరుతున్నాయి. ఎందుకంటే ప్రభుత్వం తన ఉద్యోగులకు నాణాల రూపంలో చెల్లించటానికి ప్రాధాన్యత యిస్తోంది.

మాదిగలు చాలా అభివృద్ధి చెందారు. చిన్న చిన్న రాజాలు వారిని అణచలేరు. దా'స్యం చేయించలేరు. గ్రామాల్లో వారింకా బరువులు మోసేవారే కాని పూర్వంలా కాదు. అప్పట్లో రోడ్లు తక్కువ. రైళ్ళు ఎరుగరు. వారికి ఎంత బరువు మోయగలిగేదీ చెప్పే హక్కు ఉంది. వారి కూలిని తీసుకోటానికి కరణానికి హక్కు లేదు. మర్యాదస్తులైన ఇంగ్లీషువారు జిల్లాలో ప్రయాణం చేసేటపుడు కరణాన్ని ఆరా తీసేవారు. కూలీలకు చెల్లించే జీతాల గురించి అసంఖ్యాకమైన ఫిర్యాదులు వచ్చేవి. కరణం వారికి ఎంత యిస్తున్నాడో తెలుసుకునేవారు. కూలీలకు లాభించేలా క్రమంగా కూలీలు సవరించబడ్డాయి.

మాదిగ స్వతంత్ర ఆంగ్ల పౌరుడు. ఈ వాస్తవం పట్ల చాలా అస్పష్టమైన గుర్తింపు అతనికి ఉండవచ్చు. చట్టం చేయగలిగిన మేరకు ఆంగ్ల ప్రభుత్వం అనాది కాలవు బానిసలకు స్వతంత్రం యిచ్చింది. మనుస్మృతి నిర్దేశాల ప్రకారం, ఒక విధంగా ప్రాచీన సంప్రదాయం ప్రకారం చట్టబద్ధమైన హక్కు శూద్రులకు మాదిగలచేత దాస్యం చేయించుకోటానికి ఉండేది. ఆంగ్ల ప్రభుత్వం దృష్టిలో అలాంటి ఒప్పందాలు వాటి బలీయమైన బాస లక్షణాల నుంచి బయటపడవలసి వచ్చింది.

మాదిగలకు న్యాయస్థానాలు పూర్వం లేవు. ఆంగ్ల చట్టానికి సూత్రరీత్యా, మనిషికీ మనిషికీ మధ్య తేడా లేదు. తన పాలనలో ఉన్న వారిలో అణిచిపెట్టబడిన వారికి న్యాయం చెయ్యాలన్న నిజమైన భావనతో భారత ప్రభుత్వం ఈ మధ్య ఒక నిర్ణయం తీసుకుంది. హిందూ కుల పద్ధతిలో స్థానంలేని తెగలకు "పంచమ" అంటే అయిదవ కులం అన్న గౌరవనీయమైన న్యాయమైన పదాన్ని అంగీకరించి భారతీయ సామ్రాజ్యంలోని పౌరులందరికీ మత స్వేచ్ఛ యివ్వబడింది. అట్టడుగు వారితో సహా అందరికీ విద్యను అందుబాటులోకి తేవటానికి కృషి జరుగుతోంది.

శూద్రులు, బ్రాహ్మణులు వారినింకా వెలివేయబడ్డ వారుగా పరిగణిస్తున్నా మాదిగలు చదువుకోవటానికి అభివృద్ధి చెందటానికి తగిన బాహిర పరిస్థితులు నెలకొన్నాయి. అయితే వారి హృదయాలలో ముందుకు పోవాలన్న వాంఛను నాటేదెవరు? వాతావరణంలోని బలం ముఖ్యమైనదే అయినా దానిని మరింత ఫలప్రదంగా చేసేది లోలోపల ముందుకు పోవాలన్న ఆకాంక్ష. భారతదేశపు నైతిక సామాజిక పరివర్తన చాలావరకూ దాని అంతర్గత శక్తుల కార్యాచరణ మీద ఆధారపడి ఉంది.

ఈ అంతర్గత శక్తులను ఉత్పత్తి చేసేవి ఏవని మనం భావించవచ్చు? కేవలం విద్య వీటిని ఉత్పత్తి చేయలేదు. విద్యాకాంక్ష తప్పనిసరిగా పుట్టాలి. అప్పుడే దాని ప్రయోజనాలు మొదలయాయని చెప్పవచ్చు. మతం దీనికి చోదకశక్తి కాగలదా? భారతదేశం పరియాలలోకి క్రైస్తవం ప్రవేశించినపుడు ఇది కేవలం మతంగా రాలేదు. ఈ మత స్థాపకుని బోధనలు సత్యమే అయితే ఈ మతం ఒక కొత్త వాతావరణాన్ని సృష్టిస్తోంది. దాంతోబాటు ఆత్మను మరణం నుంచి రక్షిస్తుంది. మాదిగల విషయంలో క్రైస్తవం

వారి అత్యవసరాలకు నిలబడగలిగిందా?

తెలుగుదేశంలో అనేక జిల్లాలలో మాదిగలు తగినంత సంఖ్యలో క్రైస్తవులు అవటం వారి సమాజం క్రైస్తవమయిందని చెప్పటానికి సాధ్యం చేసింది. అదీ ముప్పై సంవత్సరాల తక్కువ వ్యవధిలో ఎంత చేయగలదో అంతా చేసింది. ఇదంతా మిషన్ చేసింది అదంతా ప్రభుత్వం చేసిందని స్పష్టంగా చెప్పటం క్రైస్తవ మాదిగ సమాజంగా మే భావించే దానికి సాధ్యం కాదు. ఆంతరంగిక శక్తులూ, బహిరంగ శక్తులు చేసిన పనులు కలిసిపోయాయి. మిషన్‌కి ప్రభుత్వం తోడు దొరికింది. ప్రభుత్వం గుర్తింపు దొరికింది. మిషన్ తన పరిధిలో సాధించినది గుర్తింపుకి అర్థమైనది.

క్రైస్తవం వేపు మాదిగలు తరలటం అనేది బలంగా ఉన్న జిల్లాలలో చిన్న ఎత్తు సామాజిక విప్లవం జరిగింది. పురాతన ఆచారాలు కట్టుబాట్లు వదులుకోవటమే క్రైస్తవం వేపు మరలటానికి అర్ధం. అంటే మాదిగలకు గ్రామానికి ఉన్న సంబంధాలలో మార్పు అని అర్ధం. అంతేకాదు మాదిగ వాడలోనే మార్పు అని కూడా అర్ధం. పాత తెగ విధానాలను అనుకరించే క్రైస్తవ సమాజం నిర్మాణమవుతోంది. మాదిగ నాయకుడు అతనికి సహాయపడే కుటుంబ యజమానులూ ఈనాటి క్రైస్తవ గ్రామంలో "పెద్దలు" అంటే పెద్దవారుగా వ్యవహరిస్తున్నారు. అయితే వారి సరళమైన గ్రామ న్యాయపరిధి సంపూర్ణంగా మారిపోయింది.

క్రైస్తవం మాదిగలకు యిచ్చిన గౌరవం పాతవారికి కష్టం కలిగించింది. కులదేవతలను, గ్రామదేవతలను నిర్లక్ష్యం చెయ్యటం వారికి పాపంగా అనిపించేది. ఏదైనా దొంగతనం బయటపడితే సామాజిక ప్రతిక్రియ ఎంత ఘోరంగా ఉండేదంటే మాదిగ పెద్ద దానిని తప్పు అని మళ్ళీ నిర్వచించవలసివచ్చేది. మనిషి ఉద్దేశ్యాలను 'పాపం' కళంకితం చేస్తుందని వారు అర్ధం చేసుకుంటున్నారు. మంచీ చెడూ తనంతతానే ఎంచుకునే పరిస్థితికి 'పాపం' గురిచేస్తోంది. ఒకప్పుడు దొంగతనానికి వెళ్ళేముందు అతను స్వామికి మొక్కి దొరక్కుండా సహాయం కోరి దొరికిన దానిలో వాటా యిస్తానని ప్రార్ధించేవాడు. "నీవు దొంగతనం చేయరాదు'' అన్నది అత్యంత స్పష్టంగా క్రైస్తవ ప్రవర్తనావళి చెబుతుంది.

క్రైస్తవ బోధకుల సమాఖ్య గురువులుగా మారే వారసత్వాన్ని సమర్ధిస్తుంది. వాళ్ళు తమ భక్తుల మీద పెత్తనం చెయ్యరాదు. "అన్నం వండు. కోడిని కొయ్యి సారాయి తే! అని కూర్చుని ఆజ్ఞాపించరాదు. మామూలు గురువులకంటే పట్టు ప్రీచర్స్‌కి గనక ఉంటే ప్రాంతీయ చర్చిలకి స్వయం పోషకత్వం మరింతగా పెరిగి ఉండేది. మిషన్‌తో వారికి ఉన్నసంబంధం వల్ల ప్రీచర్స్‌కి ఏర్పడిన ఒక విధమైన ఆత్మగౌరవం వారిని అడుక్కోటానికి గాని ఆజ్ఞాపించటానికి గాని దిగజార్చలేకపోయింది. వాళ్ళు తమ భక్తులను మంత్రతంత్రాలతో అయోమయంలో ముంచలేరు. వారి బోధ కేవలం ఏకదైవ ఆరాధన. వారు జనం హృదయాల ముందు ఉంచగలిగినది దైవ పురుషుడు జీసస్ క్రీస్తు.

మాదిగలు భూములు సంపాదించుకుని స్వతంత్రంగా వ్యవసాయం చేసుకుంటే తొందరలోనే పిల్లలను చదివించుకోగలరు. తమ పాతదాసులను అణచిపెట్టి ఉంచాలంటే శూద్రులకు మిగిలిన మార్గం ఒక్కటే. మాదిగలు సొంత భూములు సంపాదించుకోకుండా సొంత వ్యవసాయాలు చేయకుండా అడ్డు తగలటమే. ఏదోలా మాదిగలు భూములు సంపాదించుకున్నా శూద్రులకు వాళ్ళ వ్యవసాయాలలో అడ్డు తగలటానికి అనేక సాధనాలు ఉన్నాయి. అందువల్ల పంటలు పండించాలంటే చాలా కష్టపడాలి.

ప్రభుత్వం ఉదారంగా యిచ్చే సహాయంతో మిషనరీ మాదిగలకి సాధారణమైన విద్యను అందించింది. ఒంగోలులో మాదిగలకు కాలేజి విద్యకు కూడా అవకాశాలు ఉన్నాయి. అయితే స్వయం సహాయపు ముఖ్య నైతికాంశమాత్రం లేదు. తమ కొడుకులను కూతుళ్ళను స్కూళ్ళకు పంపటం ఎంత ఉచితంగా లభించినా మాదిగ కుటుంబాల దృష్టిలో అది పెద్ద త్యాగం. దానికి బదులుగా వాళ్ళు కుటుంబానికి కూలి సంపాదించగలరు. చాలా కుటుంబాల పేదరికం అటువంటిది. పాతమీద ప్రభవించిన ఈ నూతన సామాజిక జీవితం తాలూకు ఆర్ధిక బరువులను మాదిగలు మోయగలిగేవరకూ క్రైస్తవ నాగరికత తాలూకు సంపూర్ణ లాభాలను వారు అందుకోగలరా? మాదిగల సంపూర్ణ విముక్తికి పారిశ్రామిక విద్య మరింత తోడ్పడగలదు. వారికి తెలిసిన పరిశ్రమ ప్రస్తుతానికి చర్మ పరిశ్రమే. చాలా మొరటుబారిన పాత పనిముట్లతోనే వారు అది సాగిస్తున్నారు. మిషన్ ఈ అవసరాన్ని కూడా గుర్తించి దానిని నెరవేర్చాటానికి ప్రయత్నిస్తోంది.

మాదిగలను సాంఘిక ధార్మిక పునర్జీవితాల పట్ల ఉద్యుక్తులను చేసే పనిని క్రైస్తవం నిర్వహించగలుగుతోందా? తప్పకుండా చేయగలుగుతోంది. మాదిగలు అంటారు. "మా పూర్వీకురాలు అరుంధతి మమ్ముల్ని శపించింది. "మీరు ఎంత కష్టపడినా మీ పరిస్థితి మారదు. బట్టలు లేకుండా, విద్య లేకుండా అజ్ఞానంలో అలక్ష్యంలో అందరికి బానిసలుగా జీవింతురుగాక' అంది. ఈ శాపం శతాబ్దాలుగా మామీద ఉంది. క్రైస్తవం దానిని తొలగించింది. ఇది ఇంక లేదు.''

# While Sewing Sandals Or Tales of a Telugu Pariah Tribe ☙ ☙ ☙ By Emma Rauschenbusch-Clough Ph.D Member of the Royal Asiatic Society of Great Britain and Ireland

London Hodder and Stoughton a a 27
Paternoster Row 1899

BY THE SAME AUTHOR
A STUDY OF
**Mary Wollston'ecraft**
AND THE
**Rights of Woman.**
Svo, 234 pp., price 7, 6d.

**PRESS NOTICES**

"The historian of education and opinion will undoubtedly have to give it a place among his authorities" - Speaker.

"Written with a masterly grasp of the subject" - Westminster Review

"Dr. E.R.Clough has written an entirely admirable work"
- Literary Gazette

"The topics are ably handled.... it must be recognised as a book of mark"
- Aberdeen Daily Fru Press.

"It is certain to be prized by many has a valuable addition to their library" - Dundee Courier

"The work of a careful and thorough student" - Glasgow Herald

"An important contribution to the history of the modern advancement of women" - Outlook

"... a brilliantly temperate book, and one that is exceedingly well written... with a display of rare and particular knowledge.... She never Shrieks; she always speaks by the book; she does not clamour inelegantly; she traces a big historical event with assurance and self-confidence; and she never indulges in wild dreams. Her style is careful, forcible, terse and clear" - Pall Mall Gazertte.

London : LONGMANS, GREEN & CO.

To
My Father
**Professor A. Rauschenbusch D.D**
Who has passed on to me the heritage of ancestors
who bought and suffered for truth this story of
a Telugu Pariah Tribe in Search for
Truth is Affection lately described.

